# నాగార్జున చరిత్ర

(పరిశోధక గ్రంథము)

Suryadevara
Mallikarjunarao.
Vadlamudi





శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ

I

Life of

# NAGARJUNA

"History is the one weak spot in Indian Literature. It is in fact non-existent. The Brahmins whose task it would naturally have been to record great deeds, had early embraced the doctrine that action and existence are a positive evil, and could therefore have felt but little inclination to chronicle historical events."

A. A. Macdonall
(A Htstcry of Sanskrit Literature)

Charitraka Siromani
**Kodali Lakshminarayana**

# తొలిపలుకు. 1665

1940 సంవత్సరములో గుంటూరుజిల్లా బోర్డుఅధ్యక్షులుంగాను, ప్రస్తుతము మనకు స్థానిక స్వపరిపాలనామాత్యులును అయిన శ్రీ కల్లూరిచంద్రమౌళి (B. Sc. Aberdeen) గారు నాగార్జునకొండ కొక విహారయాత్ర నేర్పాటు చేసిరి. పాశ్చాత్యదేశములలో తిరిగి వచ్చినవారుకాన విహారయాత్ర అన్న వీరికి సరదా మెండు. ఈయాత్రాదళములో గుంటూరు మండలములోని ముఖ్యనాయకులు శ్రీ అవుతు రామిరెడ్డిగారు మున్నగు పెద్దలెల్లరు పాల్గొనిరి. నేనుకూడ ఆ యాత్రలో పాల్గొంటిని. ఫిబ్రవరి 23 శుక్రవారమునాటిరాత్రి గుంటూరులో బస్సులమీద బయలుదేరి నరసరావుపేటకు చేరుకొంటిమి. అచట భుజించి, రాత్రియంత దీర్ఘమగు ప్రయాణముచేసి వేకువజామున నాల్గుగంటలకు మాచెర్ల చేరుకొంటిమి. అచట కాలకృత్యములు తీర్చుకొని, మరల ప్రయాణము సాగించి, 24 వ తేది ఉదయము 7 గంటలకు నాగార్జునకొండకు చేరితిమి. అచట కృష్ణానదిలో స్నానముచేసి శిథిలమైన సంఘారామమును, స్తూపమున్న ప్రదేశమును కొండను చిత్రవస్తుప్రదర్శనశాలను గాంచి, ఆంధ్రుల శిల్పకళానైపుణ్యమును, అచటి ప్రకృతిశోభను జూచి బ్రహ్మానందభరితుల మైతిమి.

నాగార్జున యతినిగూర్చి అచటిసభలో నెవరో ఒకరిద్దరు చెప్పిరి; కాని యవియన్నియు చరిత్రకు విరుద్ధములు; ఖండఖండాంతర ఖ్యాతిగన్న నాగార్జునునిగూర్చి పరిశోధించి సమగ్రమగు జీవితచరిత్రను వ్రాసి ఆంధ్రుల కందచేయవలెనను

సంకల్పము, ఆనాగార్జున యతి తపస్సుచేసిన పవిత్రమగు గడ్డయందే, ఆసంఘారామమునందే కలిగినది. ఇది నాగార్జునుని ఆదేశమేమో! బహుగ్రంథావలోకనము చేసి, అనేక శాసనములు, అముద్రితగ్రంథములు పరిశోధించి నేటికి ఈ యోగియొక్క చరిత్రను ఆంధ్రులకందచేయు భాగ్యము గల్గినందులకు గర్వించు చున్నాను. అనేకమైన అవకతవకలను సరిచేసి నిష్పక్షపాత బుద్ధితో, కాలమును, జన్మస్థలమును, కులమును, గ్రంథములను గూర్చి కొన్ని నిర్ణీతమైన సిద్ధాంతములను జేయగలిగినాను. నాశ్రమను దాదాపు పదిసంవత్సరముల కృషిని ఆంధ్రులు, పత్రికాధిపతులు మదరాసుప్రభుత్వమువారు, ఆంధ్రవిశ్వ విద్యాలయాధికారులు పరిగ్రహించకపోరని నమ్ముచున్నాను.

1945 వ సంవత్సరము జూను నెలలో రంగాగారి ఆహ్వానముపై, నేను నిడుబ్రోలులోని రైతాంగవిద్యాలయమున కేగి యుంటిని. అచట నేను రెండుదినము లుపన్యసించియుంటిని. అచటి విద్యార్థులు నాగార్జునుని గూర్చి చెప్పవలసినదని కోరి యుండిరి. కాని అప్పటికి నాపరిశోధన పూర్తికాకపోవుటచేత అప్పటిలో చెప్పజాలనని, త్వరలో పుస్తకము నచ్చువేసెదనని చెప్పియుంటిని. ఈవిద్యాలయములోని విద్యార్థులలో హెచ్చుమంది ఇంటర్ మీడియెట్, బి. ఎ. పరీక్షలలో కడతేరినవారు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, చారిత్రకవిషయముల నేర్చుకొనుటకు దూరదూరప్రాంతములనుండి వచ్చినవారు. అనేకమంది మహిళలుకూడ ఈవిద్యాలయము నలంకరించిరి. ఈవిద్యాలయములో నేను పొందిన ఆనందమునకు మితిలేదు; ఇట్టి విద్యాలయములు ఆంధ్రుల కవసరమని వేరుగా చెప్పనక్కరలేదు.

నాబోటి యువకుని పైకి తీసుకొనిరావలెనను భావముతో శ్రీ రంగాగారు, నేటి ఆర్థికశాఖామంత్రి శ్రీ గోపాలరెడ్డిగారి ఎదుట నన్ను అనేకవిధముల ప్రశంసించిరి.

1947 వ సంవత్సరము మే నెలలో మదరాసు ప్రభుత్వము వారు నాల్గు పుస్తకముల నచ్చువేసికొనుటకు నాకు 900 పౌనులకు కాగితపుపర్మిట్ ఇచ్చినారు. ఇంత ద్రవ్యమును నేను ఒకేసారి చెల్లించలేనిస్థితిలోనుంటిని. వెంటనే కాగితమును, పర్మిట్‌లో నిచ్చిన కాలములోపుగా కొనవలసినదని, తాము సహాయము చేసెదమని కొందరు పెద్దలు ప్రోత్సహించిరి. అట్లు మాటలతో ప్రోత్సహించుటయేకాక స్వయముగా సత్కరించుచు, కొల్లివరవాస్తవ్యులు, గుంటూరుజిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగా అనేకసంవత్సరములు పనిచేసి ప్రజల మన్ననకు పాత్రులైన శ్రీ అవుతు రామిరెడ్డిగారు రు 175 లను ప్రేమతో నొసంగిరి; ఇంకను గుంటూరుతాలూకా క్రొత్తరెడ్డిపాలెము గ్రామకాపురస్థులు ఉడుముల వేంకటరెడ్డిగారు, వారి అల్లుడు గాదె సుందరరామిరెడ్డిగారు నన్ను సత్కరించి అర్థనూటపదహార్లనొసంగిరి. చినకోండ్రపాడు గ్రామకాపురస్థులు, యువకులు సంఘసంస్కరణాభిలాషులు అయిన శ్రీ కె. వి. సుబ్బారావుగారు అర్థనూట పదహార్లు నొసంగిరి. పెదగొట్టిపాడు వాస్తవ్యులు, గుంటుపల్లి సూర్యనారాయణగారు మావరిశోధనలకు సంతసించి రు 25 ల నొసంగిరి. ఈవిధముగా ఈ గ్రంథమునకైన కాగితపుఖర్చును, పైవారుభరించిరి. వీరికి మాకృతజ్ఞతాభివందనములు. ఇంకను మాకు పలువిధముల సహాయపడిన మిత్రులు, శ్రీ ఆలపాటి సూర్యనారాయణగారికి, జ్యోతిపత్రిక మేనేజింగ్

ఎడిటర్ ఆలపాటి రవీంద్రనాథ్ గారికి, అనేకసూచనలు చేసిన శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి M. A. LL. B. గారికి మా వందనములు.

'అయితానగరప్పాడు' వాస్తవ్యులు, చారిత్రకపరిశోధనాభిలాషులు, ధర్మాత్ములు అయిన శ్రీ నన్నపనేని లింగారావుగారు, వారి సోదరుడు శ్రీ గోపాలరావుగారు ఈ మా కృషిని శ్లాఘించుచు ఈ చరిత్రప్రచురణకు రు. 116 ల నొసంగిరి. వీరికి మా నమస్కృతులు.

ఈ గ్రంథము నేదోవిధముగా అనేకములగు వ్యయప్రయాసలకోర్చి బయటకు తీసుకొనిరాగలిగినాను; ఇంకను పదహారుగ్రంథములను ముద్రించవలసియున్నది. తెనాలిలో ఒక చారిత్రక పాఠశాలను, చారిత్రక గ్రంథాలయమును, చారిత్రక సంబంధమగు పత్రికను స్థాపించవలెనను సంకల్పమున్నది. ఆంధ్రులకు చారిత్రకభిక్ష పెట్టిన కీ. శే. లక్ష్మణరావుగారి శిలావిగ్రహమును ప్రతిష్ఠించవలసియున్నది. గ్రీకుచారిత్రక జనకుడు హిరోడోటస్‌వలె, భారతీయచారిత్రకజనకుడు భాండర్కరు పండితునివలె, ఆంధ్రులకు చారిత్రకజనకుడు లక్ష్మణరావుగారు. ఈయనసేవను మనమెన్నటికిని మఱవజాలము.

పైకార్యముల నెరవేర్చుటకు కనీసము ఇరువదివేలరూపాయలవసరము. అల్పమొత్తములతో పూర్తియగునట్టిది కాదు. కనుక ప్రభుత్వమువారు, విశ్వవిద్యాలయాధికారులు, జమీందార్లు, శ్రీమంతులగు దాతలు నాయుద్యమమునకు చేయూత నొసగి పలువిధముల సహాయము చేయుదురని నమ్ముచున్నాను.

మోపఱ్ఱు
1-1-48

కొడాలి లక్ష్మీనారాయణ

# మోపఱ్ఱు గ్రామచరిత్ర

మాగ్రామముపేరు 'ప్రెూంకఱ్ఱు' అని ప్రాచీన శాసనాధారములవలన తెలిసికొనవచ్చును. ఇది మోపఱ్ఱుగా ఎపుడు మారినదో తెలియకున్నది. ఈగ్రామమును ఎపుడు నిర్మాణము చేసిరో తెలియదు; మెకంజీ స్థానిక కైఫీయతులలో మాగ్రామ చరిత్ర కాన్పించలేదు; కాని, ఇతరాధారములచేత నేనీగ్రామ చరిత్రను వ్రాయుచున్నాను.

1920వ సంవత్సరములో మాగ్రామములోని చోడేశ్వర స్వామి ఆలయములోని రెండుశాసనములను శాసనపరిశోధకులు గైకొని, 657, 658, 659 నంబర్లుగా ఆసంవత్సరపు Annual Reports లో ప్రకటించి యున్నారు. ఇవి దక్షిణ హిందూస్థాన శాసనములు 10 వ సంపుటములో రానున్నవి. చోడేశ్వరస్వామి ఆలయమునకు ఎదుటప్రక్కనున్న రాతి బండమీద నొకశాసనము గలదు. (657) ఇది తెలుగులోనున్నది; శా. శ. 1092 విషు సంక్రాంతినాటిది. దీనినిబట్టి 'మహామండలేశ్వర కుళోత్తుంగ రాజేంద్ర చోదయరాజు' యొక్క సేనానాయకుడు (పదవాలు) 'గొంకయ అనువాడు ప్రెూంకఱ్ఱు'లో చోడేశ్వరస్వామి ఆలయమును తన తండ్రియైన చోడపనాయకుని, తనతల్లి 'కత్తసాని' యొక్క కీర్తి నిల్పుటకు గట్టించెనని, ఆలయములో రెండు దీపములు వెలిగించే నిమిత్తము 110 గొఱ్ఱెలను ఒసంగెనని, ఇంకను 'గొంకసాని' తనభర్త 'గొంకినాయకుని' కీర్తి స్థిరముచేయుటకు ఇంకొక

దీపమునకు 55 గొఱ్ఱెలను, స్వామిని త్యనైవేద్యములకు కొంత భూమి నొసంగినట్లు తెలియుచున్నది.

ఆస్తంభముమీదనే మరియొక శాసనముగలదు. (658). అది శా.శ. 1092 చైత్ర అమావాస్యనాటిది. ఇది సంస్కృతము, తెలుగులో నున్నది. దీనినిబట్టి సేనానాయకుడు 'గొంకయ' రెండు శాశ్వతదీపములు, అతని భార్య 'గోకాంబిక' ఒక శాశ్వతదీపము, 'క్రోంపఱ్ఱు'లోని 'శంకరస్వామి'కి ఇచ్చిరని తెలియును. ఆరంభములో 'గొంక' యొక్క వంశవృక్షము గలదు. 'పదవాలు, చోడ' అనువాడు 'వెలనాడు గొంకయొక్క 'బంటు' అని షట్సహస్ర దేశము అనగా ఆరువేలదేశమును, వేంగిని పాలించెనని తెలియుచున్నది. ఈదేవాలయమునకు నియోగించబడిన వేశ్యాంగనలపేర్లు ఇందుకలవు. కృష్ణవేణికి దక్షిణమున నున్న దేశము 'షట్సహస్రదేశమని' ఆరువేలదేశమని పేరు గాంచి యుండెను.

దేవాలయముయొక్క తూర్పుద్వారమునకు దక్షిణవైపున గల రాతిమీద నొకశాసనము (నెం. 659) గలదు. ఒకశ్లోకములో దైర్ఘ్యమానపు కొలతలు అనగా అంగుళ, వితస్తి, దండక అనునవి వర్ణించబడినవి. బొటనవ్రేలియొక్క చుట్టుకొలతలో సగభాగము 'అంగుళము; పండ్రెండు అంగుళములు ఒక వితస్తి. ముప్పదిరెండు వితస్తులు ఒక 'దండక' అనబడును. 'దండక'కు తుల్యమైన 'కేసారిపటి ఘడ' కూడ పేర్కొనబడినది. 'వితస్తి' యొక్క సరియైన కొలతను తెలియపరచుటకు శాసనముపైన, ఒక నిలువురేఖ

కూడ చెక్కబడి యున్నది. అది ఒకఅడుగు మూడుఅంగుళము లకు పైగా ఉన్నది. క్రీ. శ. 11వ శతాబ్దములోని వాడగు పావులూరి మల్లన్న తన దశగణిత శాస్త్రములోకూడ పైమానము, నుదహరించి యున్నాడు.

దీపములు వెలిగించుటకు గొరియలు, మేకలు, ఆవులు, ఎనుములు దానముగా ఇవ్వబడుచున్నట్లు అనేక శాసనముల వలన ఎఱుంగనగును. (See. S. I. I. Vol V. No 1184, No. 1185, Vol IV—No, 1200, etc.) ఈజంతువుల వలన నేయి వచ్చునని, దానితో దీపములు వెలిగించవచ్చు నను దృష్టితో వీనిని ప్రాచీను లాకాలమున దానము చేయు చుండిరి. జంతువులతో బాటు భూదానముకూడ చేయుచుండిరి. (S. I. I. Vol V—121 ,123, 132, 136, 137, 146 etc.) తమిళదేశములోగూడ ఇట్టి దానధర్మములు పెక్కులుగలవు.

పై శాసనములబట్టి క్రీ. శ. 1170 నాటికి ఈ గ్రామము వర్థిల్లుచున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1175 నాటికి, మోటు కూరు పురవరాధీశ్వరుడైన 'సూరయనాయుని' క్రింద 400 గ్రామము లుండెను. అందు ఈ గ్రామముకూడ కలదని ఊహించవచ్చును. 'జయన నాగదేవుభట్టు' తాను రచించిన కొండవీటి దండకవిలెలో, ప్రతాపరుద్రుడు ధరణికోటలో ఉండెనని, 14 సీములు చేసెనని, వ్రాయుచు, మోవట్టు ప్రథ ములు భారద్వాజ గోత్రుల సంప్రీతి ౧ ఖండవిలు ౮౦ అని మోవట్టుపేరు పేర్కొనెను. ఇంకను L. R. 5 సం. 411 వ పుటలో కూచిపూడి గ్రామకైఫీయతును వ్రాయుచు, క్రీ.శ.

1716 లో జరిగిన కంపెణీలో కూచిపూడిసమితిలోని 44 గ్రామములలో వాసిరెడ్డివారికి, మానూరివారికి, భాగరీత్యా వచ్చిన గ్రామములపేర్లు వ్రాయుచు, రమణయ్య మాణిక్యారావుగారి వంతులో వచ్చిన 12 గ్రామములలో 'మోపల్లు' పేరును వ్రాసెను. L. R. V 368 వ పుటలో కోరుతాడిపల్లు కైఫీయతు ఉన్నది. అందు ఆగ్రామము హద్దులు వర్ణించుచు, దక్షిణము 'మోపల్లు' పొలిమేరను 'వామనగుంట' అనిఉన్నది. కోరుతాడిపల్లు అగ్రహారమును, జమ్ములమడక పురుషోత్తమ సోమయాజికి అనవేమారెడ్డి, క్రీ. శ. 1350 ప్రాంతములో దానధర్మముగా నొసంగియుండెను. కనుక రెడ్డిరాజుల క్రిందకూడ 'ప్రోంపల్లు' వర్థిల్లియుండెను. తరువాత కృష్ణరాయలు, వారి వంశజుల క్రింద ఈ గ్రామముండెను. తరువాత ఈ గ్రామము 'ముర్తుజాంనగరు' అను పేరుగల కొండవీటిసీమలోని సత్తెనపల్లి తాలూకాలోనుండి గోల్కొండ నవాబుల పాలనక్రింద యుండెను. 'ముర్తుజాఖానుడు' కొండవీటికి 'ముర్తుజాంనగరు' అని పేరుపెట్టి 14 సముతులుగా విభజించి పాలించెను. అందు పొన్నూరుసమితిలో గల 44 గ్రామములలో 'మోపల్లు' ఒకటి.

1859 డిశంబరులో కృష్ణామండల మేర్పడెను. అప్పుడీగ్రామము పొన్నూరుతాలూకాలో నున్నట్లు ఈనామురికార్డులను బట్టి తెలియుచున్నది. దీనినిబట్టి ఇంకను క్రీ. శ. 1762వ సంవత్సరములో రాజా జంగన్నారావు మాణిక్యారావు అను రాచూరు జమీందారు మోపల్లులోని శ్రీవేణుగోపాలస్వామికి రెండు కుచ్చెళ్లు భూమి నిచ్చెనని తెలియుచున్నది. ఇది తర్వాత

కొల్వగా య. 40-89 అయినది. 1825 నాటికి ఈదేవాలయము శిథిలావస్థలో నుండెనని, తరువాత బాగుచేసిరని 'టిక్ ''టైలరు' దొరల వ్రాతల వలన తెలిసికొనవచ్చును. ఈదేవాలయము మొదట గ్రామమునకు పడమట చిన్న చెరువు త్రవ్విన ప్రదేశములో నుండెనని, తరువాత గ్రామము నడిబొడ్డున తిరిగి కట్టించిరని, పెద్దలవలన విని యుంటిని. 1893 సం. ఫిబ్రవరి 9వ తేదీన గ్రామస్తులు కొందరు, స్వామివారి కల్యాణోత్సవములకు 4య. 63 శెంట్ల భూమినొసంగిరి.

కమ్మప్రభువైన వాసిరెడ్డి వెంకటాద్రినాయునికి సమకాలీనుడైన కల్లూరి జగ్గన్నాయకులు క్రీ. శ. 1800 ప్రాంతమున ముట్లూరులో ఇజారాదారుగా నుండి, అమరావతి వచ్చుచు పోవుచుండెనని, ఒకసారి ఇతని కుమారులను పల్లకీలో తీసుకొని పోయి రాజుకు చూపించగా, "ఇంత సుందరమైన కుమారులను నాకింతవరకు చూపించకపోతివని వేంకటాద్రినాయుడనెనని, అంత రాజదృష్టిదోషము తగిలెనని, వారు పిచ్చివారై పోయిరని పెద్దలు చెప్పుదురు. ఈజగన్నాయకులే ఒకప్పుడు గొప్ప క్షామమురాగా, గోల్కొండ నవాబుల చెంతకేగి, పండ్రెండేళ్ల శిస్తును రద్దుచేయించుకొని వచ్చెనని తెలియుచున్నది. ఈజగన్నాయకుల మనుమడైన మరియొక జగన్నాయకులు చోడేశ్వరస్వామి ఆలయముచుట్టు ప్రహరీగోడను, అనేకగ్రామములలో చందాలు వసూలుచేసి కట్టించెనని, మట్లులగుంట బద్ద మంచినీటి బావిని త్రవ్వించెనని తెలియుచున్నది. చోడేశ్వరస్వామి ఆలయము ప్రక్కనే పెద్దబావి కలదు. చోళరాజులు

ఆంధ్రదేశములో 101 శివాలయములను, 101 బావులను త్రవ్వించిరని ప్రతీతి. ఈఆలయములో ధనము దాచిరని, అష్టదిక్పాలకుల కావలియుంచిరని, చోళరాజులు కోటికిపడగెత్తిరను ప్రతీతి గలదు. ఎంతవరకుసత్యమో! సంగీతవిద్వాంసులైన అంబడిపూడి కోటయ్య అను వైదికబ్రాహ్మణుడు ఈగ్రామముననే జన్మించెను. నాట్యకళలోకూడ వీరికి గొప్పపేరు గలదు. రాజమండ్రి మున్నగు తావులలో వీరనేక నాటకముల ప్రదర్శించిరి. గ్రామోఫోనులోకూడ వీరి ప్లేటులున్నవి. వీరు మరణించినపుడు పలువురు వీరిపైబడి ఏడ్చిరట. తర్క-వేదవేదాంత విద్వత్ శిరోమణియైన పండిత వేదాంతము జగన్నాథాచార్యులవారీ గ్రామములోనే జన్మించినారు. మన స్థానిక స్వపరిపాలనా శాఖామంత్రి శ్రీ చంద్రమౌళిగారు, సుప్రసిద్ధ న్యాయవాది వడ్లమూడి కోటయ్య చౌదరి B. A. B. L. గారు ఈ గ్రామములోనే జన్మించిరి. గాంధిమహాత్ముడు ఆంధ్రదేశసంచారము వచ్చినప్పుడు 1929 ఏప్రియల్ 19 వ తేది రాత్రి 10 గంటలకు మాగ్రామము వచ్చిరి. ఈ గ్రామస్థులు రు. 1116 లు గాంధిగారికి సమర్పించి యుండిరి.

ఈప్రకార మీ గ్రామము క్రీ. శ. 11వ శతాబ్దమునుండి చారిత్రక ప్రసిద్ధి కన్న దనుట కాధారములు గలవు. అంతకు పూర్వ మెపుడు నిర్మాణమైనదో తెలియకున్నది.

'నాగార్జునచరిత్ర' కిది సంబంధము లేకపోయినను, పలువురు గ్రామస్థులు గ్రామచరిత్రను వ్రాయుడని కోరుటచేత వ్రాసి, ఇందుచేర్చితిని. అందుకు చదువరులు క్షమించ వేడెదను.

—లక్ష్మీనారాయణ.

# నాగార్జునచరిత్ర

## I

1 నాగార్జునుడు నివసించినకొండజాడలు. 2 శ్రీపర్వతము శ్రీశైలమా? 3 నాగార్జునకొండను బ్రాహ్మణులు స్వాధీనపరచుకొనుట. 4 ఆంధ్రదేశములో బౌద్ధ జైనమతములు ఖిలమైపోవుట. 5 నాగార్జునకొండ ప్రాముఖ్యత.

### 1. నాగార్జునుడు నివసించిన కొండజాడలు

'నాగార్జున బోధిసత్వుడు' అను ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు నివసించినకొండ శ్రీపర్వతమని, పర్వతమని బౌద్ధగ్రంథములలో పేర్కొనబడి యున్నది. ఈపర్వత వృత్తాంత మెవరికిని నిన్న మొన్నటి వరకు దెలిసియుండలేదు. ఈ పర్వతముపైననే 'నాగార్జునయతి' నిర్వాణము జెందెనని 'త్రిపిష్టపదేశ' బౌద్ధ గ్రంథములు నుడువుచున్నవి. ఈకొండపైననే యతి 129 వర్షముల కాలము తన జీవితమును గడపెనని 'తారానాధుడు' వ్రాసియుండెను. కాని యిది చారిత్రికసత్యము కాజాలదు. బహుశః 29 ఏండ్లు గడపెనేమో? ఈ శ్రీపర్వతము కర్నూలు జిల్లాలోని 'శ్రీశైలమే' యని, కృష్ణఒడ్డున గలదని, 'బర్గెస్, వీరభద్రరావు' మున్నగుచరిత్రకారు లభిప్రాయపడిరి.[1] అధు

---

[1] Indian Antiquary - Vol. XV - The age and writings of Nagarjuna Bodhisatwa By S. Beal - P. 355. "On this hill Nagarjuna is said to have passed 129 years of his life" Scheifner-Taranatha - P. 73)
Dr. Burgess says Srisaila on River Kristna.)

నిక పరిశోధనలనుబట్టి ఈ యూహ తప్పనుట నిశ్చయము. శ్రీశైలము కర్నూలుజిల్లాలో నున్నది. శ్రీపర్వతమునకు దీనికి గల దూరము 50 మైళ్ళు.

నాగార్జునయతి నివసించుటచేతనే దీనికి 'నాగార్జున కొండ' యని పేరు వచ్చినది. తత్పూర్వము ఇది శ్రీపర్వతమని పర్వత మని పేర్గాంచెను. ఈకొండ గుంటూరుజిల్లా పల్నాటితాలూకా లోని మాచెర్ల రైల్వేస్టేషనుకు 15 మైళ్ళ దూరమున ఉత్తరమున కొండలమధ్య కృష్ణానదీ సమీపమున కుడివైపున గలదు. దీనికి ఒకమైలుదూరములో పుల్లారెడ్డి గూడెము గలదు. కొంతకాలము క్రితమువరకు నీకొండప్రదేశము పుష్ప గిరిపీఠమువారి స్వాధీనములో నుండెను. ఫ్రెంచివారు కొండలు, బౌద్ధసారస్వతమును జదివి, నాగార్జునుడున్న కొండ జాడలను దెలిసికొని వచ్చి కొన్ని విగ్రహముల దీసికొని పోవు చుండ, వారిని ప్రభుత్వమువారు పట్టుకొని, విషయ మంతయు దెలిసికొని, విగ్రహములను మదరాసు చిత్రవస్తుప్రదర్శన శాలలో నుంచిరి. అంతట 'ఆర్కి-యలాజికల్ డిపార్టుమెంటు' వారు ఈ ప్రదేశమును పుష్పగిరి పీఠమువారి యొద్దనుండి కొని త్రవ్వించగా, నందు బౌద్ధవిగ్రహములు, సంఘారామములు (విహారములు) స్తూపములు, చైత్యాదులు, బయల్పడెను.

1. విహారము అనగా సంఘారామము. ఇందు గుహాలు లేక చిన్నగదులుండును. ఒక్కొక్కటి చతురస్రాకారము గల్గి స్తంభముల వరుసల యాధారమున నిలబడియుండును.

2. స్థూపము: అర్ధగోళాకారమైన కట్టడము. ఆకారములో మార్పుగానుండును. 'సాంచి' భోజపురములో గలవు.
3. దగోబా- (దేహ్=శరీరము, గుప్=దాచుటకు) ధాతుగర్భ యందురు. బుద్ధుని అస్థులు దాచబడును.
4. చైత్యము- ప్రార్థనాలయము. దానిలో వర్తులాకారమగు చివరభాగములో 'దగోబా' ఉండును.

బుద్ధుని పూర్వజన్మలగు జంతువుల ఎముకలు బరిణెలలో లభించెను. ఒక స్థూపములో నొక బంగారు డబ్బీలో, నొక యస్థి లభించెను. ఇది యిపుడు బుద్ధదేవునిదని యూహించుచున్నారు. ఇది యిపుడు, 'కాశీలోని 'సారనాధు' ఒద్దగల 'మూలగంధ కుటీవిహారము' లో భద్రపరచబడి యున్నది. ఆనాటినుండి కొండను త్రవ్వి పరిశోధించుచుండగా ననేకక్రొత్త విషయములు, దినదినమును బయల్పడుచున్నవి.

పర్వతమనగా నొకరాష్ట్రమని, చౌకయొక్క రాజధానియని 'మూలస్థానపురము'నకు ఈశాన్యముగా 700 లీల దూరములోనున్న నగరమని, ప్రస్తుతపు 'ఫత్తిపూరు' అని లాహోరు, ముల్తానులకు మధ్యనగరమని ఐటల్ పండితుడభిప్రాయపడెను.[2]

కాని ఇది మరియొక కొండకావచ్చును. ఏలనన ఇరువురు చైనీయ పరివ్రాజకులు వర్ణించిన వర్ణన లీకొండకు సరిపో

[2] E. J. Eitel – A hand book of Chinese Buddhism (1888) P. 117.

కున్నవి. 'పాహియాను' (క్రీ. శ. 405-411) ఈకొండనుగూర్చి 'పారావత' మతమునుగూర్చి ఇట్లు వర్ణించియుండెను. "అది మొత్తముమీద ఐదంతస్థులు గల్గియున్నది. అన్నిటికంటె క్రిందది ఏనుగాకారముగా నున్నది. ఈకొండభాగములో 500 గదులు గలవు. రెండవది సింహమాకారముగా నున్నది 400 గదులు గలవు. మూడవదిగుఱ్ఱమాకారముగానున్నది. అందు300గదులు గలవు. నాల్గవది వృషభాకారముగా నున్నది. 200 గదులు గలవు. ఐదవది పారావతాకారమున నున్నది. 100 గదులు గలవు. పైభాగమున నచట నొక సీటిబుగ్గ గలదు. దీని నీరు కొండరాతిలోని గదులముందు, చుట్టు, లోపలికివచ్చుచుండును. అది వంకర వంకరగా బోవుచు, నన్నిటికంటె అడుగుననుండు క్రింది అంతస్థులోనికి వచ్చును. వెల్తురుకు గవాక్షములు గలవు. ఈసంఘారామమును 'పారావత'మందురు. ఇది పోలో-యూ (Po-lo-yu temple-Pigeon monastery.)" [3]

ఐదవ అంతస్థు 'పారావతాకారము' న నుండుటచేత నీకొండ కట్టి పేరుగల్గి యుండవచ్చునని ఊహకల్గుచున్నది. ఈమతమును 'కశ్యపబుద్ధు' డేర్పరచెనని 'పాహియాను' వ్రాసెను.

క్రీ. శ. 7వ శతాబ్దమధ్యములో వచ్చిన 'హూనుత్సాంగు' అను మతిమొక చైనీయు పరివ్రాజకుడు, దక్షిణదేశమును వర్ణించుచు, దక్షిణకోసల (స్యెంతోకియా Se-yen-toh-kia) వృత్తాంతమును జెప్పి, శ్రీపర్వతముపైనున్న 'సంఘారామము' నిట్లు వర్ణించెను. "దీనికి ఆగ్నేయమూల" రాజధానికి 300లీల

---

[3] James Legge – Travels of Pahiyan. P. 96.

(60 మైళ్లు) దూరములో పో-లో-మో-లో-కిలీ (Po-lo-mo-lo-ki-li) గలదు. (Mount of Black bee - భ్రమరగిరి) ఇది చాల ఉన్నతమైనది; ఒక్క-టే రాయిగా నున్నది. ఇచటనే రాజగు 'ఇన్-ఛింగ్ (సద్వాహ) నాగార్జునుని కొరకు, కొండలో (భ్రమరగిరి) నొక సంఘారామమును దొలిపించెను. ఈరాతిబండలో నుండి యొక మార్గమును గల్పించెను. సంఘారామముతో సంబంధముగల్గి, యిది వదిలీల (3 మైళ్లు) పై వరకు గలదు. ఈ సంఘారామమున బౌద్ధసన్యాసుల మఠములు, విశాలమగు చతుశ్శాలలు గలవు. ఈచతుశ్శాలలలో 5 అంతస్థుల కట్టడము గలదు. ఒక్కొ-క్క- యంతస్థులో, విహారములోఁ జుట్టుకొనఁ బడిన నాలుగేసి శాలలుగలవు. ఈఆలయములలో జిత్రకళ లుట్టిపడునట్టి, సర్వాంగసుందరమైనట్టి, బంగారుతో జేయబడిన మనుష్యాకారమున నున్న, బుద్ధవిగ్రహములు గలవు. ఈసంఘారామమునకు నీరు సమృద్ధిగా లభించుచుండెను. కొండలో దొల్చిన గవాక్షములమూలముగా వెలుతురు గదులకు వచ్చుచుండెను. దీనిని తయారుచేయుటలో రాజుగారి బొక్క-సము ఖాళీయాయెను. అంతట నాగార్జునుడు కొండరాళ్లను బంగారుగా మార్చియిచ్చెను. అంతట పని పూర్తియాయెను. అన్నిటికంటె పైచతుశ్శాలలో, 'నాగార్జునుడు' శాక్యమునిరచిత త్రిపిటక ధర్మశాస్త్ర గ్రంథములను, పూసలు రచించిన సూత్రశాస్త్రములను, అన్యవిభాష శాస్త్రములను భద్రపరచి యుంచెను. పైదానిలో నింకను 'బుద్ధదేవుని' ప్రతిమ స్థాపితమాయెను. అన్నిటికంటె అడుగు చతుశ్శాలలో సంఘారామమునకు జెందిన

బ్రాహ్మణులు, ఉపాసకులుండిరి. ఇచటనే కావలసిన వస్తుసంచయము నిల్వయుంచిరి. మధ్యనున్న మూడుశాలలు, శ్రమణుల, భిక్షుసోదరుల బసలై యుండెను. ఈసంఘారామముపూర్తియగు సరికి పనివాండ్రఖర్చు తొమ్మిదికోట్ల బంగారునాణెములాయెను.

ఇంకను హ్యూయొత్సాంగ్ వ్రాతలవలన మరికొన్ని విషయములు తెలియుచున్నవి. రాజెంత ఖర్చుపెట్టినను, సంఘారామము అపూర్ణమై యుండెను; ఆసమయమున, రాజు బహుదుఃఖితుడాయెను. అతని ఖిన్నమనస్సును గాంచి, 'నాగార్జును' డిట్లు చెప్పెను, "దుఃఖించుటకు కారణము కాన్పించదు. రేపు మీరు వేటాడిన తర్వాత వచ్చి, చూడవలసినది. తర్వాత దానినిగూర్చి విచారించవచ్చును"

నాగార్జును డంతట తన రసాయనబలముచేత కొండరాళ్లను బంగారుగా మార్చివేసెను. ఉదయము రాజు వేటకురాగా, మార్గములో నాల్గువైపుల బంగారురాళ్లను గాంచెను. రాజు వేటనుండి తిరిగివచ్చి నాగార్జునుని చెంతకేగి 'వేటకుపోవుమార్గములో నాకు బంగారురాళ్లు కాన్పించినవి" అని చెప్పెను. నాగార్జునుడంతట నిట్లు రాజుతో జెప్పెను. "ఇది నీపుణ్యప్రభావము. వీనిని దీసికొని ఉపయోగించి మీపనిని బూర్తి చేసికొనుడు." అంతట రాజు, బంగారురాళ్లను ద్రవింపించి సంఘారామమును బూర్తిచేసెను. ఇది ఎంతవరకు చారిత్రకసత్యమో చెప్పలేము.

తరువాత నాగార్జున బోధిసత్వు డిచటనే నివసించెను. ఆకాలమున రాజుపేరు 'సదవాహ' (So-to-po-ho) ఈరాజు

నాగార్జునుని, అధికముగా గౌరవించెను; ఆయన యవసరముల నన్నిటి నెరవేర్చుచుండెను.[4]

"దక్షిణకోసలకు ముఖ్యనగరములో నాగార్జునపూస, దేవపూసతో కలసి నివసించెను." సో-తో-పో-హో-(So to-pho-ho) యనురాజు, నాగార్జునుని మిగుల మర్యాద మన్ననల జేయుచు నత్యంతగౌరవముతో, నతని నివాసస్థాన మున్నచోట రక్షకభటుల గావలియుంచెను. ఇచటకు 'దేవపూస' యను భిక్షువు 'సింహళము' నుండి ఈసంఘారామమునకు నాగార్జునునితో వాదనలు సల్పుటకు వచ్చెను.[5] ఇట్లు నాగార్జునుడు, శిష్యులుకూడ శ్రీపర్వతముపై చాలకాలము నివసించిరి.

## 2. శ్రీ పర్వతము శ్రీశైలమా?

పైవిధముగా హూనుత్సాంగు హ్యూయ్లీ వ్రాతలవలన 'నాగార్జునుడు' నివసించినకొండ తెలియుచున్నది. శ్రీపర్వతమే శ్రీశైలమని చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్రలో వ్రాసిరి. అది పొరపాటు. శ్రీశైలము దక్షిణకోసల రాజధానికి 150 మైళ్ళు పైగా నున్నది. అదియునుగాక దక్షిణ

[4] S. Beal - Life of Hiuen Tsiang. (Hueli) P 135 "After wards Nagarjuna Bodhisatwa dwelt here. At that time the king was named 'Sadavaha' (So-to-Po-ho). He highly esteemed Nagarjuna and abundantly supplied all his wants"

[5] T. Watters—On yuanchwang's travels—Vol. II, P. 200.

కోసలనుండి ఆం-టో-లో- (ఆంధ్ర) కు, అటనుండి ధనకటక మునకు 'హూనుత్సాంగు' పోయియుండెను. అంతియేకాని కర్నూలు జిల్లాపోయి, శ్రీశైలయాత్రచేసి, తిరిగి 'ఆంధ్రకు' ధనకటకమునకు, వచ్చిన ఆధారములు లేవు. ఇరువురు చైనీయ పరివ్రాజకులు వర్ణించిన 1500 గదులు, ప్రాచీన గుహాలు, సంఘారామములు, శ్రీశైలమున లేవు. కనుక నాగార్జున కొండయే పైనవ్రాసిన పర్వతమై యున్నది. 'హూనుత్సాంగు' స్వయముగా జూడక ఇతరులు చెప్పిన మాటలను బట్టి వ్రాసినది. కావున స్థాననిర్ణయము చేసి దూరమును జెప్పుటలో నిశ్చయ ముగా బొరబడి యుండవచ్చునని వీరభద్రరావుగారు వ్రాసిరి. కాని వీరిదే పొరపాటుగా గాన్పించుచున్నది. ఇంకను ఈయాత్రి కుని వ్రాత లతిశయోక్తులతో గూడినవని, తాను స్వయముగా బోయి చూడకయే, సులభముగా విశ్వసించునట్టి వాడని, వీర భద్రరావుగారీయనను దేలికజేసిరి.

ప్రాచీన హిందూదేశచరిత్ర వృత్తాంతమును దెలిసికొనుట కింతకంటె అమూల్యగ్రంథములేదు. చైనీయ పరివ్రాజ కుల వ్రాతలు లేనిచో, భరతఖండచరిత్రము అంధకారబంధు రంబై, ఎడారిభూమి సంచారమువలె నుండెడిది. 'పాహియాను' కంటె 'హూనుత్సాంగు' కధికముగు పేరుగలదు. గొప్ప చరిత్ర కారుడని పేర్గాంచెను. పాహియాను విరాగి; నివృత్తిపరుడు. తనకాలములోని రాజుయొక్క పేరునుగూడ బయల్పెట్టడా యెను. 'హూనుత్సాంగు' అట్లుగాక సత్యమగు చారిత్రక వృత్తాంతముల నుల్లేఖించెను. ఆఖరుభాగములో గొలదివిషయ

ములుగాక, మిగిలినదంతయు సత్యమగు చరిత్రయేనని, అందరు చరిత్రకారులు, విద్వాంసు లభిప్రాయపడుచుండ వీరభద్రరావు గారిట్లు సాహసపు వ్రాతలు వ్రాయుట వింతగొల్పుచున్నది.

చైనీయ, టిబెటీయ గ్రంథములలో బేర్కొన్న శ్రీపర్వతమే నాగార్జునకొండ యనుట నిర్వివాదాంశము. యతి జీవితకాలములో దీనిని శ్రీపర్వతమే యనుచుండిరి. ఇచ్చట లభించిన భగ్నావశేషములనుబట్టి నాగార్జున బోధిసత్త్వుడు నివసించిన కొండ ఇదియేయని, శ్రీశైలము కాదని స్పష్టపడుచున్నది. శ్రీ శైలములో బౌద్ధభిక్షువులు నివసించిన జాడలేమి లేవు. అచట సంఘారామము లేదు.

నాగార్జున కొండదగ్గర ఇటీవల దొరకిన శిలాశాసనమును బట్టి కూడ, ఈపర్వతమే నాగార్జునుడు నివసించిన కొండయని స్పష్టపడుటచేత, శ్రీ శైలవాదన పోయినది. ఈపర్వతమునకు తూర్పున 'విజయపురి' కలదని శాసనమువలన తెలియవచ్చినది. 'నాగార్జునుని' అనంతరము కూడ చాలకాలమువరకు బౌద్ధభిక్షువు లీసంఘారామములోనే యుండిరి.

## 3. నాగార్జునకొండను బ్రాహ్మణులు స్వాధీనము చేసికొనుట

తరువాత కాలములో భిక్షువులలో నభిప్రాయభేదములు గల్గెను. వారి తగాదాలను రాజుకు జెప్పిరి. సంఘారామము నాశ్రయించినవారిలో చట్టవిరుద్ధమగు అశాంతి ప్రజ్వరిలి, తగాదాలకు కారణభూతమగునని, బ్రాహ్మణులు భిక్షువులను దొలగించి, వారిని బయటకు వెడలగొట్టుటకు క్రొత్తగా మార్గ

ములు గల్పించిరి. అప్పటినుండి సంఘారామములో నెవరు భిక్షువులు లేరు. లోనికి పోవు మార్గము తెలియకున్నది.

ఆకాలమున సంఘారామములో 1000 మంది భిక్షువులు, శ్రమణులు నివసించుచుండిరి. తరువాత శ్రమణులలో వాద వివాదములు గల్గెను. వారు రాజనిర్ణయమున కేగిరి. భిక్షువులు వాదవివాదములలో నిమగ్నులగుటచేత, వారియొద్దకు నిర్ణయమునకు వచ్చుటచేత, బ్రాహ్మణులుగాంచి, ఈయవ కాశమును జూచుకొని, సంఘారామ మంతటిపైన యధికారము గైకొని దానికి నాల్గువైపుల దృఢవంతముచేసి, శ్రమణులు లోనికి బోకుండ మార్గమును మూసివేయించిరి. ఆసమయమునుండి ఆసంఘారామములో నేభిక్షువును, ఏశ్రమణుడు నివసించుటలేదు. దానిద్వారమార్గము జాడకూడ నెవరికి దెలియదు. బ్రాహ్మణులకు, దమకు చికిత్సకు నేవైద్యుడైన అవసరము గల్గినచో, వాని కండ్లకు కట్టుకట్టి, గుప్తమార్గంబున లోనికి దీసికొనిపోయి మరల నాయన నదేవిధముగా కండ్లకు కట్టుగట్టి తీసికొనివచ్చిన చోటికి చేర్చుచుండిరి.[6]

పైవిషయములు 'హ్యూనుత్సాంగు' ఆయన జీవితకర్త 'హ్యూలీ' వ్రాతలవలన దెలియవచ్చుచున్నవి. హ్యూనుత్సాంగు

---

[6] S. Beal -Life of Hiuen Tsiang-Hwiu Li-pxx "Hiuen Tsiang tells that after Buddhists had established themselves in the monastery, theBrahmins by a stratagem took possession of it." Also see - Hiuen Tsiang - By Jaganmohan varma (Hindi P 164. watters Vol II P 199.)

వచ్చుటకు 100 సంవత్సరముల క్రితమునుండి, ఈకొండ నిర్మా నుష్యమైయుండి, శిధిలమై యుండెనని, ప్రతిఏడు 1000 మంది బౌద్ధభిక్షువులు వర్షాకాల మచటకు వచ్చుచుండిరని తెలియు చున్నది.

బ్రాహ్మణులు కుట్రచేత కొండను స్వాధీనపరచుకొని రని చైనీయలేఖకులు వ్రాసిరి. ఆకుట్రఫలితముగా బౌద్ధ భిక్షువులకు గత్యంతరములేక వెడలిపోయిరి. శంకరుని రాకతో నీకొండ పుష్పగిరి పీఠాధిపతుల స్వాధీనమై యుండవచ్చును. అంతటనుండి దాదాపు 25 ఏండ్ల క్రితమువరకు వారివశము లోనే యుండెను. ఈప్రకార మాంధ్రదేశములోని యనేకతావు లలో, బౌద్ధ, జైన మతములు ఖిలమగుటకు, బ్రాహ్మణమత మొకకారణమని ఊహించవచ్చును.

## 4. ఆంధ్రదేశములో బౌద్ధ జైన మతములు ఖిలమైపోవుట

ఆంధ్రదేశములో బౌద్ధుల పుణ్యక్షేత్రము లనేకములు గలవు. నిష్కామ కర్మయోగులగు బౌద్ధభిక్షువుల పాదరేణు వులచే ఆంధ్రభూమి పవిత్రమాయెను. ఉత్తరమున 'శాలిహుం డము' నుండి దక్షిణమున 'చినగంజాము' వరకు, పడమట 'గుత్తి' నుండి తూర్పున 'భట్టిప్రోలు' వరకు వీరు త్రొక్కని ప్రదేశమే లేదు. ధర్మబోధను వినిపించని తావేలేదు. సంఘా రామము, విజయవాడ, రామతీర్థము, జగ్గయ్యపేట, గుడి వాడ, ఘంటశాల, నాగార్జునకొండ, అమరావతి, గుత్తి మున్నగునవి బౌద్ధుల పుణ్యక్షేత్రములు. అనేకచోట్ల బుద

విగ్రహములు, చైత్యములు, స్థూపములు కాన్పించినవి. 'బుద్ధాని" అనే తావులో బుద్ధదేవుని విగ్రహము క్రీ. శ. 5 వ శతాబ్దమునాటిది కాన్పించినది.

క్రీ. పూ. 3 వ శతాబ్దమునుండి క్రీ. శ. 3 వ శతాబ్దము వరకు ఆంధ్రదేశములో బౌద్ధమతము వృద్ధియగుచుండెను. 'పాహియాను' (క్రీ. శ. 405-411) కాలమున బ్రాహ్మణమత విజృంభణము సాగెను. 'హూయనుత్సాంగు' కాలమున క్రీ. శ. (629-645) కళింగలో 10 సంఘారామములలో 500 మంది భిక్షువులును, ఆంధ్రలో 20 సంఘారామములలో 3000 మంది భిక్షువులు ధాన్యకటకములో 20 సంఘారామములలో 1000 మంది భిక్షువులు నుండిరి. కొన్నిచోట్ల నవిశిథిలమగుచున్నను, మొత్తముమీద క్రీ. శ. 700 వరకు వారిసంస్కృతి ఉన్న ఆధారములు గలవు. తరువాత బౌద్ధమతము బ్రాహ్మణమతములో లీనమై పోయెను. 'మహాయానము' నకు బ్రాహ్మణుల భక్తి మార్గమునకు భేదము హెచ్చుగా లేదాయెను. బౌద్ధులలో తంత్ర శాస్త్రీయములు హెచ్చాయెను. అందుచే నమ్మికములు తగ్గి, అంతఃకలహములు బయలుదేరెను. అంధకారయుగములో బౌద్ధుల జంపుటకూడ ఆరంభమాయెను. అట్లనే జైనులను గూడ వధించసాగిరి. కాకతీయగణపతి జైనులను నూనె గానుగులలో బెట్టి చంపినట్లు తెలియుచున్నది. ప్రతాపరుద్రుని కాలములో జైను లదృశ్యులైరి.

చేబ్రోలునకుతు 'ఆలపాడు' గ్రామములో 'జైనులు' బహుదినములు వాసముచేసిరని, ఆస్థలము దిబ్బగా నుండెనని,

అది బుట్లమ్మపాడని, విగ్రహము లుండెనని, పాటికి తూర్పున పావుక్రోసుదూరాన జైనులుండిరని, వారి ఆవులమంద లుండే చోట జైనులు ఖిలమై పోయినతర్వాత ఆస్థలములో గ్రామము ఏర్పడినదని, అదియే ఆలపాడని, ఆలపాడు కైఫీయతునుబట్టి తెలియుచున్నది.[7]

పొన్నూరుసముతు 'తురుమెళ్ల' గ్రామములో పూర్వము జైనులు కొందరు కాపురముండి కొన్నిదినములకు వారు ఖిలమై పోయిరి. కనుక యిప్పటికిన్ని గ్రామానికి దక్షిణభాగమందు దిబ్బగా ఉండియున్నదని, అక్కడను ఆ జైన సంబంధమగు శిలా ప్రతిమలు మొదలగునవి లేవని, ఆస్థలమందు యిదివరకు ఎవరు త్రవ్వలేదని తురుమెళ్ల గ్రామ కైఫీయతు తెల్పుచున్నది.[8]

చేబ్రోలుసముతు పెదగాదెలవఱ్ఱు చుండూరుకు ఈశాన్యముగా ఉన్నదని అచట జైనులుండిరని పెదగాదెలవఱ్ఱు గ్రామ కైఫీయతు తెల్పుచున్నది.[9]

బౌద్ధులు కాపురమున్న స్థలముకాన 'బుద్దాము' అయినదని, ఒకప్పుడు జైనులు కాపురముచేసిరని జైనగురువు 'విజయుడు' ఇచట ఉండెనని, మల్లికార్జున పండితారాధ్యులతో నిచట వాదనలు జరిగెనని, బుద్దాము కైఫీయతు తెల్పుచున్నది.[10]

---

[7] L. R. Vol. V – P. 372.
[8] L. R. Vol. V – P. 375.
[9] L. R. Vol. III – P. 466.
[10] L. R. Vol. 50 – P. 377.

జైనుడైన 'బోడలు' గృహముకట్టుకొని యుండెనని, అతనివల్ల బస్తీ అయినది. కాన 'బోడపాడు' అనునామము వచ్చినదని బోడపాడు గ్రామకైఫీయతు తెల్పుచున్నది.[11]

చందవోలు గ్రామకైఫీయతును బట్టికూడ బౌద్ధ జైనులు ఇచట ఉన్నట్లు తెలియుచున్నది. ఆంధ్రదేశములో కీర్తివర్మ, జయసింహా, మల్లదేవ, సోమదేవాది రాజులు జైను లని తెలియు చున్నది. ఆకాలమున జైనులు చాలమంది ఉండి ఉండవచ్చును. 'ఓరుగల్లు ప్రతాపరుద్రుని' కాలమున బ్రాహ్మణులు జైనులు చేసిన గ్రంథములను దగ్గము జేసిరని, అంతట రాజుకు జైనులు శాపము పెట్టిరని 'బ్రాహ్మణ్యానికి వెలియగుదురుగాక! యని చెప్పి, లక్షగ్రంథము యిచ్చి, జైనులందరు విషాన్న భుక్తులై మరణించిరని తెలియుచున్నది.[12] బ్రాహ్మణులు జైనులు చేసిన గ్రంథాలను దగ్ధముచేసిరని, రాజు చూస్తూ ఉండెనని, జైనులు శాపముపెట్టిరని, మీకు ముందర మాగ్రంథాలు లేక పోవు - అమరము ఉంచుకోమని చాతుర్లక్షల అమరము నిచ్చి జైనులందరు విషాన్నముల గైకొని మరణించిరని మరి యొక ప్రయాణము తెల్పుచున్నది.[13]

ఈప్రకారము బ్రాహ్మణమతస్థులు బౌద్ధ జైనులను చంపు టయేగాక వారి గ్రంథములను దగ్ధముజేసిరని తెలియుచున్నది. ఇది మతోన్మాదమేకాని వేరుకాదు.

---

[11] L. R. Vol. 50 - P. 383.
[12] L. R. Vol. 50 - P. 288.
[13] గణపతివారివృత్తాంతము. P 15.

భరతవర్షములోని ధీశాలురగు అశ్వఘోష, నాగార్జున, అసంగ, వసుబంధు, ధర్మకీర్తి మున్నగువారు రచించిన ఉత్తమ గ్రంథములు భరతవర్షములో నదృశ్యమై పోయినవి. మూలము లిచట లేకపోయినను అవి చైనీయభాషలో ననువాదరూప మున గాన్పించు చున్నవి.

## 5. నాగార్జునకొండ ప్రాముఖ్యత

'టాలమీ' (క్రీ. శ. 150) గ్రంథమునుబట్టి చైనాకు భారతవర్షమునకు విస్తృతమైన సముద్రవ్యాపారము తెలియా చున్నది. వినుకొండ, నెల్లూరు, కడపలలో లభించిన రోమక నాణెములనుబట్టి, నాగార్జునకొండలోని క్రీ. శ. మూడవ శతాబ్దమునాటి శిలాశాసనమునుబట్టి 'చైనానుండి రోము, వరకు ఆంధ్రదేశముపేరు వ్యాపించినట్లు తెలిసికోవచ్చును. శాతవాహన రాజుల కాలములో విదేశములలోగూడ నిచట నుండి వ్యాపారము జరుగుచున్న ఆధారములు గలవు. కృష్ణా నది దగ్గరగా నుండుటచేత దీనిమూలముగా సముద్రము మీాదగా వ్యాపారము విదేశములలో సాగుచుండెను. ఈ కొండకు తూర్పుగా 'విజయపురి' యను నగరము గలదని, ఇచట లభించిన శాసనాధారములచేత నెఱుంగ వచ్చును. నాగార్జునకొండదగ్గర నే కృష్ణకు కుడివైపున ఓడలనుండి సామా నులు రేవులో దించుటకు రాళ్లతో కట్టిన కట్టడము(Wharf) నేడు శిథిలమైనదానిని 'లాంగ్‌హర్స్టు (Long Hurst) కని పెట్టెను. ఇంకను 'కంటకశైలము' 'అల్లోశైని' మున్నగుచోట్ల

దొరకిన భగ్నావశేషములను బట్టి విస్తృతమైన సముద్రవ్యాపారము, సింహళము, హిందూదేశము వెలుపల, పశ్చిమభాగమున జరిగిన ఆధారములు లభించుచున్నవి.[14] ఇంకను దక్షిణను తూర్పుభాగములలో ధనకటకము వ్యాపారపట్టణమని, 'కెవురూర, విజయపుర, నారసల' అనునవి వర్తకుల నివాస స్థలములని, తెలియుచున్నది.[15] రోమక నాణెములేకాక, ఓడబొమ్మలు గల్గిన నాణెములు, సింహపుబొమ్మలు గల్గిన నాణెములు లభించినవి. క్రీ. శ. 1వ శతాబ్దములో హిందువులు, అత్యంత తూర్పుభాగమునకు వలసపోయిన ఆధారములు లభించుచున్నవి.[16] నాగార్జునుని పోషకుడైన యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెములు ఓడబొమ్మను గల్గియున్నవి. అందుచేత 'నాగార్జునయతి' కాలమున నాగార్జునకొండనుండి కూడ వ్యాపారము జరిగినదని చెప్పవచ్చును, ఇంకను నాగార్జునకొండయొద్ద కృష్ణానదినుండి కాల్వజాడలు బౌద్ధభిక్షువుల బసలవరకున్నట్లు కాన్పించును.[17] వీనినన్నింటిని 'లాంగ్‌హార్స్టు' కనిపెట్టి శాశ్వత కీర్తి గడించెను.

ఈ కొండనుండియే మహాయాన మాధ్యమికధారలు ప్రవహించెను; బౌద్ధ సారస్వత వధూటి ఉయ్యాలలూగిన తావుయిదియే. శ్రీపర్వతమను పేర్గాంచిన ఈగడ్డయందే 'నాగార్జునయతి' విశ్వమానవ సోదరత్వమును ప్రబోధించెను. అమూ

---

14 K. Gopalachari - Andhra History P. 150
15 Ibid – P. 108.
16 Ibid – P. 101.
17 K. R. Subrahmanian M. A., – Buddhist remains in Andhra – P. 12.

ల్యమగు పుస్తకభాండాగారమును, తలమానికమగు విద్యా కేంద్రమును, గొప్ప ప్రయోగశాలను నాగార్జునయతి ఇచ్చట స్థాపించి శాశ్వత యశఃకాయుడాయెను. మానవకోటి దాస్యశృంఖలముల త్రెంచుటకు, హేతుబద్ధముకాని విషయముల నమ్మవలదని, యతి ఇచటనే ప్రప్రథమముగా బోధించి యుండెను. లలితకళలు, తత్వశాస్త్రము, సారస్వతము మున్నుగాగల సమస్తవిషయములలో 'ఆంధ్రులు' ప్రతిభాశాలురని ఈకొండ వేనోళ్ళ చాటుచున్నది. అజంతా, కార్లి అమరావతి శిల్పముకంటె నాగార్జునకొండపైన అద్భుతశిల్పము ప్రదర్శించ బడియున్నది. ఈశిల్ప మత్యంత సుందరమైనది; నైపుణ్యము గలది; చక్కని పాలరాతిపై ప్రదర్శించిన ఈశిల్పము ఈనాటికి కనులుపండువై, మనసున కాహ్లాదము గొల్పుచున్నది. ఇంకను 'నాగార్జునకొండ' ఉద్దాములగు రెడ్డిప్రభువుల కాలములోను, శ్రీకృష్ణ దేవరాయల కాలములోను, ఖ్యాతిగాంచిన ఆధారములు లభించుచున్నవి. జైనుడైన 'నాగదేవభట్టు' రచించిన 'కొండవీటి దండకవిలె'ను బట్టి క్రీ. శ. 1324-1428 మధ్య కాలములో రెడ్డిప్రభువు లేలుచుండ, 'నాగార్జునకొండ సీమ'లో మాచర్ల సముతు, గురజాల సముతు, కారెంపూడి సముతు, తంగెడు సముతు, తముడుగోడు సముతులనబడు 5 సముతులు, 150 గ్రామము లుండెనని తెలియ వచ్చుచున్నది. నాగార్జున కొండసీమ 150 కి, మాచర్లసముతు 64, కారెంపూడిసముతు 14, గురజాలసముతు 16, తముడుగోడుసముతు 12, తంగేడు సీమ 44 చెల్లుతుండేవి.[18]

18 కొండవీటి దండకవిలె, పుట 8

ఇట్టి చారిత్రక ఖ్యాతిగన్న కొండను, 1925లో ప్రాచ్యవస్తు పరిశోధకశాఖవారు త్రవ్వించి, అనేక పురాతన వస్తుశిల్పముల వెలికిలాగిరి. ప్రభుత్వమువారు 28 వేలు ఖర్చిడి, వస్తుప్రదర్శన శాలను, యాత్రికులకు విశ్రాంతిభవనమును గట్టి, బావిని త్రవ్వించిరి. ప్రతివర్షము త్రవ్వుటచేత, నిచట ననేక శిథిలవస్తు సంచయములు బయల్పడుచున్నవి. ఇంకను ముందెన్ని బయల్పడునోకదా!

# II

1 నాగార్జున నామవిచారణ- 2 నాగార్జునుని ప్రఖ్యాతి- 3 నాగార్జును లెండఱు- 4 నాగార్జునచరిత్ర కాధారములు.

## 1. నాగార్జున నామవిచారణ

నాగార్జునయతి ఖండఖండాంతర ఖ్యాతిగాంచెను. చైనాదేశములో 'బోధిసత్వ నాగార్జును' డందురు. టిబెట్టులో 'ఆర్య' లేక ఆచార్య నాగార్జును డందురు. ఇంకను టిబెటీయభాషలో క్లూగ్రబ్ (Klu-Grub, Lu-Grub) అని, చైనీయభాషలో లుంగ్‌షూ (Lung-Shu) అని, జపానీయ భాషలో 'ర్యూమ్యోబోసత్సు (Ryumyo Bosatsu) అనియు నాగార్జునుని బిల్తురు. 'ఉమయడో' రాకుమారుడు, జపానీయ రాజ్యాంగపరిషత్తుయొక్క 14 సూత్రముల దయారుచేసెను. ఈయన 'నాగార్జునుని' గ్రంథములపై కొన్ని ప్రఖ్యాత వ్యాఖ్యలు వ్రాసెనని తెలియుచున్నది. ఇట్లీయనకి 'జపాను' లో గొప్ప ప్రఖ్యాతికలదు.

'నాగ, నాగార్జున, నాగాహ్వాయ, బోధిసత్వ నాగార్జున, తథాగతభద్ర' అని ఈయతికి పేర్లు కాన్పించుచున్నవి. 'ఆర్య మంజూ శ్రీ మూలకల్పము' ను బట్టి, ఈయన అనేక శాస్త్రములలో నేర్పరియని, 'మయూరివిద్య' నెఱింగినవాడని, 'సుఖావతిలో ప్రవేశించి బుద్ధత్వము చెందెనని ఈయనకు 'నాగాహ్వాయుడని' పేరున్నట్లు తెలియుచున్నది. 'జగ్గయ్యపేట' శిలాశాసనములోగాక నింక నెచట నీయతిపేరు కాన్పించదు. బౌద్ధుడగుటయే కారణము కావచ్చును.

'నాగార్జుననికి, దేవకు' ఇంచుమించు సమకాలీనముగా 'నలందాకళాశాల'లో వారి పరంపరలోని వాడుగా నొక చోట 'నాగాహ్వాయుడని' పేర్కొనబడుట మనముచూతుము. ఈయనయే 'తథాగత భద్రుడు'. 'నలందా' లోని ఈకళాశాలనుగూర్చి 'పాహియాను' ఏమియు వ్రాసియుండలేదు. ఆయన స్వయముగా నీగ్రామము వచ్చెను. అందుచేత ఈకథ సత్యముగాదు. 'నాగార్జునుడే నాగాహ్వాయుడు. ఇవి రెండు సమానార్థకములు![19] అని 'కెరన్' పండితుడు వ్రాసెను. ఈప్రకారము నాగార్జునుని పేరు మనకు నానాదేశీయ గ్రంథాధారములచేత లభించుచున్నవి.

## 2. నాగార్జునుని ప్రఖ్యాతి

నాగార్జునుడు విశ్వవిఖ్యాతిగన్న యతి. బౌద్ధశాస్త్రముల కీయన 'అరిస్టాటలు' అని, మాధ్యమికశాఖ కీయన 'క్రైస్తు'

---

[19] H. Kern-Manual of Indian Buddhism P. 128 (1896).

అని, మహాయానకు 'సెంటుపాల్' అని, ఆంధ్రచరిత్రకారుడు వ్రాసెను.[20] ఇదిసత్యమే. మాధ్యమిక శూన్యవాదములకుగర్త, ప్రబోధకుడునగు ఈనాగార్జునుడు, బౌద్ధలోకమును వెలిగించిన భానుచతుష్టయములో నొకడని హుయాంత్సాంగు వ్రాసెను.[21] ప్రాగ్దేశమున అశ్వఘోషుడు, దక్షిణదేశమున 'దేవ', పశ్చిమదేశమున 'నాగార్జునుడు' ఉత్తరదేశమున కుమారలబ్ధుడు అను వారు నలుగురు ప్రకాశమానమగు సూర్యులని పిలువబడుచుండిరు.[22] 'కుమారలబ్ధుడు' సౌత్రాంతిక వైద్యుడుగా గాన్పించుచున్నాడు.

నాగార్జునుడు అశ్వఘోషుని తర్వాత వాఙ్మయసేవ చేసిన వారిలో ముఖ్యుడు. ఈయతి మూలికావైద్యము, నక్షత్రసంచారము, గ్రహప్రభావము, వెండిబంగారుల విద్య (రసవాదము) ఇంద్రజాలవిద్య, కళల నెఱింగినవాడు. మంత్రవాది, నేత్రచికిత్సకుడు, అని వాటర్సు కుమారజీవుని వ్రాతల ఆధారమున వ్రాసెను.[23] ఈబౌద్ధయతి రసాయనికుడు. భౌతికశాస్త్రవేత్త. తంత్రశాస్త్ర, తత్త్వశాస్త్ర లోహశాస్త్రవిదుడు. బౌద్ధమత ప్రధానగురువు. సమస్తశాస్త్ర పారంగతుడు. ఏకసంధా

---

[20] K. R. Subrahmanian—Andhra history P. 62(1932)

[21] T. Watters — On Yuan Chwang's travels I—P. 245.

[22] Ibid — Vol II—P. 286 Also Vol. 1—P. 245

[23] Ibid — Vol II—P. 204.

గ్రాహి. నిర్దుష్ట రసాయనశాస్త్రవేత్త. జ్ఞానజ్యోతి, నిరుపమాన ప్రతిభావంతుడు. మహాయానస్థాపకుడు గాకున్నను, ఆశాఖను ప్రచారమునకు దెచ్చి వ్యాప్తియొనర్చెను. ఈయతి నిజమైన బోధిసత్వుడు. సిద్ధిపురుషు డగుటచేత నొకొక్కప్పుడు, అదృశ్యరూపమును దాల్చుచుండెనట! గొప్ప వైద్యశాస్త్ర వేత్త. విషవైద్యముకూడ నెఱింగియుండెను. ఈయన ఇంకను కాయకల్పచికిత్స నెరింగినవాడుగా గాన్పించుచున్నాడు. ఈయన కంటివైద్యము పాట్నాలోని శిలాస్తంభముపై కాన్పించుచున్నదని కొందరు వ్రాసిరి. కాని, అది 'సిద్ధనాగార్జునుని యోగమనినాఅభిప్రాయము. భారతీయ రసాయనశాస్త్రమున కీయన జనకుడు. రస, వజ్ర భస్మాదుల చేయుట ఎరిగియుండెను. ఖగోళ, ద్రవ్యగుణ శాస్త్రాదుల నెరింగినవాడు బట్టీలో ఔషధముల వండు పద్ధతిని, భస్మవిధానము నీయన మొదట కనిపెట్టెను. ఖనిజములగూర్చి ఈయన వ్రాసిన వ్రాతలు ప్రామాణికములు. ఇనుమును గాచుపద్ధతిని, రసములో గంధక మిశ్రమమును దయారుచేయు విధానము కనిపెట్టిన దీయనయే. ఈయన శాస్త్రీయ కళాశాలలో వేలకొలది శిష్యులను జేర్చి, వృక్ష, రసాయన, లోహశోధక శాస్త్రాదుల నేర్పెనని తోచుచున్నది. రాళ్లను బంగారుగామార్చు విద్యకూడ ఈయనకు గలదని 'హూనుత్సాంగు' వ్రాతలవలన దెల్లమగుచున్నది. కాని ఈ అన్ని విద్యలు 'బోధిసత్వనాగార్జునుని'కి గలవా అను విషయ మాలోచించవలయును.

### 3. నాగార్జును లెందరు?

పేర్ల సామ్యముచేత పొరపాటుపడుచుండిరని, వాస్తవముగా నాగార్జునులు నల్గురు కాన్పింతురని బౌద్ధతత్త్వవేత్త, తంత్రిలేఖకుడు, వైద్యలేఖకుడు, రసవాదశాస్త్ర కర్త (రసాయనవిద్యాకర్త) అనువారు వేరువేరని 'జర్మను సంస్కృత విద్వాంసుడు' వింటర్ నిట్జ్ ఉల్లేఖించెను.[24]

కొందరు విద్వాంసు లిరువురనిరి. కొందరు ముప్వురనిరి. ఈప్రకారము వాదవివాదములు గలవు. ఈవిషయమిప్పుడు తేల్చవలసియున్నది. విద్వాంసుడగు 'అయ్యస్వామిశాస్త్రి యిట్లు వ్రాసెను: "తరువాత ఏర్పడిన బౌద్ధమతశాఖలను బట్టి ఇరువురు నాగార్జును లున్నట్లు కనుగొందుము. క్రీ. శ. 200 సం వత్సరప్రారంతమున జీవించి, ప్రఖ్యాతిగాంచిన మాధ్యమిక శాస్త్రకర్తయగు 'నాగార్జును'డొకడు. రెండవవాడు అనేక తంత్రగ్రంథముల కర్త. ఈయన క్రీ. శ. 7వ శతాబ్దములోని మొదటి మధ్యభాగములో నుండెనని నమ్మబడుచున్నది. ఈ యిరువురిలో ఈగ్రంథకర్త (భావసంక్రాంతి సూత్రము) ఎవరో ప్రస్తుతము నిశ్చయించి చెప్పజాలము. ఈఇరువురుగాక మఱి యొక మూడవ నాగార్జునునిచేత రచింపబడినదేమోకూడ

[24] M. Winternitz - History of Indian Literature Vol. II - P. 243. "Most likely the Buddhist philosopher, the Tantric writer, the medical writer and alchemist were 4 different men who were confused owing to identity of names."

చెప్పజాలము. కాని చైనీయ భాషాంతరీకరణము షీహూ (దానపాల - తరువాతకాలములోని సన్ శాఖలోని వాడు) (క్రీ. శ. 980-1000) చేత రచించబడినది. అందుచేత క్రీ. శ. 10వ శతాబ్దమునకుపూర్వమే చాలకాలమునుండిఉన్నదనిమాత్రము నిశ్చయించవచ్చును.[25] (నాంజో కాటలాగు. నెం. 1305)

'మహాయాన వింశక' నాగార్జునరచితమని, టిబెటీయు చైనీయ భాషలోని ప్రాచీనగ్రంథములబట్టి తెలియుచున్నది. ... బౌద్ధులలో నొకరికంటె ఎక్కువ నాగార్జును లున్నారు. ఒకనాగార్జునుడు మాధ్యమిక దార్శనిక శాస్త్రము నొకపద్ధతిలోనికి దెచ్చి కూర్చెను. ఈయన నంద తెరుంగుదురు. ఇంకొక 'నాగార్జునుడు' 84గురు సిద్ధుల (మాంత్రికుల)లో నొకడు. 'కార్డియరు' తయారుచేసిన 'టాంజూరు' కాటలాగు మూడవ సంపుటములోని తంత్రవృత్తి గ్రంథములలో ననేకములు ఈయనరచితములని రూఢిగా జెప్పవచ్చును. ఈరెండవ నాగార్జునుడుకూడ 'ఆర్య, ఆచార్య, ఆర్యమహాచార్య, మహాచార్య ఆర్యభిక్షు, భట్టారక' అనుపేర్ల పిలువబడుచున్నాడు. ఈఇద్దరు నాగార్జునులలో 'మహాయానవింశక' యొక్క నిజమైన గ్రంథకర్త యెవరని సహజముగా ప్రశ్న వేయుదురు. కాని తగినన్ని ఆధారములు లేనందువలన దీనిని తేల్చలేకుండ నున్నాము. మొదటి నాగార్జునుడు ఈగ్రంథకర్తయని చెప్పుట కాధారములు లేవు. మొదటినాగార్జునుని కాలము క్రీ. శ. 200 అని,

---

[25] N. Aiyaswami Sastri—Bhava Sankranti Sastra and Nagarjuna's Bhava Sankranti Sutra P. XXII (1938).

రెండవనాగార్జునుని కాలము క్రీ. శ. 600–650 మధ్యయని మనమెరుంగవచ్చును."[26] అని 'భట్టాచార్య' వ్రాసెను.

'గమ్మెలు' యిట్లువ్రాసెను. "నాగార్జునుడు పశ్చిమ భారతీయ వాస్తవ్యుడు. ఒకానొక అర్జున వృక్షముక్రింద యోగిగా నివసించెను. అందుచేతనే ఈపేరు వచ్చెను. 'కపిమల' చేత మతదీక్ష గైకొనుటచేత, దక్షిణహిందూస్థానములో విశేషముగా పనిచేసెను. ఈయన మహాయాన బోధకుడు; స్థావకుడు కాదు. బౌద్ధలోకమును వెలిగించిన సూర్యులలోనొకడు. మాధ్యమికశాఖను స్థాపించెను. కోసలదగ్గర ఒక సంఘారామములో తన అంతిమజీవితమును గడపెను. క్రీ. శ. 194 లో చనిపోయెను. ఇది సరియైనది. ఈయన మరణించిన తర్వాత 'బోధిసత్వ' బిరుదును బొందెను. అనేక శాస్త్రకర్త."[27](Also Compare Eitel's hand book of Chinese Buddhism.)

'భట్టాచార్య' అను భారతీయవిద్వాంసుడు ఇరువురి నాగార్జునులనుగురించి విపులముగా వ్రాసియుండెను. "84 గురు మహాసిద్ధులలో నొకడైన 'సిద్ధనాగార్జునుడు' 'ఏకజట' అను దేవతపూజను 7వ శతాబ్దమధ్యములో భోట లేక టిబెటు (మహాచీనా) నుండి తైకొనివచ్చెను.[28] 'సరహా' యే తంత్ర

[26] Vidhusekhara Bhattacharya—Mahayana Vimsaka of Nagarjuna (1931)

[27] William Gummell— The Diamond Sutra-(1912) Introduction. P. IX

[28] B. Bhattacharya — An introduction to Buddhist Esoterism—(1932) P. 134.

విద్యను మొదట ప్రజాసామాన్యములో వ్యాప్తిచేసెను. గుహ్య సమాజముకంటె 'మంజూశ్రీమూలకల్పము' మొదటిది.[29] గుహ్యసమాజము 'అసంగ' కాలమున క్రీ. శ. 3వ శతాబ్దములో వచ్చెను. 'చక్రసంవరతంత్రము'ను బట్టి వీరు వరుసలో ప్రధానగురుపరంపరలో నున్నారు.[30]

1. "సరహ- క్రీ. శ. 633.— తారానాధుడు ఈయనను గూర్చి బౌద్ధమతచరిత్రములో కూడ వ్రాసెను. ఈయన బుద్ధకపాలతంత్రము'ను ప్రవేశపెట్టెను. దీని కీయన మొదటివాడు. 'రాహులభద్రుడని, సిద్ధసరహ' యను పేర్లుగలవు. ధర్మకీర్తి సమకాలీనుడు. (క్రీ.శ.600—650.) 'సరహాభద్ర'కు 'రాహుల భద్ర' యను పేరుగలదు.

2. నాగార్జున (క్రీ శ. 645) 3. శబరిప క్రీ.శ. 657. 4. లుయిప క్రీ శ. 669, 5. వజ్రఘంట. కీ. శ. 681. 6. కచ్ఛప, క్రీ.శ. 691. 7. జాలంధిరిపా. క్రీ. శ. 705, 8. కృష్ణాచార్య క్రీ. శ. 717. 9. గుహ్యా. క్రీ. శ. 729, 10. విజయప క్రీ. శ. 741. 11 తైలోప-మహీపాలకాలము క్రీ. శ. 978—1030, 12. నారోప క్రీ. శ. 990 ఈప్రకారము సిద్ధనాగార్జునుడు క్రీ. శ. 645 లోనివాడు. మాధ్యమిక సూత్రకర్త కాడు. అశ్వఘోషుని శిష్యుడని కొందరు. రెండవవాడు 'సరహ' శిష్యుడు. మొదటినాగార్జునుడు క్రీ. శ. 2వ శతాబ్దములోనివాడు. రెండవనాగార్జునుడు క్రీ. శ. 7వ శతాబ్ద మధ్యములోనివాడు. సమయములో 500 ఏండ్ల అంతరముగలదు. ఈపేర్లవలన చాలపొరపాట్లు గల్గు

[29] Ibid—P. 66.
[30] Ibid—P. 62.

యున్నవి. నాగార్జున చరిత్రకర్త 'యం. వాలెసర్' టిబెట్టు చైనీయ ఆధారములబట్టి, నాగార్జునుడే లేడని, కల్పితవ్యక్తి యని అభిప్రాయపడెను. ఎంత ఘోరము !

"నాగార్జునుడు తాంత్రికుడు. వజ్రయాన అనుయాయి. సాధనమాలలో రెండు సాధనములు వజ్రతారపూజకు, ఏకజట పూజకు గలవు. 'వజ్రయానమతము' శ్రోవచూపెడు తార వంటిది. నాగార్జునుడు చాల తాంత్రిక గ్రంథములకు కర్త. టిబెట్టులో వీని అనువాదములు గలవు. క్రీ. శ. 657 ప్రాంత మున, 'శబరిప', నాగార్జునుని 'బంగాళాదేశము' లో గలసి కొనెను. తంత్రశాస్త్రమును నేర్చుకొని, ఉపదేశమును పొందెను. అతనిభార్యలు లోకి, గుణి' అనువారు కూడ యోగినులైరి. ఆయన 'కురుకుల్ల యొక్క సాధన, పద్మవజ్ర, గుహ్యసిద్ధి' అనువానిని లిఖించెను."[31]

"నాగార్జునుడు ఏకజటపూజను 'భోటదేశము'లో నేర్పర చెను. (ఏకజటా సాధనం సమాప్తం ఆర్య నాగార్జున పాదై భిర్భోటేషు ఉద్ధృతమ్) ఈదేవత విదేశీయమైనది. నాగార్జునుడు క్రీ. శ. 7వ శతాబ్దములోనివాడు. ఈయన శబరిపగురువు. సర హాపశిష్యుడు. 'సరహాప, నాగార్జునుడు, శబరిప' అను ముప్పూరు 84 గురు మహాసిద్ధులలో గలరు. తంత్రబౌద్ధము వ్రాసిన వారిలో 'నాగార్జునుడు' మొదటివాడు.[32] అనువాదములు 'టిబెట్టు'లోని 'తాంజూరు'లో గలవు. 'వజ్రయోగిని' పూజతో

---

[31] Ibid—P. 67-68.
[32] Ibid—P. 154.

బాటు 'సిద్ధనాగార్జునుని' పేరు వచ్చును. ఈయన క్రీ.శ. 7వ శతాబ్దములోని వాడు.

ఓం ఓం ఓం సర్వబుద్ధ ఢాకినియే వజ్రవర్ణనీయే వజ్రవై
రోచనీ యే హూహూహూ ఫట్ ఫట్ ఫట్ స్వాహా॥

ఈమూడు 'ఓం' లు, వజ్రయోగిని, వజ్రవర్ణని, వజ్రవైరోచిని'కి జెందును.[33]" ఈప్రకారము సిద్ధనాగార్జునుడు వేరని, బోధి సత్వ నాగార్జునుడు వేరని తెలియుచున్నది. సంస్కృత చైనీయ నిఘంటువులో, నాగార్జునుడను శీర్షికక్రింద 'ఐటలు' పండితు డిట్లు వ్రాసెను. అర్జునచెట్టు- మహానాగ లేక, జయముగాంచిన నాగ. పశ్చిమహిందూ స్థానవాసి. ఒక అర్జున వృక్షముక్రింద నివసించిన యోగి- 'కపిమల' దీక్షయిచ్చువరకు అచటనే ఉండెను. ఆయన 14వ మహాగురువాయెను. భిన్నమతావలంబ కులగు అనేకులలో వాదనలుసల్పి, జయముపొందెను. దక్షిణహిందూస్థానములో ప్రసిద్ధిగాంచెను. ముఖ్యముగా 'మహాయాన' మత ప్రబోధము చేసెను. 'అమితభ' మతమును మొదట బోధించినవాడు. మాధ్యమిక స్థాపకుడు. 24 గ్రంథములకు కర్త. బౌద్ధుల గొప్ప దార్శనికుడు. బౌద్ధులీయనను భాను చతుష్టయములలో నొకడందురు. ఈయన 'ఆత్మ' ను గూర్చి బోధించెను. 'దేవబోధిసత్వ, బుద్ధోపలిత' అనువా రీయన శిష్యులు. 'సదవస' యొక్క కుమారుని ప్రార్థనపై, 'కోసల' దగ్గరనున్న ఒక సంఘారామములో ఈయన తనతలను గోసి

[33] Ibid—P. 160.

కొనెను. (క్రీ. పూ. 212 లేక క్రీ. శ. 194) ఈయన నిపుడు 'బోధిసత్వుడ'ని పిల్చుచున్నారు.[34]

'నాగసేనుడు' అను బౌద్ధభిక్షువు అదేపేరుగల సూత్ర గ్రంథమును (మిలిందపన్హా) లిఖించెను. దీనిని చైనీయభాష లోనికి క్రీ. శ. 317–420 మధ్య అనువదించిరి. ఈయన ఉత్తరహిందూస్థాన వాసి. భిక్షువు. (నాంజో కాటలాగు 1358). కుమారజీవుని వ్రాతలనుబట్టి నాగార్జునుడు దక్షిణహిందూస్థాన వాసి; బోధిసత్వుడు. నాగసేన, మీనాండరు సంవాదము క్రీ. పూ. 140 లో జరిగెను. నాగార్జునుడు 'కనిష్క–ని' తర్వాతవాడు. ఆధునిక పరిశోధనలనుబట్టి, క్రీ. శ. 2వ శతాబ్దాంతములో నివసించెను, 'నాగసేనుడు' నేర్పరియైన తార్కికుడు. హీనాయాన మతప్రబోధకుడు. నాగార్జునుడు సూత్ర శాఖను ప్రబోధించెను. ఇంద్రజాలము తంత్రవిద్యలలో ప్రసిద్ధుడు."[35]

ఈ ప్రకారము ప్రామాణిక విద్వాంసు లనేకవిధముల నాగార్జునునిగూర్చి వ్రాసియుండిరి. నాగార్జునుని పేరొకన్న మొదటిలేఖకుడు 'హుయాన్‌త్సాంగు'. 'ఫాహియాను' ఈయతిని గూర్చి యేమియు వ్రాసియుండలేదు. 'సో- తో- పో- హో' రాజుదగ్గర 'నాగార్జున యతి' ఉండెనని, ఆయన దక్షిణకోసల రాజని, యతి బంగారు చేయుట యెరింగెనని, రసాయనవిద్య

[34] E. J. Eitel – A hand book of Chinese Buddhism (A Sanskrit Chinese dictionary. P. 103. (1888)).

[35] Ibid—P. 104.

చేత బంగారుగుళికలు చేసి జీవితము పెంచెనని, రాజు, యతి కూడ దీర్ఘకాలము జీవించిరని 'హ్యానుత్సాంగు' వ్రాతలవలన దెలియుచున్నది. జగ్గయ్యపేట స్థూపముదగ్గర గల శిలాశాసనములో బుద్ధదేవుని పేరుతో బాటు 'భదంతనాగార్జునాచార్యుల' పేరుగలదు. కనుక క్రీ.పూ. 140వ సంవత్సర ప్రాంతమున 'నాగసేను'డను బౌద్ధభిక్షువు గలడని, ఈయన 'మినాండరు'తో మతవిషయిక చర్చలు జరిపెనని, 'నాగార్జున బోధిసత్త్వుడు' ఆంధ్ర శాతవాహన రాజుల కాలములోనివాడని, క్రీ.శ. రెండవ శతాబ్దములోని వాడని, క్రీ.శ. 650లో 'సిద్ధనాగార్జునుడు' గలడని మనము తెలిసికొనవచ్చును.

'బ్రజేంద్రనాథశీల్' అను విద్వాంసుడు ముగ్గురు నాగార్జునుల నామోల్లేఖనము జేసెను. మొదటివాడు లోహశాస్త్రవిదుడు. రెండవవాడు 'సిద్ధనాగార్జునుడు'. ఈయన రసాయనవిద్యావిదుడు. మూడవవాడు 'మాధ్యమిక సూత్రరచయిత 'దార్శనిక నాగార్జునుడు'.నాగార్జునునిపేరే 'సిద్ధనాగార్జునుడు' గావచ్చునని కూడ పైవిద్వాంసుడభిప్రాయ మొసంగెను. కాని ఈఊహలు తప్పుగానున్నవి. దార్శనిక నాగార్జునునికి సిద్ధనాగార్జునుడను పేరుగలదనుట కాధారములు లేవు. 'లోహశాస్త్రవిదుడు' వేఱొకడని తెల్పుటకుకూడ ఆధారములు శూన్యము. 'రసరత్నాకరము'ను బట్టి నాగార్జునుడు లోహశాస్త్ర విదుడని తెలియుచున్నది. పైగ్రంథకర్త క్రీ. శ. 2వ శతాబ్దములోని 'మహాయాన దార్శనిక నాగార్జునుడో', లేక క్రీ. శ. 7వ శతాబ్దములోని 'సిద్ధనాగార్జునుడో' అయి ఉండవల

యును. కాని, మూడవ నాగార్జునుడు మాకు కాన్పించలేదు. 'దిలీపకుమారమాలాకర' అను విద్వాంసుడు ప్రవాసీ పత్రికలో సిమధ్య కాలవ్యాసమును వ్రాయుచు, మనము ఇతిహాసములో నాకరికంటె నక్కువగా నాగార్జునుల ఉల్లేఖనము జూచెద మని దార్శనిక నాగార్జునుడు, రసాయనిక నాగార్జునుడు ఒకే వ్యక్తిగా గాన్పించరని, వారు ఒకే కాలమునకు జెందియుండరని, దార్శనిక నాగార్జునుడు కనిష్కునికాలములో నుండెనని వ్రాసి యుండెను.[36] ఇంకను క్రీ. శ. 8వ శతాబ్దములో నొకనాగార్జును డుండెనని, ఆయన 'నాలందా' విద్యాలయమును అనేకవిధముల ఉన్నతిలోనికి దెచ్చెనని, బౌద్ధుడేనని పైలేఖకుడు వ్రాసెను."

'నాలందావిద్యాలయము'లోని పండితుల పట్టీలో నాగార్జునుడుగాన్పించడు. ఈయనతర్వాతవారగు 'అసంగ, వసుబంధు' లు కూడ నాలందా విద్యాలయ పండితుల పట్టీలోలేరు. ఏలన నగా, అసంగ, వసుబంధుల తర్వాత 50 ఏండ్లకుగాని 'నాలందా' విద్యాలయస్థాపన జరిగియుండలేదు. 'విధుశేఖర శాస్త్రి' క్రీ. శ. 7వ శతాబ్దములోని 'నాగార్జునుని' గూర్చి ఉల్లేఖించెను. రసాయనిక నాగార్జునుడు దార్శనికుడని పైవిద్వాంసుడు వ్రాసెను. అట్లయిన ఏనాగార్జునుడైన 'నాలందా' విద్యాలయములో పండితుడుగానుండి పనిచేసెనా యని యోచించవలసి యున్నది. క్రీ. శ. 2వ శతాబ్దమునాటి వాడగు దార్శనిక నాగార్జునుని కాలములో 'నాలందా' విద్యాలయ మేర్పడి యుండలేదు. అందుచే మొదటి నాగార్జునుడు, పండితుడుగా పనిచేసెననుట

---

[36] ధర్మదూత- (హిందీ) 1946 జూన్ సంచిక పుట. 6.

పొసగదు. క్రీ. శ. 7వ శతాబ్దములోని రెండవ నాగార్జునుడైన 'సిద్ధనాగార్జునుడు' నాలందా విద్యాలయ పండితుడా యని యోచించవలయును.

హూనుత్సాంగు వ్రాతలనుబట్టి నాగార్జునునికి, ఆర్యదేవునికి నాలందా విద్యాలయ సంబంధము తెలియవచ్చుచున్నదికాని, ఇది సత్యముగాదు. రాహులభద్ర సంబంధముకూడ నట్టిదే. ఈ'రాహుల భద్రుడు' శ్రీ'నాలందా' లో నధ్యాపకుడని, అపుడు 'శ్రీచంద్రుడు' అనురాజు, ఖ్యాతిగాంచిన(Fragrant) 14 చతుశ్శాలల, పోల్చుటకు వీలులేని, 14 మతసంబంధము లగు విద్యాలయముల గట్టించెనని, టిబెటీయ చరిత్రకారుల వ్రాతలు దెల్పుచున్నవి.[37]

'సిద్ధనాగార్జునుని' గురువగు 'రాహులభద్రుడు' నాలం దాలో నధ్యాపకుడని, పైప్రమాణము తెల్పుచున్నది: కాని నాగార్జును డధ్యాపకుడను ప్రమాణము లభించలేదు. ఒకవేళ గురువుగారి యనంతరము, సిద్ధనాగార్జునుడు, పండితుడుగా నుండిన ఉండవచ్చును. క్రీ. శ. 1030 లో భారతవర్షమునకు వచ్చిన 'అల్బరూని', నాగార్జునునిగూర్చి ఉల్లేఖించుచు, ఆయన 'దైహాకకోట' వాసియని రసాయన విద్యావేత్తయని, దానిపై గ్రంథము రచించెనని, మాకు పూర్వము 100 సంవ త్సరముల క్రితము ఆయన జీవించెనని' వ్రాసెను.[38] దీనిప్రకా

[37] Vidyabhushana - O. C. P. 146 - As quoted by Sankalia -. The University of Nalanda P. 102.

[38] Dr. Edward C. Sachua - Alberuni's India Chap. XVII - P. 189.

రము క్రీ. శ. 930 సంవత్సర ప్రాంతమున నొకనాగార్జును డుండెనని చెప్పవచ్చును. కాని అప్పుడు నాగార్జునుడు కాన్పించడు. భారతీయులెవరో తప్పుకాలమును జెప్పియుండుటచేత, అదినమ్మి 'అల్బరూని' గ్రంథస్థముజేసి యుండెను; కాని క్రీ. శ. 930 లో 'నాగార్జును డెవరు లేరు.

క్రీ. శ. 7వ శతాబ్దములోని వాడని 'విధుశేఖరశాస్త్రి' చెప్పిన నాగార్జునుడు, క్రీ. శ. 8వ శతాబ్దములోని వాడని దిలీపకుమారమాలాకర చెప్పిన నాగార్జునుడు, క్రీ శ. 930 లోని వాడని 'అల్బరూని' చెప్పిన నాగార్జునుడు, వేరువేరు కాలములలో గాన్పించరు. క్రీ. శ. 645వ సంవత్సరప్రాంతమున గల 'సిద్ధనాగార్జునుడే' పైముగ్గురు లేఖకులు పేర్కొన్న నాగార్జునుడు.

చాలమంది చరిత్రకారులు, లేఖకులు, విద్వాంసులు 'బోధిసత్వ నాగార్జునుడే, సిద్ధనాగార్జునుడని' వ్రాసిరి. దీనికి కారణమేమనగా ఉభయులు బౌద్ధులు; ఉభయులు మహాయాన మాధ్యమికశాఖ ప్రబోధకులు. ఉభయులు యోగులు. ఉభయులు రసాయనశాస్త్రవిదులు. ఉభయులు తంత్రశాస్త్రజ్ఞులు. ఉభయులు నాస్తిక మతబోధకులు. ఉభయులు ఒకేవిధమగు 'నిర్వాణము' ను బోధించిరి. ఉభయులు వైద్యులు. అందుచే కాలనిర్ణయమును గమనించకుండ ఇరువురు నొకటే యని పొరపాటుపడిరి. 'వింటర్‌నిడ్జ్' అను 'జార్మణ్యవిద్వాంసుడు (German scholari) కూడ నల్గురు నాగారునులు గలరని యభిప్రాయపడెను. కాని మాపరిశోధనలనుబట్టి గ్రంథ

కర్తలగు నాగార్జును లిరువురేయని తెలుచున్నది. ఈయిద్దరిలో గూడ నీక్రిందిభేదములను గుర్తించవచ్చును.

మొదటివాడగు 'నాగార్జునబోధిసత్త్వుడు (క్రీ.శ. 2వ శతాబ్దములోని వాడు) బ్రహ్మచారి. మొదట బ్రాహ్మణమతస్థుడు. తరువాత హీనాయాన బౌద్ధమతస్థుడు. తరువాత 'మహాయాన' మతస్థుడు. మాధ్యమికశాఖ స్థాపించెను. దార్శనికుడు. అమితభ మతము బోధించెను. ఈయనగురువు కపిమల. నాగార్జునుడు 14వ మహాగురువు. శాతవాహన రాజుల కాలములోనివాడు. శ్రీపర్వతముపై సంఘారామము నీయనకొరకు రాజు కట్టించెను. 'సింహళద్వీపము' మున్నగు చోట్లకేగి అనేకగ్రంథముల దెచ్చెను. కొండపైన ప్రయోగశాల, గ్రంథాలయ మేర్పరచెను. సంఘారామములోనే ప్రాణమువీడెను. ఈయన చనిపోయిన తర్వాత 'బోధిసత్త్వుడ'ని పేర్కొనిరి. ఈయన 'విదర్భనగరము'లో జన్మించెను. దక్షిణదేశవాసి. 'అమరావతి' బయట ప్రాకారమును గట్టించెను. ఆంధ్రుడుగా జన్మించకపోయినను ఆంధ్రదేశములోనే నివసించెను. 24 గ్రంథములకు పైగా రచించెను. ఆర్యదేవ, నంద, బుద్ధోపలిత మున్నగువారు శిష్యులు. ఈయన జీవితచరిత్రము చైనీయభాషలో 'కుమారజీవుడు' వ్రాసెను. అందుచే 'చైనా'లో గొప్ప పేరుగలదు. అనేకగ్రంథము లాభాషలోనికి అనువాదమాయెను.

రెండవవాడగు 'సిద్ధనాగార్జునుడు' క్రీ.శ. 7వ శతాబ్దములోనివాడు. ఇతనికి 'లోకి' 'గుణి', యను భార్యలు గలరు. ఈయన 84గురు సిద్ధులలో నొకడు. టిబెటునుండి 'ఏకజట'

దేవతపూజను గైకొని వచ్చెను. తంత్రశాస్త్రము నభివృద్ధిలోనికి దెచ్చెను. ఈయనగురువు 'సరహ' లేక 'సరహాభద్ర' లేక 'సిద్ధసరహ' లేక 'రాహులభద్రుడను' పేర్గాంచిన తంత్ర శాస్త్రవేత్త. 'సిద్ధనాగార్జునుడు' 'వజ్రయాన' అనుయాయి. దీనిని వ్యాప్తిచేసెను. అనేక తంత్రశాస్త్రకర్త. ఈయనశిష్యుడు 'శబరిప'. ఈసిద్ధనాగార్జునునికి 'టిబెటులో' గొప్పపేరు ప్రఖ్యాతులు గలవు. ఈయన గ్రంథము లనేకములు 'టిబెటీయ' భాషలో గలవు. నాలందా విద్యాలయముతో కొంత సంబంధ ముండవచ్చును. తంత్రబౌద్ధము వ్రాసినవారిలో నీయన మొదటి వాడు. ఈయన జన్మభూమి ఘూర్జరదగ్గర దైహాకకోట కావచ్చును. వీరిరువురుగాక బుద్ధుని మేనమామ ఒక 'నాగార్జునుడు' గలడని తెలియుచున్నది. ఈయన క్రీ.శ. 5వ శతాబ్దము లోనివాడు. కాని ఎట్టిప్రాముఖ్యత వహించినవాడు కాదు. కాన వదలివేయడమైనది.

ఈభేదములను గుర్తించకుండ ప్రామాణికులెల్లరు 'నాగార్జును'డొకడేనని, గ్రంథకర్తృత్వము, గురువులు మున్నగుసమస్త విషయములలో బొరపాటుపడిరి. "హ్యూనుత్సాంగు" వచ్చు నాటికి 'సిద్ధనాగార్జునుడు' జన్మించినను, ఖ్యాతిగాంచియుండడు. అందుచే నాయన మొదటి నాగార్జునుని గూర్చియే వ్రాసెను. 'ఇత్సింగు' అను మరియొక చైనీయ లేఖకుడు, బాణుడుకూడ నీయననుగూర్చియే వ్రాసిరి. కాని తర్వాత ప్రామాణికులగు 'అల్బరూని, కల్హణుడు, తారానాథుడు' మొదలు చాలమంది ఆధునిక విద్వాంసులవరకు, ఈపొరపాటును లోనై, ఇరువురు

నాగార్జునులన్న విషయ మెరుంగక, ఒకరివిషయము లొకరికి ముడి పెట్టి, చరిత్రను తారుమారుచేసి, తామేకాకుండ పాఠకులోక మునుగూడ భ్రమప్రమాదములకు లోనగునట్లు చేసిరి. ఇంత కంటె అత్యంత బలీయమైన ప్రమాణములు లభించువరకు నాగార్జును లిరువు రేయని నమ్మవలసియున్నది.

## 4. నాగార్జునచరిత్ర కాధారములు

ఎవరిచరిత్రము వ్రాయవలెనన్నను ఆగ్రంథకర్త రచించిన గ్రంథములు ముఖ్యాధారములు. 'నాగార్జున రచిత గ్రంథ ములన్ని మాకు లభించలేదు. కొన్నిటినిబట్టి కొంతచరిత్రము లభించినది. ఈవ్రాతలు కొంతఆధారము. 'అశ్వఘోష, నాగా ర్జున, ఆర్యదేవ చరిత్రములు చైనీయభాషలోనికి క్రీ. శ. 387-418 మధ్యలో 'కుమారజీవుడు' మార్చియుండెను.[39] 'కుమార జీవుడు' నాగార్జున చరిత్రను క్రీ. శ. 405 లో రచించెను. ఈ గ్రంథములు ముఖ్యాధారములు. ఇవిగాక చైనీయభాషలో 'నాగార్జునుని' జీవితసంబంధమగు గాథలుకూడ కలవు. క్రీ. శ. నాల్గయిదు శతాబ్దములలో రచింపబడిన 'దీపవంశ, మహావంశ ములు' నాగార్జునుని శిష్యుని 'దేవ పూసను' గూర్చి వ్రాయు టచేత, నివియు గొంతవర కాధారములు. 'పాహియాను'

---

[39] H. Kern-Manual of Indian Buddhism. P.122, ("The lives of Nagarjuna, Aryadeva and Aswaghosha are said to have been translated into Chinese A. D. 387-418. Wassilief B210, Waddell — Buddhism of Tibet 11).

శ్రీపర్వతమునకు స్వయముగా వచ్చి చూడకపోయినను, పారావత మతమును గూర్చి వర్ణించియుండెను. తరువాత వచ్చిన చైనీయపరివ్రాజకుడు 'హూనుత్సాంగు', స్వయముగా 'శ్రీపర్వతము'ను గాంచి, యచటి గుహలను గురించి 'నాగార్జునుని'గూర్చి తాను విన్నకథలను వ్రాసియుండెను. 'హూనుత్సాంగు' జీవితకర్త 'హ్వ్యూలీ' కూడ నాగార్జునుని గూర్చి కొంత వ్రాసెను. 'ఇత్సింగు' అను చైనీయపరివ్రాజకుడుగూడ నాగార్జునునిగూర్చి ఉల్లేఖించెను. క్రీ. శ. 7వ శతాబ్దములోని వాడగు 'హర్షుని' ఆస్థానకవి 'బాణుడు' కూడ నాగార్జునుని గూర్చి కొంత వర్ణించియుండెను. 'సోమదేవ' రచితమైన కథా సరిత్సాగరము (క్రీ. శ. 1063–1081 మధ్యరచన) లో గూడ 'నాగార్జున చరిత్రము' గలదు. 'గుణాఢ్య పండితుని' బృహత్కథనుండియే, క్షేమేంద్రుని బృహత్కథామంజరి, (క్రీ. శ. 1037) సోమదేవుని కథాసరిత్సాగరము వచ్చినవి. మూలములో నాగార్జునికథ కలదో లేదో తెలిసికొనుటకు, పైశాచీ భాషలో వ్రాయబడిన ఆ గ్రంథమిపుడు ఖిలమైపోయినది. 'అల్బరూని' కూడ నాగార్జునునిగూర్చి కొంత ఉల్లేఖించెను.

'కల్హణుడు' 8000 శ్లోకములుగల 'రాజతరంగిణి' అను కాశ్మీరరాజుల చరిత్రమును క్రీ. శ. 1148 లో రచించెను. ఈయన 'నాగార్జును'నిగూర్చి కొంత యుల్లేఖించెను. తన కాలములోని విషయములను, అంతకుపూర్వ మొకశతాబ్దము క్రితము విషయముల నీయన శాస్త్రీయముగు చారిత్రకదృష్టితో వర్ణించియుండెను కాని ప్రాచీనవిషయములు చరిత్రకు

విరుద్ధములు.[40] పదహారవ శతాబ్దములోని 'లామాతారానా ధుడు' రచించిన 'త్రిపిష్టకము' లోని 'బౌద్ధమతచరిత్రము' 'అద్భుతకథలు' అను గ్రంథములనుబట్టి నాగార్జునచరిత్రము కొంత తెలియుచున్నది. ముఖ్యముగా సమకాలీన ప్రమాణములు ముఖ్యాధారములు. పాశ్చాత్య విద్వాంసులు విపులమగు పరిశోధనలొనర్చి, నాగార్జునునిగూర్చి అనేకవిషయములు బయల్పరచిరి. వీరి అమూల్యమగు వ్రాతలు నాకు కొండంత సాయమొనర్చినవి. ఇంకను జపాను, చైనీయ, త్రిపిష్టక భాషలలోని గ్రంథము లనేకములు నాగార్జున రచయితములు, నాగార్జునునిగూర్చి వ్రాసినవి ఆంగ్లేయభాషలోనికి తర్జుమా అయినవి. ఇవియన్నియు ప్రబలాధారములు. ఈసందర్భములో 'వాలెసర్, వాడెల్, వాటర్సు, బీల్, వింటర్‌నిడ్జ్' మున్నగు విద్వాంసులను పేర్కొనకతప్పదు. నాస్తికమత ప్రబోధకుడగుటచేత కాబోలు, ఏప్రాచీన బ్రాహ్మణ విద్వాంసుడు, ఏ ఒకరిద్దరో దార్శనికులుగాక మిగతవారు తమ గ్రంథములలో నీయనను పేర్కొనలేదు.

---

[40] A. A. Macdonall – A history of Sanskrit literature P. 430. "The poet does not become historical, till he approaches his own times."— India's past P. 246. His work seems to be fairly reliable for his own time and perhaps for a century or so before; but for any earlier period it soon shows itself to be imaginative."

# III

## నాగార్జున బోధిసత్వుని కాలనిర్ణయము

### కాలనిర్ణయమునుగూర్చి వివిధపరిశోధకుల అభిప్రాయములు.

చరిత్రయనగా ముఖ్యముగా కాలనిర్ణయమే. నాగార్జునుని కాలనిర్ణయమును నేటివరకు విమర్శించి, తృప్తికరముగా చేసిన వారెవరును లేరు. కాలనిర్ణయము తేలువరకు, ఆయనచరిత్రము అసంపూర్ణమై యున్నదని చెప్పవలయును.

'నాగార్జున బోధిసత్వుడు,' క్రీ. శ. 2వ శతాబ్దములోని వాడని, 'అసంగ, వసుబంధు' లను సోదరులు క్రీ. శ. 5వ శతాబ్దములోని వారని, 'వెంట్జ్' (Wentz) వ్రాసెను.[41] తరువాత కాలములోని. ఈశాఖకు జెందిన ప్రసిద్ధగురువులు, నాగార్జునుడు, ఆర్యదేవుడు, వసుబంధుడు అనువారు. నాగార్జునుడు క్రీ. శ. 150–200 మధ్యలోనివాడు అని 'హాక్మన్' వ్రాసెను.[42] 'దిగ్నాగ, శాంతరక్షిత,' యనువారు కూడ, నాగార్జునుని శాఖలోని ప్రఖ్యాతపండితులు. "ఆర్యదేవ' శిష్యుడు 'ధర్మత్రాత' క్రీ. శ. 200 ప్రాంతపువాడని, 'కుమారలబ్ధుడు' నాగార్జునుని సమకాలీనుడని, క్రీ. శ. 200 సంవత్సర ప్రాంతమని, నాగార్జునుని కాలమునుగూర్చి అనేక సందియములు గల్గుచుండునని, ఇంకను ఈయన మహాయాన మాధ్యమిక శాఖాస్థాపకుడని,

---

[41] W. Y. Evans Wentz-Tibetan Yoga and Secret doctrines. P. 15.

[42] H. Hackmann- Buddhism as a Religion P. 56.

'ఆర్యదేవుడు' అను నాగార్జునుని శిష్యుడు, సమకాలీనుడు, తన 'చిత్తవిశుద్ధిప్రకరణము'లో 'రాసి, వారక' యను పదము లుపయోగించెనని, వీనినిబట్టి యవన జ్యోతిషశాస్త్రజ్ఞానము తెలియవచ్చుచున్నదని, క్రీ.పూ. 200 కు పూర్వ మీదేశమున ఈరూపములో ప్రవేశించినట్లు వూహించవచ్చునని, ఇంకను తరువాతకాలములోగూడ ప్రవేశపెట్టబడి యుండవచ్చునని, ఈ సిద్ధాంతము అంతిమనిర్ణయము గాదని, ఏలననగా క్రీ. శ. 100 నాటికి వారములపేర్ల పేర్కొనుపద్ధతి భారతవర్షమున లేదని గాని, వ్యాప్తికాలేదనిగాని ఋజువుచేయలేమని, 'ఇటలీ' లో ఆశతాబ్దమునకు బూర్వమే ఇది కలదని, సాంప్రదాయాను సారము వచ్చినవానినిబట్టి, క్రీ. శ. 200 ప్రాంతము, నాగార్జునుని సబబైనకాలమని నిర్ణయించవచ్చునని, 'కీత్' పండితుడు వ్రాసెను."[43]

"బుద్ధవరి నిర్వాణమైనతరువాత 4 శతాబ్దములకు జననమని, దక్షిణహిందూస్థానములోని రహస్యమగు ఏకాంతస్థలమున కీయన ఏగెనని, ప్రపంచములో నీయన పని క్రీ. శ. 2వ, 3వ శతాబ్దములలో జరిగెనని, 'లామాల' అను శ్రుతిప్రకారము క్రీ. పూ. 1వ శతాబ్దములో జన్మించెనని, నమ్మబడుచున్నదని 'ప్రజ్ఞాపారమిత సూత్రముల' పవిత్రమొనర్చెనని యొకచోట[44] టిబెటీయ భాషలో నీయనను లు-గ్రబ్ (Klu-Grub pron.

---

[43] A. B. Keith - Buddhist Philosophy in India and Ceylon. (1923) P. 154, 156 and 229.

[44] H. Hackmann- Buddhism as a Religion. P. 120

as Lu-Grub) అందురని, 'అశ్వఘోషుని' శిష్యుడు కావచ్చునని, 300 ఏండ్లు పనిచేసెనని, మరి 300ఏండ్లు జీవించెనని, 'హాక్మన్' వ్రాసెను.[45] 'విలియమ్ గెమ్మెల్' తన వజ్రసూత్రములో(Diamond Sutra) క్రైస్తవ శకారంభములోని వాడని, క్రీ. శ. 194 లో చనిపోయెనని వ్రాసెను.[46] 'నాగార్జునుడు,' క్రీ. శ. 2వ శతాబ్దములో జీవించియుండెనని, బి. భట్టాచార్య, యను భారతీయ విద్వాంసుడు వ్రాసెను[47]. నాగార్జునుని కాలనిర్ణయమును గూర్చి నమ్మకముగా జెప్పవలెనన్న, కనిష్కుని కాలమున కెంతయో దూరమున నుండడు, అని యస్. బీల్ వ్రాసెను[48] "నాగార్జునుడు వేరు, నాగసేనుడు వేరని, 'నాగసేనుడు' 'మిలిందపన్హా' కర్తయని, ఈయన భిక్షువని, ఉత్తర భారతవర్షములోని వాడని, నాగార్జునుడు కుమారజీవుని ప్రకారము దక్షిణహిందూస్థాన వాసియని, బోధిసత్వుడని, నాగసేనునికి మినాండరుకు క్రీ పూ. 140 సంవత్సర ప్రాంతమున, సంవాదము జరిగెనని, నాగార్జునుడు యాధిగా కనిష్కుని కాలమునకు తరువాతవాడేనని, ఇటీవల జరిగిన ఆధునిక సిద్ధాంతముల నిర్ణయములబట్టి క్రీ. శ. 2వ శతాబ్దాంతములో 'నాగార్జునుడు' నివసించెనని, 'నాగసేనుడు' నేర్పరియైన

[45] Ibid-P. 345.

[46] William Gemmel - The diamond Sutra P. IX and P. 167.

[47] B. Bhattaoharya - An introduction to Buddhist esoterism, P. 26.

[48] S. Beal- Abstract of 4 lectures on Buddhist literature in China-P. 96.

తార్కికవిద్వాంసుడని, బుద్ధదేవుని ప్రాచీనసంప్రదాయమునను సరించిన శాఖవాడని, నాగార్జునుడు క్రొత్తశాఖను స్థాపించెనని, యక్షిణి, తంత్ర విద్యలలో ప్రవీణుడని, 'బీల్ పండితుడు' వ్రాసెను.[49] ఇంకను త్రిపిష్టవ వాసుల లెక్కలనుబట్టి, నాగార్జునుడు బుద్ధునితర్వాత 600 ఏండ్లు జీవించియుండెనని, తారానాధుని ప్రకారము 600కు 71 ఏండ్లు తక్కువకాలము జీవించెనని, ఇతరుల లెక్కలప్రకారము, 600కు 29 ఏండ్లు తక్కువ కాలము జీవించెనని, కొందరువ్రాసిరని, కాని తనయభిప్రాయములో అది నాగార్జునుడు జీవించినకాలము గాదని, బుద్ధుడు చనిపోయినతర్వాత 600 ఏండ్లకు 71 ఏండ్లు గాని 29 ఏండ్లు గాని తక్కువకాలమున నాగార్జునుడు జీవించెనని, త్రిపిష్టవ వాసుల లెక్కలప్రకారము అశోకునికి ముందు 100 ఏండ్ల క్రితము బుద్ధుడుండెనని అభిప్రాయమని, పైవానినిబట్టి నాగార్జునుని కాలము క్రీ.శ. 166 నుండి క్రీ. శ. 200 ప్రాంతమని తేలుచున్నదని, అదియే అతిసమీపకాలమని, మనమీకాలమును చైనీయ, త్రిపిష్టవ ఆధారములబట్టి నిర్ణయించవచ్చునని, నాగార్జునుడు సమస్తశాస్త్ర మెరింగినవాడని, సర్వవిదుడని, అతని మరణానంతర మతనికి స్థూపములు గట్టిరని, బుద్ధునివలె అతనిని బూజించిరని బీల్ వ్రాసెను.[50]

---

[49] S. Beal— The age and writings of Nagarjuna Bodhisatva in Indian Antiquary. Vol XV P. 353.

[50] Ibid—P 355 and P 356.

"ఇంకను 'చైనీయభాషలో' 'పో—తో—పో—హో—' అనగా బాగుగా లాగువాడు, లేక తోడువాడు, అని అర్థము. 'సద వాహ' అని సంస్కృతమున నందురు. 'ఇత్సింగు' వ్రాతలప్రకా రము 'షి—యెన్—టె—కియ' (స్వంతపేరు). 'వాయుపురా ణము'లో 'సింధుక' శబ్దము గలదు. ఈయన ఆంధ్రులలో మొదటివాడు. ఈశాతవాహనుడు క్రీ. శ. 178-207 వరకుం డెనని, ఈయన 'యజ్ఞశ్రీ శాతకర్ణి'యై యుండవచ్చునని, 'బీల్ పండితుడు' ల్లేఖించెను. పైకాలమే నాగార్జునయతి కాల మని పైవిద్వాంసుని అభిప్రాయము.

ఇంకను మహాగురు పరంపరలో నాగార్జునుడు 13వ వాడని, పార్శ్వుడు 9వ వాడని, కనిష్క—సభ కధ్యక్షుడైనచో 'అశోకుని' తర్వాత 300ఏండ్ల కుండెనని, క్రీ.శ. 70 లేక 75లో నుండెనని, 'హానుత్సాంగు' బుద్ధనిర్వాణము తర్వాత 400 ఏండ్ల కుండె నని, పుణ్యయశసు 10వ వాడని, అశ్వఘోషుడు 11వ వాడని, కపిమల 12వ వాడని, నాగార్జునుడు 13వ వాడని, అశ్వ ఘోషుడు కనిష్కుని సమకాలీనుడని, సంయుక్త రత్న పిటక లోని 93, 94 కథలనుబట్టి రాజగు చంద్రుడు, కనిక, గాంధార కనిష్కులపేర్లు తెలియవచ్చుచున్నవని, 94వ కథలో నాయ నకు ముగ్గురు మిత్రులున్నట్లు తెలియునని, ఆధ్యాత్మికగురువగు అశ్వఘోషు డొకడని, ప్రధానమంత్రియగు మో—చ—లో (మఠ్ర) ఒకడని, చై-లో-కియ (జరక) అను ఆయన ముఖ్య వైద్యు డొకడని, 'నాగార్జునుడు' క్రీ. శ. 2వ శతాబ్దమునకు ముందటివాడు కాదని 'బీల్' లిఖించెను.[51]

[51] Ibid P. 354.

ఇంకను 'హూనుత్సాంగు' జీవితచరిత్రలో 'బీల్' పండితు డిట్లు లిఖించెను. "నాగార్జునుడు కనిష్కునికి 100ఏండ్ల తర్వాత నుండెనని నమ్మబడుచున్నది. అనగా రెండవశతాబ్దాంతములో నుండెను. ఇదియే 'సదవాహ' కాలము. ఈయన 'శింతు' (హిందు) ఏలెను. ఆయనకు పేరు 'స్యెంతో కియా';(Shi-yen-to-Kia-Sindhuka) ఆయన ప్రాయశః సింధునదిమీాద నివసించెను. విజయయాత్ర వల్ప దక్షిణకోసలను ఆక్రమించెను. నాగార్జునుడు ఆయనకు స్నేహపూర్వకముగా నొకయుత్తరమును బంపుచు దానిలో జీవితమును నీతివథమున నుంచుడని, మతసంబంధమగు సద్వర్తనమున గడపుడని హెచ్చరించుచు లిఖించెను.'[52] ఈయన అభిప్రాయప్రకారము క్రీ. శ. 2వ శతాబ్దములో నాగార్జునుడున్నట్లు తెలియుచున్నది. "బుద్ధనిర్వాణము తర్వాత 400 ఏండ్లకు జంబూద్వీపమున కంతటికి 'కనిష్కుడు' రాజాయెను."[53] కాని ఈకాలనిర్ణయము ఆధునిక పరిశోధనలబట్టి తప్పని వేరుగా జెప్పనక్కరలేదు.

వాటర్సు ఇట్లు వ్రాసెను. "తారానాధుని ప్రకారము 'నాగార్జునుడు' 529ఏండ్లు పైగా జీవించెనని తేలుచున్నది. అతని ముక్కురంధ్రములలోనికి నీరెక్కించి అతని జీవితమును పెంచెను. రాళ్లను బంగారుగా మార్చెను. ఆయన రసశాస్త్రము తెలుంగును- (వెండి బంగారము చేయు విద్య). ఆయన రాజని ఒకరు వ్రాసిరి కాని అదితప్పు. అతనిజీవితము, కాలము జన్మ

---

[52] S. Beal-Life of Hiuen Tsiang by Hwiu Li P. XX.
[53] Ibid — P. 203.

స్థానమునుగూర్చి సరియైన వృత్తాంతము తెలియదు. ఒక రీయన జన్మస్థానము పశ్చిమహిందూస్థానమనిరి. బహుజనాభిప్రాయము ప్రకారము దక్షిణహిందూస్థాన వాసియని, విదర్భ (కోసల) యని తెలియును. టిబెటీయులు అధికకాలము నాలందాలో గడపెనందురు. బుద్ధనిర్వాణము తర్వాత 700, 500, 400ఏండ్ల కుండెనని కొందరువ్రాసిరి. ప్రధాన గురుపరంపరను బట్టి 13వ లేక 14వ ప్రధానగురువుగా నుండెనని, క్రీ పూ. 212లో మరణించెనని, క్రీ.పూ. 482లో జన్మించెనని చెప్పబడుచున్నది. 'రాజతరంగిణి'ని బట్టి కనిష్కుని సమకాలీనమో, తరువాతవచ్చిన 'అభిమన్యుని' కాలమో యగుచున్నది.[54]

రాజతరంగిణి ప్రకారము 'నాగార్జునుడు' కనిష్క- సమకాలీనుడు. త్రివిష్టపవాసులు 'నాగార్జునుడు' బుద్ధునితర్వాత 400 ఏండ్ల కున్నట్లు, దక్షిణదేశ బౌద్ధులు 500 ఏండ్ల తర్వాత నున్నట్లు చెప్పుదురు. 'పీబరు' రచిత భారతీయ సారస్వత చరిత్రమును (288పుట) బట్టి దక్షిణదేశ బౌద్ధులకంటె ఉత్తర దేశ బౌద్ధులు ప్రామాణికులని, 'నాగార్జునుని' కాలముకూడ సరియైనదని 'పీబరు' అభిప్రాయపడెనని తెలియును గాని ఉభయులవ్రాతలు తప్పుగానే కాన్పించుచున్నవి.

'రాజతరంగిణి' ప్రకారము 'అభిమన్యుడు' కాశ్మీరమేలినపుడు నీలపురాణ సంబంధవిషయముల వదలి, వేదముల నెఱుంగుచుండిరని తెలియుచున్నది. అభిమన్యుడు కనిష్కుని పుత్రుడు. కల్హణుని ప్రకారము హవిష్కుడు, జస్కుడు, అభి

---

[54] T. Watters -On Yuan Chwang's travels Vol II. P. 202.

మన్యుడు వీరిద్దరు కనిష్క-పుత్రులు. నాగార్జునయతి, అభిమన్యుని సమకాలీనుడైనచో క్రీ. శ. రెండవ శతాబ్దాంతము కావచ్చును.

తారానాథుని వ్రాతలనుబట్టి, 'వరరుచి కాత్యాయనుడు' ఉదయన ఆస్థానమునందు పురోహితుడుగా నివసించెనని, ఆయన సోదరుడు తరువాత కొంతకాలమునకు 'శాతవాహన రాజుకు మంత్రిఆయెనని తెలియుచున్నది. దీనిప్రకారము 'వరరుచి కాత్యాయను' నికి నాగార్జునుడు సమకాలీనుడని తెలియుచున్నది."[55] 'వరరుచి కాత్యాయనుడు క్రీ.పూ. 3వ శతాబ్దమువాడు. అప్పటికి నాగార్జునుడు లేడు. అందుచే పైవ్రాత సత్యదూరముగా నున్నది.

ఇంకను తారానాథు డొక సాంప్రదాయమును బేర్కొనుచున్నాడు. దీనిప్రకారము 'నాలందా'లోని విద్యాలయముల విషయములో నమితశ్రద్ధ గైకొనినవారు 'నాగార్జున ఆర్యదేవు' లని (క్రీ.శ.-100) తెలియును. బహుకాలముగా వాడుకలో నున్న ఇంకొక సాంప్రదాయమును 'తారానాథుడు' పేర్కొనుచున్నాడు. 'సువిష్ణు' అను 'నాగార్జునుని' సమకాలీనుడు 'నాలందా'లో 108 విద్యాలయములను, అభిధర్మశాస్త్రము పఠనముగా నుండుటకు స్థాపించెనని తెలియును. ఈఅనుశ్రుతిలో 'నాగార్జునుడు' పేర్కొనబడుటచేత అది క్రీ.శ. 2వ శతాబ్దమునకు బూర్వము కాదని చెప్పవచ్చును.[56] అని 'సంకాలియా'

[55] Indian Antiquary-XVI-P 169-S. Beal.
[56] Sankalia - The University of Nalanda. P. 35 Also see Taranatha - History of Buddhisim in India P. 72.

వ్రాసెను. కాని తారానాథుడు పేర్కొన్న నాగార్జునుడు సిద్ధనాగార్జునుడు కావచ్చును. 'నాలందా'లో 108 విద్యాలయములును క్రీ. శ. 7 వ శతాబ్దములో నాలందాలో నేర్పడియుండవచ్చును. క్రీ. శ. 2 వ శతాబ్దములో 'నాలందాలో' విద్యాలయ మేర్పడలేదు. 'సూత్రకృతాంగ' అను జైనగ్రంథము 'నాలందా'ను పేర్కొన్నను ఈవిషయము చెప్పదాయెను. పైగాథలోని 'సువిష్ణు' వెవరో తెలియకున్నది, బహుశ క్రీ.శ. 7 వ శతాబ్దములోని ఒకరాజుగావచ్చునని ఊహ కల్గుచున్నది.

"మాధ్యమిక శాస్త్రకర్త 'ఆచార్య నాగార్జునుడు' క్రీ. శ. 200 సంవత్సర ప్రాంతమున నివసించెనని, అనేక తంత్రశాస్త్రములకు కర్తయగు, 'నాగార్జునుడు' క్రీ. శ. 650 లో నివసించెనని, 'అయ్యస్వామిశాస్త్రి' వ్రాసెను.[57]

మహాయాన వింశక ఉపోద్ఘాతములో, విధుశేఖర భట్టాచార్యులుకూడ మొదటినాగార్జునుడు క్రీ శ. 200 లోనివాడని రెండవనాగార్జుడు, క్రీ. శ. 7 వ శతాబ్దములోని మొదటి ఏబది ఏండ్లలో నివసించినాడని, నమ్మబడుచున్నదని వ్రాసెను.[58] ఒక సాంప్రదాయప్రకారము 'నాగార్జునుడు' 60 ఏండ్లు జీవించి మరణించి, సుఖావతికేగెనని, ఈయన జగ్గయ్యపేట శిలాశాసనములో పేర్కొనబడినాడని, ఇంకొక దానిప్రకారము 100 ఏండ్లు జీవించెనని, ఇంకొక కల్పితగాథా సాంప్రదాయప్రకా

---

[57] Aiyaswamy Sastry N – Bhava Sankranti Sutra – Introduction P XXII and XXIII

[58] Vidhusekhara Bhattacharya –Mahayana–Vimsaka – P. 3.

రము 5 శతాబ్దములకు పైకాలమువరకు జీవించెనని ( Wassilief B 318, Tar 73) 'హూనుత్సాంగు' ఆయనను ప్రపంచములోని భానుచతుష్టయము లో నొకడని పేర్కొనెనని దేవ, కుమారలబ్ధ, అశ్వఘోషులతోపాటు యీయన యొక డని, తురుష్కస్థానపు రాజులతర్వాత వెనువెంటనే నాగార్జునుడు జీవించియుండెనని, 'రాజతరంగిణి కర్త' వ్రాయుటచేత మనము 'నాగార్జునుని' రెండవశతాబ్ద మధ్యములోగాని, క్రీ.శ. 150–200 మధ్యకాలములోగాని 'నాగార్జునుడు' జీవించియుండె నని, నిర్ధారణ చేయవచ్చునని, 'హెచ్. కెరన్' అను ప్రామాణిక విద్వాంసుడు వ్రాసెను.[59] "అశ్వఘోషుని తర్వాత నాగార్జునుడు వచ్చునని, క్రీ. శ. 125-200 మధ్యకాలములో నెప్పుడైన జీవించి యుండవచ్చునని ఆయన 300 ఏండ్లు జీవించె నను గాథ భావరహితముగాదని" 'ఎలియట్' పండితుడు వ్రాసెను."[60]

'ఆర్యదేవుడు' దక్షిణదేశీయుడు; క్రీ. శ. 3వ శతాబ్దము లోనివాడు. నాగార్జునుడు దక్షిణదేశవాసియని, బౌద్ధమతము బోధించెనని, 300 ఏండ్లు మత బోధను చేసెనని, త్రిపిష్టపవాసుల లెక్కప్రకారము 600 ఏండ్లుకు మరణించెనని, ప్రాయశః 'నాగార్జునుడు' క్రీ. శ. 2వ శతాబ్దాంతములో జీవించెనని, 'రాజతరంగిణికర్త, కెరన్, జాకోబి' వ్రాతలబట్టి చెప్పవచ్చునని,

---

[59] H. Kern - Manual of Indian Buddhism P. 122.

[60] Sir Charles Eliot - Hinduism and Buddhism Vol. I - P. XXXII-

ఈయనకు మహాయాన మతమువలన పేరుగల్గెనని, ఉత్తర హిందూస్థానములో నీయనను బుద్ధుడందురని, జి. కె. నారాయణ వ్రాసెను.[61] రాజతరంగిణి కర్త 'కల్హణుని,' వ్రాతల ప్రకారము నాగార్జునుడు కనిష్కుని సమకాలీనుడు అని తెలియుచున్నది.[62] ఈయన అనంతరము వచ్చిన 'అభిమన్యుని' సమకాలీనుడని యొకచోట నుండుటచేత, కనిష్కుడు క్రీ. శ. 151 వరకు రాజ్యమేలుటచేత తరువాత 'అభిమన్యుడు' వచ్చినచో, క్రీ. శ. 2వ శతాబ్దాంతములో నాగార్జునుడు వున్నట్లు చెప్పవచ్చును.

ప్రధానగురుపరంపరలో, అశ్వఘోషునితర్వాత ఈయన పేరుండుటచేత, ప్రాయశః నాగార్జునుడు అశ్వఘోషుని శిష్యుడై యుండవచ్చునని, 'నాగార్జునుడు' లామాల అనుశ్రుతిప్రకారము, కనిష్కునిసభలో చాల ముఖ్యమైన పాత్రయని, సభలో నీయన పాల్గొనెనని చెప్పుదురుగాని, అది విశ్వాసార్హము గాదని, ఆకాలమునాటికి ఆయనపుట్టుకయే అనుమానాస్పదముగా నున్నదని, క్రీ. శ. 2వ శతాబ్దములో నివాడని, విదర్భవాసియని, (బీరారు) నాలందా భిక్షువని, బుద్ధగయలోని బ్రహ్మాండమైన 'గంధోలదేవళము'కు చుట్టును బయటప్రాకారము గట్టించెనని, లామాలు చెప్పుకొందురని, కాని ఈదేవాలయ ప్రాకారము అంతకుపూర్వమే కట్టించబడినదని

---

[61] G. K. Narayana – Literary history of Sanskrit Buddhism P 92 and 93.

[62] A. Weber–Indian Wisdom P. 287 (1914)

'వాడెల్' పండితుడు వ్రాసెను.[63] నాగార్జునుడు క్రీ. శ. 160–194 ప్రాంతపువాడని, మహాయాన శాస్త్రములు రచించెనని, వీనిని చైనీయభాషలోనికి మార్చలేదని, టి. రిచర్డు వ్రాసెను.[64] నాగార్జునుడు బ్రాహ్మణుడని, క్రీ. శ. రెండవ శతాబ్దములోనివాడని, దక్షిణహిందూస్థాన వాసియని, జపానీయ లేఖకుల వ్రాతలనుబట్టి ఈయనకు కనిష్క-సభతో నెట్టి సంబంధము లేదని తెలియుచున్నదని, 'ఆర్థర్ లాయడ్' అను విఖ్యాతలేఖకుడు వ్రాసెను.[65] ఈయన మహాయాన ప్రచారకుడని, బ్రాహ్మణుడని, దక్షిణదేశ వాసియని, క్రీ. శ. 2వ శతాబ్దములో నివసించెనని, తెలియుచున్నదని 'కోట్సు' వ్రాసెను.[66]

'కుమారజీవుని' వ్రాతలప్రకారము నాగార్జునుడు క్రీ. శ. 113-213 వరకు, ఆర్యదేవుడు క్రీ.శ. 163–263 వరకు, కుమారలత శిష్యుడు 'హరివర్మ' క్రీ.శ. 260 లేక క్రీ.శ.270 ప్రాంతమున నున్నట్లు తెలియుచున్నదని 'వింటర్నిట్జ్' వ్రాసెను.[67] ఇంకను

[63] L. A. Waddell- Buddhism of Tibet P. 10.

[64] T. Richard-The new testament of higher Buddhism P 105 and 107. (1910).

[65] Arthur Lloyd-The creed of Half Japan. P.105.

[66] H. H. Coates — Honen—The Buddhist Saint. P. 209.

[67] M. Winternitz — History of Indian literature Vol. II P. 348.

'బోధిసత్వ నాగార్జునుడు' 'హుష్క, జుష్క, కనిష్క' రాజుల కాలములో కాశ్మీరములో విఖ్యాతుడై యుండెనని[68] ఈయన ననుగూర్చి ఇంకనుల్లేఖించుచు 'క్రీ.శ. 166–196' వరకు పాలించిన 'గౌతమీపుత్ర యజ్ఞశ్రీ' రాజ్యకాలములోనికి 'నాగార్జునుడు' వచ్చునని,[69] ఇంకను క్రీ.శ.1వ శతాబ్దములోని 'సద్ధర్మ పుండరీకము' ను 'నాగార్జునుడు' పేర్కొని యుండుటచేత, ఈయన ప్రాయశః క్రీ.శ.2వ శతాబ్దములోనే జీవించియుండెనని పై లేఖకుడు వ్రాసెను.[70]

పైన పేర్కొన్న ముగ్గురు తుష్కస్థాన రాజులు మూడు పట్టణములు వారిపేరున నిర్మించిరని, పవిత్రకార్యముల జేసినారని, కాశ్మీరదేశ చరిత్రము తెల్పుచున్నది. వీరు బహుశః 'హువిష్క, వశిష్క, రెండవకనిష్కలు' కావచ్చును.[71]

'నాగార్జునుడు' యోగిక్రియలచే సిద్ధిపొందెనని రసాయన సిద్ధులు పొందినవాడని ప్రస్తుతము లభించు 'సుశ్రుతసంహిత' నాగార్జున కృత వృద్ధ సుశ్రుతముయొక్క పునఃసంస్కరణమని 'మహాయాన దార్శనిక నాగార్జునుడు, సిద్ధనాగార్జునుడు' ఒకటియేనని, ఈయన సిద్ధిశాస్త్రము, జననశాస్త్ర విషయిక, అమూల్య గుహ్యజ్ఞానముయొక్క భండారమై యుండెనని, ఈయన క్రీ.శ. 150లోని వాడని, 'జయచంద్ర విద్యాలంకారు'

---

[68] Ibid—P 303.
[69] Ibid—P 348.
[70] Ibid—P 303.
[71] H. R. Rai Choudary—Political history of Ancient India—P. 317.

అను భారతీయవిద్వాంసుడు తన "ఇతిహాసప్రవేశ, భారతదేశకే అమరరత్న" అను గ్రంథములలో వ్రాసెను. ఇంకను 'ఇతిహాసప్రవేశ'లో అశ్వఘోషుని ఉత్తరాధికారి తర్వాత ఉత్తరాధికారి యగుటచేత, 'అశ్వఘోషుడు' కనిష్క సమకాలీనుడగుటచేత నీయన క్రీ. శ. 150లోని వాడని, అశ్వఘోషుని ప్రశిష్యుడని 'లోహశాస్త్రము' కూడ రచించెనని, పాదరస యోగమును జేయు విధిని బయటపెట్టి రసాయనజ్ఞానమును వృద్ధిజేసెనని, సుశ్రుతగ్రంథమును సంపాదించెనని, వ్రాసెను. మిగత వెట్లున్నను, 'దార్శనిక నాగార్జునుడు సిద్ధనాగార్జునుడు' ఒకటియేనని వ్రాయుట గొప్పపొరపాటే యగుచున్నది.

'నాగార్జునుడు'[72] సుశ్రుతమును సంస్కరించెనని చెప్పబడుచున్నది. కాని ఏనాగార్జునుడో వివరించలేదు. 'నాగార్జునుడు' మహాయాన సిద్ధాంతముల నొకపద్ధతిలోనికి కూర్చెనని, ఈయన బ్రాహ్మణుడని, క్రీ. శ. 200 ప్రాంతపువాడని, 'మాక్డనాలు' వ్రాసెను.[73]

'మినానాండరు' అను 'బాక్ట్రియా గ్రీకురాజు', పశ్చిమ భారతవర్షమునంతయు 'గంగానది' వరకు జయించెనని, ఈయన బౌద్ధయతి, దార్శనికుడు, తత్వవేత్తయగు 'నాగార్జునుని'తో మత విషయిక చర్చలు జరిపెనని, బౌద్ధగ్రంథములనుబట్టి తెలియగ వచ్చునని, ఈయన క్రీ పూ. 150లోని వాడని, దత్తుపండితుడు వ్రాసెను.[74] కాని ఈయూహా తప్పనుటలో సందియములేదు.

---

[72] A. A. Macdonall-India's Past, P. 177(1927)
[73] Ibid. P. 64.
[74] R. C. Dutt-Ancient India P. 119.

'మినాండరు' క్రీ. పూ. 150 నాటివాడు; గంగానదివరకు విజయయాత్ర సల్పిన ఈయవనభూపతితో మతవిషయక చర్చలు జరిపినది 'నాగసేనుడు'కాని, నాగార్జునున బోధి సత్త్వుడు కాదని, 'మిలిందపన్హా' యను పాళిగ్రంథమునుబట్టి తెలియంగవచ్చును. 'నాగసేనుడు' భిక్షాపాత్రల, బుద్ధునివస్త్ర ముల, బుద్ధవిగ్రహముల బూజించుట మున్నగువానిని దీవ్ర ముగా నాక్షేపించెను. అప్పటికి బుద్ధవిగ్రహపూజ యారంభించి యుండవచ్చును. క్రీ. పూ. 50వ సంవత్సర ప్రాంతమునాటి బౌద్ధగ్రంథములు విగ్రహారాధన నంగీకరించినట్లు తెలియు చున్నది. 'నాగార్జున బోధిసత్త్వుని కాలములో 'మినాండరు' అను యవనభూపతి యుండుటను గాన్పించదు. మహాయాన శాఖలో విగ్రహారాధనకు ప్రాధాన్యతగలదు. ఈకారణముల చేత 'దత్తు'గారి యూహ సరికాదు.

దత్తుగారి వ్రాతలజూచియే కాబోలు, 1926 సెప్టెంబరు భారతిలో, 'ఆంధ్ర శేషగిరిరావుపంతులుగారు' ఆంధ్రసామ్రాజ్య మును గూర్చి వ్రాయుచు, 'నాగార్జునుడు' 'యజ్ఞశ్రీ' కాల మున జీవించియుండెనని, ఆంధ్రచరిత్రకారునియభిప్రాయమనియు క్రీ.పూ. 150లో గంగానదిపర్యంతము విజయయాత్రసల్పిన గ్రీకు 'మినాండరు'తో మతవిషయమై, ఈ సిద్ధనాగార్జునుడు చర్చిం చియుండెనని, ఒకపాళీగ్రంథము సాయమున 'రమేశచంద్రదత్తు' నిర్ణయించుటచేత, ఆంధ్రచరిత్రకారుని వ్రాత సరికాదనవలయు నని వ్రాసెను. వీరిచ్చిన 'యజ్ఞశ్రీ శాతకర్ణి' కాలము క్రీ. శ. 184-213; కీ. శే. లక్ష్మణరావు గారుకూడ 'హిందూమహా

యుగము'లో నీకాలమునే యిచ్చిరి. ఆధునిక పరిశోధనలను బట్టి వీరిచ్చిన కాలము సరికాదు. 'మీనాండరు'తో వాదన చేసినది 'నాగసేనుడు' కాని, 'నాగార్జునుడు' కాదు. ఈ'నాగార్జునునికి' 'సిద్ధనాగార్జునుడను' పేరులేదు. అందుచేత 'దత్తు'గారి వాదనలవలె, శేషగిరిరావుగారి వాదనకూడ సరిలేదు.

'అల్బరూని' (క్రీ. శ. 1030) రసాయనిక విద్యనుగూర్చి తెల్పుచు ఈవిద్యలో ప్రఖ్యాతిగాంచినవాడు నాగార్జునుడని, ఈయన సోమనాథదగ్గర 'దైహక' దుర్గవాసియని, దానిలో నాయన ప్రవీణుడని, ఈవిషయముపై ఆయన సారాంశముతో కూడిన గ్రంథమొందు వ్రాసెనని, అట్టిగ్రంథ మరుదుగా లభించునని మాకు పూర్వము శతాబ్దముక్రిత మాయన జీవించి యుండెనని వ్రాసెను.[75] అల్బరూని క్రీ.శ. 1030లో 'గజినీ ముహమ్మదు'తో బాటు భారతభూమికి వచ్చెను. ఒకశతాబ్దము పూర్వమనగా క్రీ.శ. 930లో 'నాగార్జునుడు' ఉండెనని భావము. కాని యాకాలమున 'నాగార్జునుడు' గాన్పించడు. రస, రసాయనవేత్తయగు నాగార్జునుని, 'హుఎనుత్సాంగు' పేర్కొనెను. అతని వ్రాతలనుబట్టి క్రీ.పూ.100లో నాగార్జును డుండెనని, 526ఏండ్లు జీవించెనని తెలియుచున్నది. కాని ఇది చారిత్రిక సత్యము కాజాలదు. క్రీ.శ. 7వ శతాబ్దములోని 'హర్షచరిత్ర కర్త బాణకవి' ఒక్కనాగార్జుననే పేర్కొనెను. అప్పటికి 'సిద్ధనాగార్జునుడు' ప్రఖ్యాతిగాంచలేదేమో! 12వ శతాబ్దములోని రాజతరంగిణికర్త 'కల్హణుడు' ఒకేనాగార్జునుని

[75] Dr. Edward C. Sachua — Alberuni's India—Chap. XVII—P 189.

పేర్కొనెను. 'అల్బరూని' వర్ణించిన నాగార్జునుడు క్రీ.శ. 7వ శతాబ్దములోని 'సిద్ధనాగార్జునుడేమోనని' యూహ కల్గుచున్నది. రసరత్నాకరకర్త 'నాగార్జునుడు' రసశాస్త్రవేత్త యగుచున్నాడు; పి. సి. రే, క్రీ. శ. 7 లేక 8వ శతాబ్దములో నాగార్జును డుండెనని వ్రాసెను.

'సతీశచంద్ర విద్యాభూషణుని' అభిప్రాయప్రకారము నాగార్జునుడు క్రీ.పూ. 33లో జీవించియుండెనని తెలియుచున్నది. కాని దీనికి తగుప్రమాణములు లభించవు. 'కనిష్కమహారాజు' సమకాలీనుడని కొందరు, కనిష్కుని నాల్గవ బౌద్ధసభ కేగెనని కొందరు వ్రాసిరి. సభాకాలమున జన్మించిన ప్రమాణములు గలవుకాని, సభకేగిన ఆధారములు లేవు. వి. ఏ. స్మిత్ అను చరిత్రకారుని అభిప్రాయప్రకారము 'నాగార్జునుడు' కొంతవరకు 'కనిష్కుని' సమకాలీనుడనియే తెలియుచున్నది.[76] క్రీ. శ. 162సంవత్సర ప్రాంతమున 'నాగార్జునుడు' జీవించియుండెనని, స్మిత్ అభిప్రాయమై యున్నది.

'యజ్ఞశ్రీ శాతకర్ణి' కాలమున నాగార్జునుడుండెనని, ఆంధ్ర చరిత్ర చరితానసుని యభిప్రాయమైయున్నది. ఈ 'శాతకర్ణి' క్రీ. శ. 184-213 వరకు 29 సండ్లు రాజ్యమేలెను, చీనా దేశ చరిత్రకారు లీయనను 'యజ్ఞాయ్' అని పేర్కొందురని క్రీ. శ. 204వ సంవత్సర ప్రాంతమున నీరాజు, చీనాతో రాయబారము నడపెనని, 'వి. ఏ. స్మిత్' వ్రాతలబట్టి ఈరాజు వాణిజ్యవ్యాపారాదులు సముద్రముపై జరిపినట్లు తెలియు

---

76 V. A. Smith—Oxford History of India

చున్నది.[77] 'గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి' మిగుల బల పరాక్రమములు గలవాడు. క్రీ. శ. 166-196 వరకో లేక కొంచెము ముందో, 'యజ్ఞశ్రీ' రాజ్యమేలెనని 'స్మిత్' వ్రాసెను; క్రీ. శ. 173-202 అని యొకచోట వ్రాసి, 7 లేక 8 ఏండ్లు ముందే అయియుండవచ్చునని కూడ స్మిత్ వ్రాసెను.[78] ఈ 'యజ్ఞ శ్రీ శాతకర్ణి' కాలమున 'నాగార్జునాచార్యు' డుండెనని, క్రీ. శ. 134-200 మధ్యకాలములో నీయతి జీవించెనని కీ. శే. వీరభద్రరావుగారు వ్రాసిరి. 'వింటర్‌నిట్జ్' పండితుడు 'యజ్ఞశ్రీ శాతకర్ణి' కాలమే సరియనెను. కీ. శే. లక్ష్మణరావుగారు 'నాగార్జునునికాలము క్రీ. శ. 137-194 అని హిందూమహా యుగములో వ్రాసిరి. వీరభద్రరావుగారిచ్చిన జననసంవత్సరము, లక్ష్మణరావుగారిచ్చిన మరణసంవత్సరము సరిగానే యున్నవి.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రిందట నొక భారతిలో వ్రాయుచు, క్రీ. పూ. 1 వ శతాబ్దములోగాని, క్రీ శ. 1 వ శతాబ్దములోగాని, 'నాగార్జునుడు' ఉండవచ్చునని 'లంకావతారము, అను గ్రంథమునుబట్టి చెప్పవచ్చుననిరి. కాని ఇది కేవలము నిరాధారముగా నున్నది. పండిత జవహరిలాలు నెహ్రూ మహాయాన దార్శనికుడగు 'నాగార్జునుడు' క్రీ. శ. 1వ శతాబ్దములో నుండెనని తన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథ

77 చి. వీరభద్రరావు-ఆంధ్ర దేశకథాసంగ్రహము. ౧ సం-పుట 152, 153, 154.

78 V. A. Smith- oxford History of India P. 134

ములో వ్రాసియుండెను. తానట్లు చెప్పుటకు గల కారణముల సూచించరైరి.

'టిబ్బతీభాష'లో 'డబ్లుయు. యల్. కాంప్ బెల్, 'శేఖదవ్' (సంస్కృతములో ప్రజ్ఞాదండము) అను గ్రంథమును సంపాదించి, దానిభూమికలో, 'నాగార్జునుడు' క్రీ. శ. 100లో జీవించియుండెనని వ్రాసెను; కాని ఆధారములు చూపరైరి.

టర్కి-రాజుల అనంతరము అనగా క్రీ. శ. 150 లోనో లేక రెండవశతాబ్ద మధ్యముననో, అంతముననో నాగార్జునుడున్నటు నమ్మబడుచున్నదని, ఈయనకాలము క్రీ.శ. 200 అని, 'కనిష్క-సభాకాలమున' నీయన జననమని, శ్రీనివాసాచారి రామస్వామిఅయ్యంగార్లు వ్రాసిరి.[79] ఎ. కుమారస్వామి, ఈయన బ్రాహ్మణుడని; క్రీ. శ. 2వ శతాబ్దములోనివాడని వ్రాసెను[79a]

వీరిట్లు ఇట్లువ్రాసెను. "అలాగుననే త్రిపిష్టవవాసులు, నాగార్జునుని -రాజతరంగిణి ప్రకారము- కనిష్కుని సమకాలీనుని జేయుదురు. ఈకనిష్కుడు బుద్ధునితర్వాత 400 సంవత్సరముల కుండెను. దక్షిణదేశ బౌద్ధులు, 500 ఏండ్లు తర్వాత జీవించెనని యందురు. ఉత్తరదేశ బౌద్ధులు దక్షిణదేశ బౌద్ధులకంటె ఈవిషయములో ప్రామాణికులుగా గాన్పించుచున్నారు.

[79] C. S. Srinivasachari and M. S. Ramaswamy Ayyangar-A History of India—part I P 115 (1944)

[79] (a) A. Coomaraswamy—Buddha and the Gospel of Buddhism. P. 243.

నాగార్జునుని కాలనిర్ణయముకూడ సరిగానే యున్నది.” [80] బుద్ధునితర్వాత 570 ఏండ్లు కాదని 400 ఏండ్లు అయిఉండవలెనని అది 'కనిష్కుని' సభాకాలమని, అప్పటివాడే నాగార్జునుడని వీరు 'రాజతరంగిణి' ప్రకారము 'నాగార్జునుడు' 'కనిష్క' సమకాలీనుడని తెలియుచున్నదని అభిప్రాయపడెనుగాని ఇది తప్పుగా నున్నది.

'కాశ్మీర రాజచరిత్ర' యగు 'రాజతరంగిణి'లో 'కల్హణుడు' ప్రాచీనకాలములో 'నాగార్జునుడు' బుద్ధభగవానుని నిర్వాణ మైన తర్వాత 250 ఏండ్ల కుండెనని, ఆయన సమయములో బౌద్ధధర్మము ప్రబలిపోయెనని, ఆయన షడహద వనములో జీవించెనని, మహాయాన సాంప్రదాయమునకు జెందియుండెనని వ్రాసియుండెను; కాని 'బుద్ధదేవుడు' క్రీ. పూ. 477లో జని పోయెనని ఆధునికపరిశోధనలు నిర్ణయించుచున్నవి. ఈయన తర్వాత 250 ఏండ్ల కనగా, క్రీ. పూ. 227 ప్రాంత మగుచున్నది. అప్పటికి 'నాగసేనుడు'కూడ కాన్పించడు; కాన 'కల్హణుని' వ్రాత తప్పని చెప్పవచ్చును.

వాటర్సు ఇట్లువ్రాసెను. “లంకావతార సూత్రములోని ఆఖరుశ్లోకములలో నాగార్జునుని భవిష్యత్తులోని చర్య ముందుగా వర్ణించబడినది. 'కుమారజీవుని' చేతనే అతని జీవితచరిత్ర వ్రాయబడినదని, మనము తలంచినచో (న్యాయముగాదాని అనువాదకుడు) క్రీ. శ. 3వ శతాబ్దములో ఆయన జీవించియుండెనని, రాజులగు 'కనిష్క, కిలిక' పేర్లు

---

[80] A. Weber-Indian Wisdom P 287.

వసుమిత్ర, అశ్వఘోష పేర్లు, కాత్యాయనపుత్ర, ధర్మగుప్త, రాహులభద్ర, యనువారిపేర్లు నాగార్జునునివని చెప్పబడు గ్రంథములలో గాన్పించుచున్నవని, అందుచేత మనము 'నాగార్జునుని' మూడవ శతాబ్దములోనివాడని ధ్రువపర్చ వచ్చునని, చైనీయభాషలో నాగార్జున లిఖితములు 20 గ్రంథములు లున్నవని తెలియుచున్నది[81] అని చెప్పెను. కాని వాటర్సు సిద్ధనాగార్జునునిగూర్చి తెలియంగడాయెను.

కొందరు చరిత్రకారులు 'నాగార్జునుడు' క్రీ. శ. 135-163 మధ్య రాజ్యమేలిన 'వశిష్టపుత్ర శ్రీపులమావి' కాలమున నుండెనని వ్రాసిరికాని, ఈయనకాలముననే నాగార్జునయతి జన్మించి యుండెనని చెప్పవచ్చును; కాని నాగార్జునయతికి సంఘారామము నిర్మించిన బౌద్ధరాజు ఈయనయే యనుట కాధారములు లభించకున్నవి.

క్రీ. శ. 2వ శతాబ్దములో దక్షిణభారతములో ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు 'నాగార్జునుని' జన్మఆయెనని, బుద్ధోపదిష్ట త్రిలక్షణము, ప్రతీత్య సముత్పాద సిద్ధాంతముల ఆధారము మీద ఒక అత్యంత గంభీరదర్శనము నీయన వ్రాసెనని, 'భిక్షు జగదీశ కాశ్యపులు' 'బౌద్ధదర్శనము' లో వ్రాసియుండెను.

'గౌతమీపుత్ర సిరియానశాతకర్ణి' 29 యేండ్లు రాజ్యపాలన చేసెనని కె. గోపాలాచారి అను చరిత్రకారుడు వ్రాసియుండెను. హర్షచరిత్రములో బాణుడు, యతియగు నాగార్జునుని పేరొ-

[81] T. Watters—on Yuan Chwang's Travels Vol II—P. 204.

నెనని, ఈయనను 'నాగ' యనువాడు నరకమునకు దీసికొని పోయెనని,అచట నాగరాజును బహుమతిగా ముత్యాలహారము నిమ్మని కోరెనని, దానినివ్వగా గైకొనెనని, నరకమునుండి బయటకు వచ్చినపిమ్మట, అతనిమిత్రుడైన 'శాతవాహనునికి' ఇచ్చివేసెనని, ఈరాజు మూడుసముద్రముల కధిపతియని, కోవెల్ (Cowell) థోమస్ (Thomas) వ్రాతల ప్రకారము, ఈరాజు ఇంటు,ప్లక్ష,సామలనేతెనని తెలియుచున్నది. 'వాటర్సు' కూడ దీని నుదాహరించెను. దక్షిణకోసల ముఖ్యనగరము నైరుతిమూల 300 లీల దూరములో నుండెను. 'సిరియానుని' కాలములోనే నాగార్జునుడు ఉండుటచేతను, ఈయనయే శాత వాహనరాజ్యములో తూర్పు, పశ్చిమ దక్కను నేలిన ఆఖరు గొప్పరాజగుటచేత, 'ఈశాతవాహనుడే' పూసనాగార్జునునికి సమకాలీనుడు కావచ్చునని, మాధవీపుత్ర శకసేనునికి కూడ వర్తించునని, పైచరిత్రకారుడు వ్రాసియుండెను గాని,[82] ఈ యూహాలు సరియనుట కాధారములు లభించవు.

'కె. ఆర్. సుబ్రహ్మణ్యన్' తన ఆంధ్రచరిత్రములో నాగార్జునుని గూర్చి యుల్లేఖించుచు నాగార్జునుడు రెండవశతాబ్దము లోని వాడని అనేకవాదనలచే చెప్పవచ్చునని 3వ శతాబ్దములోగూడ నాగార్జునుడు 10 ఏండ్లో, 20 ఏండ్లోజీవించియుండ

---

[82] K. Gopalachary-The Early History of the Andhra Country P. 70.

వచ్చునని అభిప్రాయమొసంగిరి.[83] కాని ఈ అభిప్రాయముతో మేము ఏకీభవింపజాలము.

టిబెటీయ చరిత్రకారుడు 'తారానాథుడు' క్రీ. శ. 180-220 లకు నడుమ 'నాగార్జునుడు' ఉన్నవాడని కాలనిర్ణయము చేయుచున్నవాడని, 'వీరభద్రరావుగారు' వ్రాసిరి.[84] ఈ 'లామాతారానాథుడు' క్రీ.శ. 1573లో జన్మించి, 'జోనాంగ్' సంఘారామములో జదివి, 'మంగోలియా'లో జనిపోయినట్లు 'అష్టిన్‌వాడెల్' (Austine Waddell) వ్రాతలబట్టి తెలిసి కొనవచ్చును.

'సుజుకి' (Suzuki) వ్రాతలనుబట్టి బుద్ధమరణానంతరము 800 ఏండ్ల తర్వాత నాగార్జునుడు దక్షిణహిందూస్థానములో నొక ఇనుపగోపురమును దెరచెనని, అచట 'బుద్ధుని' బోధల దెలిసికొనెనని, ఈమతమును 'నాగబోధి(Ryuchi)కి జెప్పెనని ఆయనహిందూదేశములో బ్రచారముచేసెనని, ఆయనశిష్యులు చైనాకు గైకొనిపోయిరని, వారిపేర్లు 'శుభకరసింహుడు' వజ్ర బోధి, యని, తరువాత క్రమముగా 'అమోఘవజ్రునికి' కైకాన్'కు, శుభకరసింహునివలన దెలిసెనని, కైకాన్' దీనిని గొప్పభిక్షువగు 'బుద్ధినహైందునికి', 'కోబోదైక్షి' యోగికి

[83] K. R. Subrahmanian M. A. -Buddhist Remains in Andhra and Andhra History P-59. "Various arguments may be put forward to fix the age of Nagarjuna in the second century A. D. Perhaps he lived on for a decade or two in the third century also.

[84] చిలుకూరి వీరభద్రరావు-ఆంధ్రులచరిత్ర, 1వ భాగము పుట154.

బోధించెనని, ఆయన, 'చైనాలో' దీనిని నేర్చెనని, ఈగురువుల నందరిని, అష్టమహాగురువులని పిలుతురని, జపానీయలేఖకులు వ్రాసిరి." [85]

ఈ వ్రాతప్రకారము బుద్ధదేవుని మరణము క్రీ. పూ. 477 లో జరుగుటచేత, 800 ఏండ్లు కనగా, క్రీ. శ. 323 అగుచున్నది. ఈసంవత్సరమునాటికి నాగార్జునుడుగాని, ఆయన శిష్యులుగాని లేరు; కాన ఇది తప్పని రూఢిగా చెప్పవచ్చును.

ఈయనకాలము బుద్ధమరణాంతరము 700 ఏండ్లకని (మహామాయిూఛింగ్ 2 అధ్యా. 382) 500 ఏండ్లకని (Ind. Lit. P 287, Tar. 303) 400 ఏండ్లకని ( Schlagintweit-Buddhism in Tibet P. 30) క్రీ. పూ. 212 లో చనిపోయెనని క్రీ.పూ. 482 లో జననమని, కనిష్కసమకాలీనుడని లేక తరువాతవాడోనని కొందరి అభిప్రాయము. (Watters-P 204)

# IV

## నాగార్జున కాలనిర్ణయము-సత్యాన్వేషణ

ఇంతవరకు వివిధపరిశోధకుల అభిప్రాయములను వివరించడమైనది. నాగార్జునుని కాలమునుగూర్చి పలుసందేహములు గలవని 'కెరన్' వ్రాసెను. నాగార్జున బోధిసత్వుని కాలనిర్ణయమును నేనీ క్రిందివిధముగా జేయుచున్నాను.

---

[85] Beatrice Lane Suzuki—Koyasan. P. 25

1 బౌద్ధ దార్శనిక నాగార్జున జీవితచరిత్రము, దేవ, అశ్వ ఘోషుల' జీవితచరిత్రలు, 'చీనాభాష'లోనికి 'కుమారజీవుడు క్రీ. శ. 405లో సంపాదించి అనువాదముచేసి యుండెను. ఈ లేఖకుడు క్రీ. శ. 4వ శతాబ్దములోనివాడు. క్రీ. శ. 383లో భారతభూమినివీడి 'చీనా'కు పోయెను. క్రీ. శ. 405-411లో భారతదేశములో బర్యటనముసల్పిన 'ఫాహియాను' ఈయన శిష్యుడే. ఇంకను నాగార్జున రచితమగు ప్రజ్ఞాపరిమిత సూత్ర శాస్త్రము దశభూమి విభాషశాస్త్రము, క్రీ. శ. 405 లో 'కుమారజీవుడు' చైనీయభాషలోనికి మార్చెను. [86] ఈయతి 'సుహృల్లేఖ'ను 'గుణవర్మ' క్రీ. శ. 431లోను, 'సంఘవర్మ' క్రీ.శ. 434లోను, 'ఇత్సింగు' క్రీ. శ. 673లోను 'చైనీయభాష' లోనికి మార్చియుండిరి. ఈ'సుహృల్లేఖ'లో 'టిబెటీయ' అనువాదములో 123, చైనీయ అనువాదములో 153 శ్లోకములు గలవు. 'కుమారజీవుడు' 'మహాప్రజ్ఞ పరిమితసూత్ర వ్యాఖ్య శాస్త్రము'ను (నం 1169) చైనీయభాషలోనికి క్రీ. శ. 405 లోను[87] 'ద్వాదశనికాయశాస్త్రము' ను క్రీ. శ. 408లోను, 'సుఖావతివ్యూహము'ను క్రీ. శ. 402లోను అనువదించి యుండెను. కొన్ని నాగార్జున రచితగ్రంథములను క్రీ. శ. 401లో మార్చినని తెలియవచ్చుచున్నది. కనుక క్రీ. శ. 4వ శతాబ్దమునకు పూర్వమే నాగార్జునుడు జీవించియుండుట నిశ్చితము.

---

[86] M. Winternitz - History of Indian Literature-Vol. II- P. 405 and P. 343.

[87] T. Watters—On Yuan Chwang's travels Vol. II—P 204.

2 'సద్ధర్మపుండరీకము' అను గ్రంథము క్రీ. శ. 1వ శతాబ్దములో రచింపబడినది. దీనిని 'నాగార్జునుడు' పేర్కొనెను. ఈ గ్రంథమునకు 'చైనీయభాష'లో మొదటిఅనువాదము క్రీ.శ. 223లో జేసిరి. 'ధర్మరక్షు' క్రీ. శ. 286లోను, కుమారజీవుడు క్రీ. శ. 400లోను, జ్ఞానగుప్త, ధర్మగుప్త యనువారు క్రీ. శ. 601లోను అనువదించియుండిరి. "కుమారజీవుడు క్రీ.శ. 406లో జేసెనని, ఇది సర్వోత్తమమైనదని, 'జినగుప్త' (జ్ఞానగుప్తకు బదులు) క్రీ.శ 601లో జేసెనని" 'సుజుకి' వ్రాసెను. [88] సద్ధర్మ పుండరీకము'ను బేర్కొన్న 'నాగార్జునుడు' క్రీ. శ. 1వ శతాబ్దమునకు బూర్వుడు కాజాలడు. ఇంకను "బుద్ధవతంశక (అవతంశకసూత్రము) మహావైపుల్యసూత్రములకు 'నాగార్జునుడు' కర్త. వీని అనువాదము 'ఫాలింగు' క్రీ. శ. 4వ శతాబ్దారంభమున చైనీయభాషలోనికి చేసియుండెను. అందుచే నాగార్జునుడంతకు పూర్వుడనుట నిక్కము. ఈమూలగ్రంథము పోయినను మూడు అనువాదములు నేటికి కాన్పించుచున్నవి. [89] ఇంకను 'చైనీయ సాహిత్యచరిత్రము'లో 'గైల్సు' అతని 'ప్రజ్ఞామూల శాస్త్రము' చైనీయభాషలోనికి 'సూకాన్' (Hsu-Kan) క్రీ. శ. 196–221మధ్య కాలములో ననువాదము చేసెనని చెప్పుటచేత, [90] నాగార్జునుడు క్రీ. శ. 221 కి పరుడుగాదని నిశ్చయముగా జెప్పవచ్చును.

---

[88] B. L. Suzuki–Mahayana Buddhism P. 108.

[89] Karl Ludvig Reichelt—Truth and tradition in Chinese Buddhism. P. 197.

[90] Giles – History of Chinese Literature P. (119-120)

3 'నాగార్జునుడు' మహాయాన స్థాపకుడు కాదు. అంతకు పూర్వమే 'మహాయానసూత్రములు' గలవు. క్రీ. పూ. 1 వ శతాబ్దమునుండి ఈ బీజములు బౌద్ధమతములో వ్యాప్తిచెంది యున్నవి. క్రీ. శ. 3 వ శతాబ్దమునాటికి వ్యాప్తియగాయెను; ఈమధ్యకాలములోనే నాగార్జునుడు జీవించియుండుట నిక్కువము. యోగశాస్త్రమును 'మహాయానమతము'లో జేర్చిన 'అసంగుడు' ఈయన సోదరుడు 'వసుబంధుడు' క్రీ.శ. 4వ శతాబ్దములోనివారు. వీరిరువు రింకను దీనినివ్యాప్తిచేసిరి. ఆకాలమున కెంతయో పూర్వమున నాగార్జునయతి జీవించియుండెను. పైన తెల్పిన 'వసుబంధుడు' క్రీ. శ. 330 ప్రాంతమున 'సముద్రగుప్తుని' సమకాలీనుడై యుండెను. ఈయనకుమారుడు నాగార్జునునికి ఆరవతరము వాడగుటచేత, •1 క్రీ. శ. 200 సంవత్సర ప్రాంతమున నాగార్జునయతి ఉన్నట్లు చెప్పవచ్చును.

తారానాథుని వ్రాతలను బట్టి, 'అపరాంతరాజగు' 'నేమిచంద్రుడు' 'ఒకటవ చంద్రగుప్తునికి' మూడుతరములు ముందరనున్నవాడు, నాగార్జునుని' సమకాలీనుడని తెలియుటచేత, నాగార్జునుడు క్రీ. శ. 250 కి పూర్వుడనియే చెప్పవచ్చును. క్రీ. శ. 5వ శతాబ్దమునాటి జగ్గయ్యపేట స్థూపములోని శిలాశాసనములో, నాగార్జునుని శిష్యుడగు 'జయప్రభ' పేరు, ప్రశిష్యుని పేరు, కాన్పించుచున్నవి. నాగార్జునకొండపైన గల శిలాశాసనములు క్రీ. శ. 3వ శతాబ్దినాటివి. ఇందు భదంత,

---

•1 K. R. Subrahmanian M. A. - Andhra History. P. 59.

ఆనంద, ధర్మనంది, చంద్రముఖ, నాగ' మున్నగు బౌద్ధభిక్షువుల పేళ్లు గలవు. 'నాగార్జునునికి' ఆర్యదేవుడు, కాక 'నంద, నాగ' యను ఇరువురు శిష్యులు గలరని ఇత్సింగు వ్రాతలవలన తెలిసికొనవచ్చును.[92] కనుక క్రీ. శ. 3వ శతాబ్దికి పూర్వమే నాగార్జునయతి జీవించియుండుట నిక్కము.

4. కొంచెము హెచ్చుగానో, తక్కువగానో నాగార్జునుడు కనిష్కుని సమకాలీనుడని బహువిద్వాంసుల అభిప్రాయము. వైద్యవిద్వాంసులగు చరక, సుశ్రుతులు కనిష్కుని సమకాలీనులు. (క్రీ. శ. 125–153) రెండవ శతాబ్దములోనివారు. 84 గురు సిద్ధుల కథలనుబట్టి (Stories of 84 Magicians)సుశ్రుతముపై వ్రాయబడిన ఉత్తరతంత్రకర్తగా వైద్యలేఖకుడు నాగార్జునుడు పేర్కొనబడెను. కనుక వీరితర్వాతనే 'నాగార్జునుడు' జీవించియుండవలెను. కాని 84 గురు సిద్ధులలోని వాడు 'సిద్ధనాగార్జునుడు' అగుటచేత, సుశ్రుతమును సంస్కరించినవాడు క్రీ శ. 7వ శతాబ్దములోని 'సిద్ధనాగార్జునుడా' యని సందియము గల్గుచున్నది. దార్శనిక నాగార్జునుడనుట కాధారములు లేవు. కాన పైవిషయము కాలనిర్ణయమునకు తోడ్పడదు.

5. 'రసరత్నాకరము' 3వ అధ్యాయములో నాగార్జునునికి శాతవాహనరాజుకు జరిగిన సంభాషణ గలదు. ప్రజ్ఞాపరిమిత దేవత కనబడి ఆయునకు ఔషధయోగమును రససంబంధమగు

---

[92] K. R. Subrahmanian M. A.-Andhra History P. 59 and 60.

విద్యను జెప్పెను.[93] శాలివాహనునితో బాటు రత్నఘోషుని, మాండవ్యుని పేర్లుగలవు. క్రీ. పూ. 225 మొదలు క్రీ. శ. 225 వరకు పాలించిన ఆంధ్రశాతవాహనరాజులలో నొక శాతవాహనుని కాలములో 'నాగార్జునయతి' యుండుట నిక్కవము. 'ఇత్సింగు' అను చైనీయ లేఖకుని వ్రాతలబట్టి 'సుహృల్లేఖ' శాతవాహనునికి, యతి వ్రాసిన ఉత్తరమని, ఆ రాజు నాగార్జునునికి పోషకుడు (దానపతి) అని, ఆరాజుపేరు 'జింటక' లేక 'జేతకుడు' (Giintaka-Getaka) అని, దక్షిణహిందూస్థానములో గొప్ప దేశమున కీయన ప్రభువని ఈయనపేరు 'సో-తో-ఫో-హౌ-నా (So-to-pho-hau-na - Sadvahana or Satavahana) ఈయన రహస్యనామము 'జింతక' యని, శాతవాహనుడొక రాణివలలో దగుల్కొని ఆమె కుమారుడు 'సుశక్తి'కి సింహాసనమివ్వ ప్రయత్నించి తన ఆచార్యుడు 'నాగార్జునుడు' మరణమునొందినపట మరణించినాడని, ఇత్సింగు(Inching-Ch.) వ్రాతలనుబట్టి తెలియును. చైనీయ, టిబెటీయ అనువాదములలో రాజుపేరు 'సో-తో-ఫో-హౌ-నా' అనికలదు. 'తారానాథుడను' త్రిపిష్టప చరిత్రకారుని గ్రంథముల ప్రకారము రాజుపేరు 'ఉదయనుడు' (or Utrayana) అని తెలియును. ఆయన నింకను 'అంతివాహనుడ'ని కూడ పిల్తురు. (Antivahana) అనగా 'శాంతివాహనుడ'ని అర్థము. ఇంకను 'ఉదయనుని' బాలుడుగానున్నపుడు 'జేతక' యని పిల్చుచుండిరని తెలియుచున్నది. అతని బాల్యములోనే

---

93 M. Winternitz—History of Indian Literature. Vol II—P. 343.

నాగార్జును డీయనను గలసికొనెను. 'సో-తో-ఫో-హో-నా యను పదము 'శాతవాహనునికి' 'జీంతక' యనుపదము 'జేంతక' యనువానికి సమీపముగా నున్నవి. పాళీభాషలో శాతకర్ణి యనగా 'సాదకర్ణి'. (Sad Karni) మూలపదమును దెలియక, శబ్దవ్యుత్పత్తి శాస్త్రప్రకారము భ్రమపడి, మరియొక శబ్దము నిచ్చెను. 'శాతవాహన' యనగా 'శాలివాహన'కు పర్యాయపదము. ఈ 'శాలివాహనుడు' విక్రమాదిత్యుని వైరి యని ఇత్సింగు వ్రాసెను.[94]

అనేక వేలమంది బ్రాహ్మణులతో దక్షిణహిందూదేశరాజు శంకరు డోడిపోయెనని తారానాథుడు వ్రాసెను. శాతవాహను డనుటకుబదులు టిబెటీయ భాషలో 'శంకరుడని' వ్రాయుట తప్పుడు భాషాంతరీకరణమని కొందఱి యూహ. కాని యిందు సందేహము గలదు. 'తారాకుసు' ఈయనను శాతవాహను డనెను. (Satavaha - Sadvaha) ఇంకను ఈరాజు పేరు 'ఇంఛింగ్' ప్రకారము 'షియెంతక' (Shiyenta-ka- Shanteka-Santaka) 'శాంతక' అని తెలియుచున్నది. టిబెటీయ గ్రంథములలో 'శాంతివాహన,' (అంతివాహన) నాగార్జునునికి మిత్రుడుగాను, సమకాలీనుడుగా నుండెనని యున్నది. త్రిపిష్టవ వాసుల ప్రకారము ఈయనపేరు శంకర, లేక ఉదయన యని తెలియుచున్నది. (Utrayana) నాగార్జుని మిత్రునిపేరు 'జేతక' యని కూడ టిబెట్ దేశీయులు

---

94 Itsing—Tr. J. Takakusu— A record of the Buddhist Religion as practised in India and the Malaya Archipelago.

వ్రాసిరి. ఈయన క్రీ. శ. 1 వ శతాబ్దములోని వాఁడనిరి.[95] కాని ఈకాలము తప్పు. ఎట్లయినను 'సదవాహ' శాతవాహన, శాతవాహ, షిద్యేతక, జేతక, జివాతక, శాంతక, శాంతివాహన, అంతివాహన, శంకర, ఉదయన, ఉత్రాయన, యను పేర్లు నాగార్జునుని పోషకుడగు శాతవాహన రాజుకు జెందియున్నట్లు విద్వాంసుల ఊహ. కాని ఏశాతవాహనుఁడో తెలియదు.

హర్షచరిత్ర కర్త 'బాణుడు' కూడ శాతవాహనునికి నాగార్జునుడు బంధువని వ్రాసెను. ఇంకను నరకలోకములోని 'నాగరాజు'నుండి తెచ్చిన 'ముత్యాలహారమును (మందాకిని) నాగార్జునుడు తన మిత్రుడగు శాతవాహనుని కిచ్చినట్లు బాణుడు వ్రాయుటచేత ఒకశాతవాహనుని కాలములోనే యిది జరిగియుండుట నిక్కము. ఈ'మందాకిని' అన్నివిషముల పోగొట్టును. అది తాకినమాత్రమున అన్నిజీవుల బాధలు నివృత్తియగును. పైరాజు గొప్ప రాజ్యాధిపతి యని, మూడుసముద్రముల కధిపతి యగుటచేత తూర్పు, పశ్చిమ, దక్కనుభాగముల నేలిన చివర గొప్పరాజు 'యజ్ఞశ్రీశాతకర్ణి'రేకావచ్చును. ఇంత ప్రసిద్ధిగాంచిన రాజింకెవరును లేరు.[96]

---

[95] T. Waters -On Yuan Chwang's Travels in India - Vol II. P. 204

[96] Cowell and Thomas—Harsha Charitra P. 262. Also T. Watters—On Yuan Chwang's Travels—Vol II-P. 204.

ఏ శాతవాహన రాజు మిత్రుడో బాణుడు పేర్కొనలేదు. ఆంధ్రరాజు లెల్లరు శాతవాహనులే. బాణకవివ్రాతలు మనకు హెచ్చుగా సాయపడుట లేదు.

'హుయానుత్సాంగు', శాతవాహనుడు రాజని, పోషకుడని వ్రాసెను. దక్షిణకోసలలో, ఆంధ్రలో యోగికి సంఘారామములు నిర్మించుటచేత ఈ రెండుదేశములు ఆయన స్వాధీనములో నుండెననుటలో సందియము లేదు. 'ఇత్సింగు' శాతవాహన కుటుంబములోని 'శాంతకుడనెను.'

నాగార్జునుడు తన సుహృల్లేఖలో 'జంతక' లేక 'జేతక' లేక సింతు (హిందూదేశము) రాజుగ, 'సింధుకరాజని' శాతవాహనుడని పేర్కొనెను. ఒక శాతవాహన రాజనుట నిశ్చితము. వాయుపురాణములో ఆంధ్రరాజుల పట్టీలో 'సింధుక' పేరుగలదు. నాగార్జును డీయన సమకాలీనుడు. ఈ శాతవాహనుడు అందరికంటె శక్తివంతుడు; మధ్య, ఆంధ్రదేశములు పాలించెను. క్రీ. శ. 2వ శతాబ్దము తర్వాత అంతశక్తి గలవాడు కాన్పించడు.

ఆంధ్ర శాతవాహనరాజుల తర్వాత ఇక్ష్వాకు రాజులు వచ్చిరి. 'శాతవాహన' కు 'ఛాంతమూల' దగ్గరగా నున్నను, 'వశిష్ఠపుత్ర శాంతమూల'కు సంబంధము నిరూపించబడదు. అందుచేత నాగార్జునుడు మొదటి 'ఇక్ష్వాకురాజు'కు సమకాలీనుడు కాదు.

ఇంకను 'హుయ్యాలి' వ్రాతలనుబట్టి చూడగా, 'రాజా షద్వాహ' (శాతవాహనుడు) కాలమున నాగార్జునుడు ప్రవే

శించెనని, రాజుయొక్క భక్తి శ్రద్ధలను గాంచి, నాగార్జును డచటనే నిల్చిపోయెనని, ఆసమయమున నాగార్జున బోధి సత్వుడు చాల వృద్ధుడాయెనని, నాగార్జునుడు రసాయన శాస్త్ర మున కాచార్యుడని,రసాయన ప్రయోగములచేత వందలకొలది యేండ్ల వయస్సున్న యువకునికి సమానముగా నుండెనని, రాజా షద్వాహ చేత (ఇంఛింగ్)కూడ నాగార్జునుడు సిద్ధ గుళికల సేవన చేయించెనని, ఆయనకుకూడ అనేకవందల సంవత్సరములు ఆయుస్సు గలిగినదని, పుత్రపౌత్రులుకూడ అనేకులు గల్గిరని తెలియుచున్నది. యువరాజు ఎంతకాలమునకు సింహాసనము ఖాళీకాకుండుట గాంచి వ్యథపొందసాగెను. ఒకనాడు యువ రాజు తనజననితో నిట్లుచెప్పెను. తల్లీ! నేనుకూడ రాజగద్దియపై కెక్కు భాగ్య మెపుడు సంప్రాప్తమగును? అతనితల్లి యిట్లు చెప్పెను. మీరు చూచుచునేయున్నారు. మీతండ్రి అనేక వందల యేండ్లు వయసుగల్గి యున్నాడు. అనేకమంది పుత్ర పౌత్రులు గల్గి మరణించియున్నారు. ఎంతకాలము 'బోధిసత్వ నాగార్జునుడు' జీవించియుండునో, అంతకాలము నీవు సింహా సనముపై కూర్చుండు ఆశ లవమైన లేదు. అతనిరసాయనిక గుళి కల ప్రభావముచేత ఆయన చనిపోడు. రాజునుకూడ మరణించ నివ్వడు. నీకు రాజుకావలయునని కోర్కి-యున్నచో, బోధిసత్వ నాగార్జునుని చెంత కరుగుము; నీవాయనను యాచించుచో నీకొరకు అతని ప్రాణము నొసంగును."

రాజకుమారుడు తల్లి ఆదేశానుసారము బోధిసత్వ నాగా ర్జునుని చెంతకరిగెను. అపుడు సాయంకాలసమయ మాయెను.

నాగార్జునుని ఆశ్రమమునకు రాకుమారుడు వచ్చెను. ద్వార పాలుడు రాజకుమారుని రాకను గాంచి తొలగిపోయెను. రాకుమారుడు సరాసరి నాగార్జునుని చెంతకరిగెను. ఆసమయమున నాగార్జునుడు మంత్రము జపించుకొనుచు, కాలము గడపుచుండెను; రాకుమారునిగాంచి నాగార్జును డిట్లుచెప్పెను. సాయంకాల సమయమైనది. ఈసమయమున శ్రమణుల ఆశ్రమమునకు మీరిపుడు వచ్చుటకు కారణమేమి? ఇచ్చటికి వరుగెత్తుకొనివచ్చుటకు కతంబేమి?

రాజకుమారు డిట్లు ఉత్తర మొసంగెను. "ప్రాచీనకాలము నుండి బోధిసత్త్వుడు పరోపకారముతో జీవితమును ధార పోసెను. 'రాజగుచంద్రప్రభుడు' తన శిరస్సును బ్రాహ్మణులకు దానముచేసెను. 'మైత్రబలుడు' ఆకలిగొన్న యక్షునికి తన శరీరములోని రక్తము నొసంగెను. 'శిబి' ఆకలిగొన్న డేగకు తన శరీరములోని మాంసమును గోసియిచ్చెను. ప్రాచీనకాలము నుండి యిట్లే జరుగుచు వచ్చుచున్నది. నాప్రార్థన ఏమనగా "మీరు కృపయుంచి మీశిరసును నాకు దానముచేయవల యును. ఇదియే నాయాచన, ఇందుకొరకే నేను మీచెంతకు వచ్చినాను." నాగార్జును డిట్లుచెప్పెను. "ఇది సరిగా నున్నది. మనుజుని ప్రాణము నీటిబుగ్గకు సమానముగా నున్నది. కాని దీనిలో నొక బాధగలదు. నేను జీవించనిచో నీతండ్రికూడ జీవించడు. ఇదిచెప్పి 'నాగార్జునుడు' రెల్లుపుల్లను గైకొని, తనశిరసును ఖండించి, రాజకుమారునిముందు పడవైచెను. రాకుమారుడు దానినిజూచి యచటనుండి వరుగెత్తుకొని పోయి

రాజప్రసాదమును జొచ్చెను. అంతట ద్వారపాలకుడు సద్వాహ రాజు, చెంతకువచ్చి నాగార్జునుని శిరసునిచ్చిన కథయంతయు రాజుకు వినిపించెను. ఈవిషయము వినుచుండగనే రాజుగారి ప్రాణము పైననే పోయెను." ఈప్రకారము చైనీయ లేఖకుల వ్రాతలవలన వ్యక్తమగుచున్నది.

ఈకథనుబట్టి తేలు చారిత్రాంశమేమనగా శాతవాహన రాజులలో నొకడు దీర్ఘకాలము జీవించెనని, అతడు మరణించిన సంవత్సరముననే నాగార్జునుడు మరణించెనని స్పష్టపడుచున్నది.

లామాతారానాధుని అద్భుతకథలలోకూడ నీకథ కొన్ని మార్పులతో నున్నది. (See Mystic Tales of Lama Tharanatha P. 10-11). సరోహ (రాహులభద్ర) శిష్యుడు ఆచార్య నాగార్జునుడు. ఈయన విదర్భలో జన్మించెను. బ్రాహ్మణుడు, నాలందాకు వచ్చెను. అనేక ధారణులు జపించెను. మహాయాన, హీనాయాన పిటకము లీయనకు క్రొత్తలుగావు. అందుచే మహామయూరి, కురుకుల్లి, తొమ్మిది యక్షిణులు, మహాకళలు, సిద్ధులు నేర్చి వజ్రశరీరమును దాల్చెను. కాయకల్పము చేసికొనెను. గొప్ప తాంత్రికుడు అనేకచోట్ల పాదరస, ఖడ్గసిద్ధులచేసెను. ఈయన వచ్చినపుడు మగధలో 12 ఏండ్ల క్షామ ముండుటచేత, బంగారుసిద్ధిచేత దానిని పోగొట్టెను. మహాయాన విరోధులగు 'శంకరాదు' లతో పోరాడెను. అనేక గ్రంథములను కూర్చి నేలలో పాతిపెట్టెను. జాటసంజయనగరములో 500 మంది తీర్థికులతో పోరాడెను. తన మతమును వ్యాప్తిచేసికొనెను. మహాయానముకు

సూర్యునివలె ప్రకాశించెను. ఘంటశైల, దినకోట మున్నగా గల కొండలను బంగారు చేయవలెనని తలంచెను. కాని భవివృత్తులో తగాదాలు వచ్చునని 'ఆర్యతార' వద్దనెను. ఉత్తర దిశ కేగుచు 'ఒకబాలుడు' రాజగునని చెప్పెను. పండ్రెండువేళ్ల తర్వాత 'ఉత్తరకురు'నుండి జంబూద్వీపము వచ్చెనని, 'ఉదయన'యను బాలుడు రాజాయెనని, ఈయనను గౌరవించెనని అందుచే రాజుకు దీర్ఘాయుర్దాయము గల్గెనని, యక్షులు సేవకులైరని, 500 గుహాలు కట్టించెనని, ఈయన శ్రీపర్వతముపై 200 ఏండ్లు ఉండెనని, యక్షులు చుట్టుముట్టగా తంత్రములు అభ్యాసము చేసెనని, 'ఉదయను'ని మనుమడు 'సుశక్తి'కి తల యిచ్చువరకు అచట ఉండెనని, 70 సంవత్సరముల ఆరునెలల కిది జరిగెనని, కుమారునితల్లి ఆచార్యునితల యడిగెనని, కుమారుడు శ్రీపర్వతమేగి యడిగెనని, కుశగడ్డిచేత యతితల ఛేదించుకొనెనని, అపుడిక్రిందిమాట వినబడెనని 'ఇచటినుండి సుఖావతి కేగుదును; మరల తిరిగివచ్చి తిరిగి ఈశరీరములో ప్రవేశింతును' అంతట భూమిపైన క్షామము 12 ఏండ్లు ఉండెనని, రాకుమారుడు భయపడెనని, శిరస్సును చాలమైళ్లు దూరమున పారవేసెనని, యక్షి దానిని గైకొనెనని, యక్షి క్షితిపతి ఆతల శరీరముపై ఆలయము గట్టించెనని, లామా చూచెనని, ఈఆలయము గోడలు ఆకారము లేనిదని, కొండ రాళ్లవలె నుండెనని, అద్భుతమగు పనియని, బయటభాగము నిట్రముగా నుండెనని, దానికి మార్గము లేదనివ్రాసెను.

'తారానాథుని' వ్రాతలవలన నీరాజుపేరు శంకరుడని, ఉదయనుడని; యౌవనమున 'జేతకుడని' కూడ పిల్వబడుచుండెనని

తెలియుచున్నది. శాతవాహనవంశమును, అంతివాహన వంశమని తారానాధుడు పేర్కొనుచున్నాడు. ఈకారణమున 'నాసిక, కన్హేరి' శాసనములోని 'శ్రీయజ్ఞశ్రీశాతకర్ణి'యే యైయుండవచ్చునని, మనమూహించి నిశ్చయించవచ్చునని, చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిరి. ఈవిషయములో నేను ఏకీభవించక తప్పలేదు. కాన 'యజ్ఞశ్రీశాతకర్ణి' పరిపాలనా కాలముఫర్గిటరు సరిచేసిన ఆంధ్రరాజుల పట్టీ, రాజ్యకాలాదులనుబట్టి, 29 ఏండ్లని తెలియుచున్నది. క్రీ. శ. 194 సంవత్సర ప్రాంతమున సీయన మరణించెను. కనుక క్రీ శ. 165 సంవత్సర ప్రాంతమున ఈయన రాజ్యాభిషిక్తుడు గావచ్చును. అంతకుపూర్వ మీయన 18 ఏండ్లు యువరాజుగా నుండి, మహారాష్ట్రదేశమును పాలించినట్లు కాన్పించుచున్నది. అట్లయినచో ఈయన కీ. శ. 147 నుండియే యువరాజుగా, రాజప్రతినిధిగా నుండి, ప్రతిష్టానపురమున నుండి, మహారాష్ట్రదేశమును పాలించెను. కనుక దీర్ఘకాలము పాలించిన ఆఖరు 'అంతివాహనుడు' లేక శాతవాహను డీయనయేకాన, కడపటి ఆంధ్రరాజు కాలములో 'నాగార్జునుడు' జీవించియుండుట నిక్కువము. తారానాధుడిచ్చిన యితరరాజుల పేర్లు మాకు ఏశాసనముల లోను గాన్పించవు. ఏవిధముగాజూచిన ఆంధ్ర శాతవాహన రాజులు క్రీ. పూ. 225- క్రీ.శ. 225 వరకు రాజ్యమేలిరి. వీరి రాజ్యకాలములోనే 'నాగార్జునుడు' మనెను. ఆతరువాత శాతవాహనరాజులు లేరు. కనుక నాగార్జునుని పోషకుడు దీర్ఘ కాలము పాలించిన 'యజ్ఞశ్రీశాతకర్ణి'యే కావచ్చును. కాన

నాగార్జునయతి క్రీ. శ. 165-194 మధ్యకాలములోని వాడని చెప్పవచ్చును.

5 దేవయనువాడు నాగార్జునుని శిష్యుడు; క్రీ. శ. 383లో చైనావెళ్ళిన 'కుమారజీవుడు' క్రీ.శ.405లో దేవ, అశ్వఘోష, నాగార్జునుల జీవితచరిత్రల చైనీయభాషలోకి మార్చుటచేత ఈముగ్గురు క్రీ. శ. 400కి పూర్వులనుట నిక్కమము. దేవకు, ఆర్యదేవ యను పేరుగలదు. 'కాణదేవ' యనికూడ పిల్తురు. ఏలనన ఆయనకు ఒకకన్ను మాత్రము గలదు. (See Records of the 23 Patriarchs. Vol VI) ఆయనకు'నీలనేత్ర' యనికూడ పేరుగలదు. అతని బుగ్గలపైన కండ్లవలె రెండు మచ్చ లుండెను. అతని నిజమగుపేరు 'కంద్రకీర్తి', 'నంజిరో' అనికూడ పేరుగలదు.[97] ఈ 'ఆర్యదేవుడు' భిన్నమతావలంబుడగు గురువు నొకనిని వాదనలలో నోడించగా, త్రోవలో నాయనకాచి, ఖడ్గముతో ధ్యాననిమగ్నుడై యున్న ఆర్యదేవుని, అరణ్యమధ్యమున బొడిచి చంపెను. ఈయన క్రీ. శ. రెండు లేక మూడవ శతాబ్దములలోని వాడు.[98] తీవ్రమతాభిమానము, వాగ్ధోరి గలవాడని ప్రసిద్ధి.

"ఈయనను 'దేవబోధిసత్వు'డని కూడ నందురు. 15వ ప్రధానగురువు. దక్షిణహిందూస్థాన వాసి. తొమ్మిది గ్రంథ

---

[97] Z. Takakusu—(Itsing) A Record of the Buddhistic Religion as practised in India and the Malaya ArchiPelago P. 59.

[98] M. Winternitz—History of Indian Literature Vol. II-P. 348.

ములకు కర్త. బ్రాహ్మణమతమునకు బద్ధవైరి. ఈయన వైశ్యుడు. క్రీ. పూ. 212–161 వరకు 'కపిల' పాటలీపుత్రములో 15వ భారతీయ ప్రధానగురువుగా పనిచేసెను. భిన్న మతావలంబకుల విరోధి.[99] కాని యిందలి కాలనిర్ణయము తప్పనుటలో సందియము లేదు. క్రీ. శ. 161–212 అన్న కొంతవరకు అందముగా నుండెడిది.

సింహళరాజగు 'తిస్స' యనువాడు క్రీ. శ. 209–217 మధ్యకాలమున రాజ్యముచేసెను. ఈయన రాజ్యకాలములోనే 'థేరదేవుడు' నివసించి యుండెను. ఈవిధముగా 'కెరన్' పండితుడు వ్రాసెను.[100] 'థేరకీదేవ'యను పేరు కాన్పించుచున్నది. ఈయన మొదట నాగార్జునునకు వైరిగానుండి వృద్ధుడైన నాగార్జునునితో వాదనలు సల్పుటకు వచ్చెను. నాగార్జునుని కలసికొనగోరి ద్వారపాలకునితో తనరాక నెఱుకపరచెను. నాగార్జును డాయన చెంతకు ఒక జలపూర్ణపాత్రను బంపెను. దానినిజూచి 'దేవ బోధిసత్త్వుడు' ఒక సూదిని దానిలో బడవైచెను. తరువాత పాత్రనుత్రిప్పి యిచ్చెను. నాగార్జున బోధిసత్వ డంత 'దేవ'ను తనచెంతకు బిలిపించెను. నాగార్జునుడు దేవబోధిసత్త్వునిగాంచి మిగుల ప్రసన్నుడాయెను. నాగార్జును డిట్లుచెప్పెను. "నేనిపుడు వృద్ధుడనైతిని. నీవు ఏయే విద్యలను నావలన గ్రహించెదవు? దేవ యిట్లు ప్రత్యుత్తర

[99] E. J. Eitel—A Hand-book of Chinese—Buddhism, P. 42 - Also P. 69.

[100] H. Kern:— Manual of Indian Buddhism. (1896) P 124.

మిచ్చెను. 'నాయొద్ద అంతటి యోగ్యతలేదు. కాని యథాశక్తిగా నేను తమఆజ్ఞ పాలింతును.' మరల 'దేవబోధిసత్త్వుడు' నాగార్జునునిచే తనసమస్తవిద్యల నధ్యయనము చేయించెను. అని 'హూయాన్‌త్సాంగు' చెప్పియుండెను.[101]

ఉత్తరదేశ బౌద్ధుల లెక్క-ప్రకారము 'అశ్వఘోషుడు, ముందరివాడు' పంద్రెండవ ప్రధానగురువు. నాగార్జున దేవులు 14వ, 15వ ప్రధానగురువులు. 'హ్యూలి' కూడ 'దేవబోధిసత్త్వని' కథను వర్ణించియుండెను.

దేవ క్రీ. శ. 3వ శతాబ్దములోని వాడని, సింహళవాసియని, హిందూదేశములో గడపెనని, గుంటూరుజిల్లాలో ఈతని అస్థికలపెట్టెకూడ లభించెనని, తెలియుచున్నది.[102] ఆర్య దేవకు 'మహాచార్య' యను బిరుదుగలదని, నాలందాలోని పురాతనపండితుడని, ఈవిద్యాలయస్థాపన కీయన కారకుడని, లామాతారానాధుని వ్రాతలవలన తెలియనగును. కాని నాలందావిద్యాలయముతో సంబంధము, సత్యము కాజాలదు.

దేవయను ఆర్యదేవుడు నాగార్జునుని శిష్యుడట్లయినది హూయాన్‌త్సాంగు యిట్లు వ్రాసెను. "జలపూరితపాత్రలో, నాగార్జునుడు సూదిని వదలెను. అదిచూచి నాగార్జును డిట్లనెను. "ఆయన చాల తెలివిగలవాడు. అతనిశిష్యులు అట్లు ఎందుకుచెప్పిరని యతినడుగగా, నీళ్లునింపిన పాత్ర నాగార్జు

---

[101] T. Watters-On Yuan Chwang's Travels Vol II—P. 200.

[102] K. Gopalachary:- Andhra History P. 137.

నుని సమస్తజ్ఞానమును దెల్పుచున్నదని, 'దేవ' సూదిని వేయుట, ఈజ్ఞానము నంతను తాను గ్రహించితినని సూచించు చున్నదని చెప్పెను. అంతటాయన బౌద్ధమత రహస్యములను గూర్చి వాదించుట కాహ్వానించెను. 'దేవ' వాదించుటకు ప్రయత్నించెను గాని, విఫలుడాయెను. అందుచే నాగార్జునుని శిష్యుడని యంగీకరించెను. నాగార్జునుడు తర్వాత 'దేవకు' బౌద్ధమత రహస్యముల నెరుకపరచెను.[103] నాగార్జునయతి యొద్ద సమస్తశాస్త్రములను జదివి, మగధలో నొకతీర్థకునితో వాదించుటకు గురువు అనుజ్ఞ పొంది, మగధకేగి, అందు జయముగాంచెను. ఈకథ యిట్లున్నది.

"ఒకప్పుడు ఈ నగరములో 100 కి పైగా బౌద్ధసంఘారామము లుండెను. అచట సత్ప్రవర్తన, పాండిత్యముగల భిక్షుసోదరు లుండిరి. తీర్థకులు మౌనముగానుండిరి. క్రమముగా బౌద్ధభిక్షుసంఘము నశించెను. వారి అసూయాదులలో చాలపతనము గల్గెను. అపుడు 'తీర్థకులు' గురుశిష్యభావమున జ్ఞానము నందించుచు, నది యొకవృత్తిగా జేసికొనిరి. వ్యతిరేకమతస్థులు వచ్చినప్పుడు, వేలకొలది భిక్షుమందిరముల చెంతచేరి యిట్లు కేకలువేయసాగిరి. "జేగంటను బిగ్గరగా మ్రోగించుడు; పండితులను పిలువుడు." సామాన్యులు సభ కేగుచుండిరి. అచట విపరీతముగా జేగంటల మ్రోగించుచుండిరి. తీర్థకుని ప్రార్థనపై రాజు వారివారి యోగ్యతల నిర్ధారణచేయుటకు తర్కసంబంధమగు సభ నేర్పాటుచేసెను. ఈక్రిందివిషర్తు

103 T. Watters-On Yuan Chwang's Travels Vol II—P. 200-201.

కూడ విధించెను. "తీర్థకులు జయముపొందినచో బౌద్ధసంఘా రామములు జేగంటా రావములచేత సభలను బిలువరాదు." బౌద్ధులోడిపోయిరి. వారు 12 ఏండ్లవరకు ఈయవమానమును భరించిరి. అప్పుడు 'నాగార్జునపూస' శిష్యుడు 'దేవ' యను వాడు దక్షిణ హిందూస్థానమునుండి పాటలీపుత్ర నగరమునకు పోవుటకు తర్కములో తీర్థకులలో పాల్గొనుటకు గురువుఅనుజ్ఞ బొందెను. 'దేవపూస' యొక్క ఖ్యాతి నగరమునకు తెలిసెను. తీర్థకు లిదివిని నగరములోని కేయితరభిక్షువు రాకుండ ద్వార పాలకులను నిరోధించవలసినదిగా రాజునకు బోధించిరి. 'దేవ' ఎన్ని ఆటంకములు కల్గించినను మారువేషముతో నగరముప్రవే శించెను. అతడువచ్చిన ఉదయమే అతడు నిద్రించిన బౌద్ధసంఘా రామములోని జేగంటను ప్రయోగించిరి. ఇది గొప్పతత్తర పాటును గల్గించెను. 'దేవ'కు కావలసిన తర్కసంబంధమగు సభ నేర్పాటుచేసిరి. 12 దినములలో దేవ, తీర్థకుల వాదనల ఖం డించి, తర్కములో వారినెల్లర తీవ్రముగా నెదుర్కొని ఓడిం చెను. రాజు, అతని మంత్రులు చాల సంతోషించినవారై వారిపవిత్రమైనకట్టడమును స్మృతిచిహ్నముగా నిర్మించిరి. (పాట లీపుత్రములోని కుక్కుటారామము)[104] ఈవాదనలు సల్పి నది దేవ కాదని, నాగార్జునుడే స్వయముగా పాటలీపుత్రమున కేగి తీర్థకుల నోడించెనని, కొన్నిగ్రంథములు తెల్పుచున్నవి.[105]

---

[104] Watters- On Yuan Chawang's Travels- Vol. II. P. 100.

[105] Ibid p. 101.

లామాతారానాథుని వ్రాతలనుబట్టి, 'ఆర్యదేవ' నాలందా విద్యాలయమున గొప్పపండితుడని, చంద్రగుప్తుని (క్రీ. శ. 375-413) సమకాలీనుడని తెలియుచున్నది. 'నాలందా' 'సూత్ర కృతాంగ' యను జైనగ్రంథములోకూడ పేర్కొనబడినది. నాలందా విద్యాలయము చంద్రగుప్తుని కాలమున గలదా యను విషయము ఆలోచించవలసి యున్నది. ఇది సందేహాస్పదముగా నున్నది. 'తారానాథుని' ప్రకారము, అతడు చంద్రగుప్తుని సమకాలీను డనుటచేత, ఈయన మఱియొక 'ఆర్య దేవుడు' కావచ్చును. చంద్రగుప్తుని కాలమున వచ్చిన 'ఫాహియాను' (క్రీ. శ. 405-411) 'నలో' లో విద్యాలయస్థాపన జరుగుచుండెనని వ్రాసెను. నిర్మాణము పూర్తియైనట్లు ఆధారములు లేవు. కనుక నాగార్జునుని శిష్యుడైన 'ఆర్యదేవ' చంద్రగుప్త సమకాలీనుడనుట పొసగకున్నది. అందుచే తారానాథుని వ్రాతలు అనుమానాస్పదములుగా నున్నవి.

'ఆర్యదేవ' రచించిన మూడుగ్రంథములు 'టిబెట్' చేరినవి. అవి అనువాదరూపమున నున్నవి. 1 శతకశాస్త్రం, 2 భ్రమ ప్రమదనయుక్తి హేతుసిద్ధి, 3 మాధ్యమిక భ్రమఘటనామ, చివరిగ్రంథము నాలందా విహారములో ఆఖరు జంబూద్వీప రాజగు సుఖాచార్య (అనగా ఉదయ-నదవాహ.) ప్రార్థనపై రచించెను. దీనిని టిబెటీయ భాషలోనికి 'ఉపాధ్య దీపంకర శ్రీజ్ఞాన' మార్చెను. (జననము క్రీ. శ. 980) [106]

---

[106] Phanindranath Bose-Indian Teachers of Buddhist Universities, P. 109-110.

"ఇంకను తారానాధుడు, తంత్రగ్రంథముల నాగార్జునుడు ఆర్యదేవుని కిచ్చెనని, ఆయన రాహులునికి, ఆయన చంద్ర కీర్తికి, ఆయన ప్రభాకరునికి, ఆయన జ్ఞానశక్తికి, ఆయన శాంతికి చెప్పెనని వ్రాసెను.[107] ఇంకను ఈ ఆర్యదేవునిగూర్చి అనేక విషయములు తెలియుచున్నవి. "ఈ ఆర్య గొప్పవిద్వాంసుడు; బహుదూరయాత్రలు చేసెను. విఖ్యాతలేఖకుడు. చుళియలో, కోసలలో, పాటలీపుత్రములో, నింక నితరచోట్ల, అనేక తీర్థికలతో వాదనలు సల్పి గెల్చెను. 'నాలందా'లో ఉన్నత స్థానము గడించెను, ఆయన 'శతశాస్త్రము'లో సాంఖ్య, వైశేషికములను ఖండించెను. చిత్తవిశుద్ధి ప్రకరణములో గంగానదిని గూర్చి బ్రాహ్మణులకు గల మూర్ఖసిద్ధాంతముల ఖండించెను. 'అంధ కవిందసుత్తాంతము'ను బ్రచారము చేయుటలో నభిలాష గలదని తెలియుచున్నది."[108]

ఎట్లయిన 'ఆర్యదేవ' నాగార్జునుని శిష్యుడనుట స్పష్టము. సింహళదేశ చరిత్రమగు 'మహావంశము'ను బట్టి నాగార్జునుని శిష్యుడు 'దేవ' క్రీ. శ. 209—217 మధ్యలో రాజ్యమేలిన 'ఓహారతిస్స', అభయుల సమకాలీనుడగుటచేత ఈయన గురువగు 'నాగార్జునుడు' అంతకు పూర్వుడనుట స్పష్టము. అందుచే నాగార్జునయతి క్రీ. శ. 2వ శతాబ్దములో జీవించి యుండుట తథ్యము.

---

[107] Bhupendranath Dutta-Mystic Tales of Lama Tharanatha P. 46.

[108] K. R. Subrahmanyan-Andhra History P. 62.

6 'విక్రమాదిత్యుని' కాలమున 'వ్యాడి' ఉజ్జయినిలో నుండె నని, ఈయన రసాయనశాస్త్రవిదుడని, 'అల్బరూని' వ్రాసెను.[109] ఈవ్యాడి నాగార్జునుని శిష్యుడని, విక్రమాదిత్యుడని పేర్గాంచిన 'రెండవచంద్రగుప్తుడు' క్రీ శ. 375–413 మధ్య కాలమున రాజ్యపాలన చేయుటచేత, ఆయనగురువు నాగార్జునుడు శివ శతాబ్దములో నుండెనని, కొందరి యభిప్రాయము. తారానాథుడు నాగార్జునుని శిష్యునిపేరు 'వ్యాలి' యనెను. కాని ఈవిక్రమాదిత్యుడెవ్వరో తెలియలేదు. 'వ్యాడి' అటనున్న యితరప్రమాణములు కాన్పించవు. కాన ఈకాలనిర్ణయము సరిలేకున్నది. ఈవ్యాడి యింకను దన వైద్యగ్రంథములోని యాకులను సగము పారవేసెనని, మిగత సగమును కూడ తర్వాత పారవేసెనని, అవినదిలో కొట్టుకొని పోయెనని, 'అల్బరూని' చెప్పు గాథ లెంతవరకు సత్యములో తెలియకున్నవి. వ్యాలిని గూర్చి తారానాథుడిట్లు వ్రాయుచున్నాడు. "పశ్చిమ దేశములో ఆచార్యవ్యాలి ఉండెను. ఆయన అనేక మూలికలను గలిపి, పాదరససిద్ధిని సంపాదించవలెనని ప్రయత్నించెను. ఆయన సఫలత పొందకపోవుట చేతను, ఆయన సామగ్రి అయిపోవుటచేతను, పాదరససిద్ధి ప్రయోగముగల గ్రంథమును గంగలో బడవైచి, యాచించుచు వెడలెను. ఒకపర్యాయము 'ఒడివిచ' వెళ్లగా, అదేపుస్తకము ఆయన నదిలో స్నానము చేయుచుండ, చెడకుండ నుండుట గాంచెను. సిద్ధిపొందుట కిది చిహ్నమని, ఆయనగుర్తించి స్వదేశమునకేగెను. రసము కుడి

109 Dr. Edward C. Sachua – Alberuni's India Vol. I – P. 189.

వైపుకు కదలి, నాదము రాసాగెను. గృహములోనివారు పుష్పవర్షమును గాంచి, వారది ఏమిటని యడిగిరి. ఎవరికి యేమి తెలియకుండెను. తెలివితక్కువ బాలిక యొకతె యిట్లు చెప్పెను. "ఈగదిలో నాపైన పాదమును జల్లిరి." తరువాత ఆరుమాసములకు పాదరససిద్ధి కల్గెను. వ్యాలి, అతనిభార్య, కుమారుడు, కూతురు, కోడలు దానిని సేవించిరి. ఈ అయిదు గురు గాక ఆరవది గుఱ్ఱముకూడ దీనిని సేవించెను.

ఈసిద్ధినెవరికి జెప్పక, పెద్దరాతిపై కూర్చుండి, రససిద్ధిని, పాదరసయోగమును యివ్వ నిశ్చయించి, ఆసిద్ధి కల్గుటచేత తంత్రము చేయుచుండెను.

ఆచార్య నాగార్జునుడు దీనిని వినెను. నాగార్జునుడు ఆకాశ మార్గమున పోవుటకు రెండు ఆకులను దెచ్చెను. (దాకినుల) ఒక దానినిదాచి, రెండవదాని సహాయమున ఆకాశమున నేగెను. బంగారు చేయు విద్య చెప్పుడని వ్యాలినడిగెను. వ్యాలి యిట్లుచెప్పెను. "మీరు ఆకునివ్వండి, బంగారు చేయువిద్య నిచ్చెదను." రససిద్ధి కనేక పద్ధతులు, కాయకల్ప చికిత్సలు, మందులు, వేలు, బంగారు చేయువిధము వ్యాలి నాగార్జునుని కిచ్చెను. వ్యాలి పాదరక్షను ధరించి హిందూదేశమంతయు గాలిలో వెళ్లెను. గాంధారలోని 'దినకోట' కొండనంతటిని, బంగారు, వెండిగా మార్చ దలంచెను. ఆర్యతార తగాదాలు వచ్చునని ఉప్పుగా మార్చెను. దీనిపేరు 'లాతి'; 'వ్యాలి' విద్యాధరుడాయెను. వ్యాలికి 'చార్పతి' శిష్యుడాయెను.[110]

[110] Bhupendranatha Dutta-Mystic Tales of Lama Tharanatha P. 53 - 54 - 55.

'ఆల్బరూని' వ్యాడియనెను. 'తారానాథుడు' 'వ్యాలి' యనెను. ఈ నాగార్జునుడు, సిద్ధనాగార్జునుడుగా కాన్పించు చున్నాడు. ఇందలి కథ లనేకములు భూతకల్పనలు; చారిత్రక సత్యములు కాజాలవు. తారానాథు డింకు రాజును పేర్కొన లేదు. వరరుచికికూడ గాలిలోపోవు పాదరక్షలుండెను.

దీనినిబట్టి కాలనిర్ణయము తేలకున్నది. ఇది సరిగాలేదు. అదియునుగాక బోధిసత్వనాగార్జునునికి, ఆర్యదేవ, నంద, నాగ అను శిష్యులుండిరని, 'ఇత్సింగు' వ్రాతలు తెల్పును. కాని, 'వ్యాడి' ఎందును గాన్పించడు. కాన ఈవ్యాడి క్రీ. శ. 7వ శతాబ్దములోని సిద్ధనాగార్జునుని శిష్యుడు గావచ్చును. విక్రమాదిత్యుని సమకాలీనుడనుట పొసగకున్నది. అందుచేత, వ్యాలినిబట్టి సమకాలీనుడని చెప్పబడు విక్రమాదిత్యునిబట్టి, బోధిసత్వ నాగార్జునునికాలము మూడవశతాబ్దమనుట తప్పు.

7 'రాజతరంగిణి' ఆధారమును బట్టి, 'నాగార్జునుడు' హుష్క, జుష్క, కనిష్కుల కాలములో నున్నట్లు తెలియు చున్నది. ఈ మువ్వురు 'హువిష్క, వశిష్క, కనిష్క II' లు గావచ్చునని హేమచంద్రరాయ్ వ్రాసెను.[111] ఒకటవ కనిష్కుడు క్రీ. శ. 125—153 వరకు రాజ్యమేలెనని లౌకిక శకమును, చైనీయ ప్రమాణముల ననుసరించి, వి. ఏ. స్మిత్, వింటర్నిట్జ్, మున్నగు విద్వాంసులు వ్రాసియుండిరి. ఆధునిక పరిశోధనలవలన. యిది సత్యమనియే బహువిద్వాంసు లంగీకరించిరి. శకసంవత్సర మేర్పరచిన 'కనిష్కుని'తో నాగార్జునునికి

[111] Hemachandra Rai Choudry- Political History of Ancient India P. 317.

సంబంధము కాన్పించదు. అప్పటికి ప్రసిద్ధిగాంచియున్నచో, నిట్టి సమస్త విద్యాపారంగతుని అశ్వఘోషునివలె ఆదరించక, పోషించక, కనిష్కమహారాజు ఊరకుండునా! ఆయన రాజ్యకాలములో జన్మించినను, కనిష్కుడు చనిపోవునప్పటికి, ఇరువది వర్షముల ప్రాయముగల యువకుడై యుండవచ్చునుగాని ప్రసిద్ధికెక్కి యుండడు.

తరువాత 'జసుకుడనబడు, వశిష్కుడు' 1వ కనిష్కుని పెద్ద కుమారుడు క్రీ. శ. 153—157 వరకు రాజ్యమేలినట్లు కాన్పించుచున్నది. శకవర్షములు క్రీ. శ. 128న ఆరంభము. శకవర్షములు 24—28 వరకు ఈయన రాజ్యమేలెను. ఈయన రాజప్రతినిధిగా కూడ పనిచేసెను.

ఈయనతర్వాత 'హుస్కుడు' అనబడు 'హువిష్కుడు' రాజ్యమేలెను. ఈయన 'కనిష్కుని' కుమారుడు కావచ్చును. 'కాశ్మీరము'లో 'హువిష్కపురము'ను కట్టించెను. రాజప్రతినిధిగా కూడ పనిచేసెను. ఈయన శకసంవత్సరములు చాలకాలము పాలించినట్లు శాసనాధారములవలన తెలియవచ్చుటచేత ఈయన మొదట శాసనములలో 'దేవపుత్ర' యని ఉండుటచేత రాజాధిరాజుగా గాన్పించడు. శకసంవత్సరములు 40తర్వాతనే స్వతంత్రుడై నాణెములు తనపేరున వేయసాగెను. అందుచేత ఇతని రాజ్యారంభకాలము క్రీ.శ. 168గా పరిగణింపబడుచున్నది. ఈయనతండ్రికి సోదరునికికూడ చాలకాలము రాజప్రతినిధిగా పనిచేసి 50 ఏండ్లు పాలించినట్లు తోచుచున్నది. ఈయన బౌద్ధపోషకుడు. శక 33-60 వరకు ఈయన శాసనములు కాన్పిం

చుటచేత, ఈయన రాజ్యాంతము బహుళ క్రీ. శ. 188న జరిగి యుండవచ్చును. తరువాత 1వ వాసుదేవుడు వచ్చులోపుగా రెండవ కనిష్కుడు రాజ్యమేలినట్లు 'ఆరంశాసనము'ను బట్టి తెలియుచున్నది. అందీయన 'మహారాజ రాజాధిరాజ దేవ పుత్ర కేసర వాజెత్రుపుత్ర కనిష్క' అని పేర్కొనబడినాడు. కాని ఈయన 'హువిష్కుని' తర్వాత ఎక్కువకాల ముున్నట్లు తోచదు. ఎట్లయిన 'వసుదేవుని' కాలము శక. 68-99 వర కుండుటచేత ఈయనరాజ్యకాలము క్రీ.శ. 196—క్రీ. శ. 227 కావచ్చును. ఈయన బౌద్ధుడుకాడు; శైవుడు. రాజతరంగిణి హుస్క, జస్క, కనిష్కులకాలములో నాగార్జును డున్నట్లు చెప్పుటచేత, వాసుదేవునితో సంబంధము చెప్పకపోవుటచేత, 'వాసుదేవుని'కి ముందుఅనగా క్రీ.శ. 196కుముందువరకు, అనగా క్రీ. శ. 153-196 వరకు పైముగ్గురి రాజులకాలము గాన, 'నాగార్జునయతి' వీరికాలమున జీవించియుండెనని రాజతరంగిణి చెప్పుటచేత, క్రీ. శ. 153-196 మధ్యలో నాగార్జునుడు ప్రసిద్ధుడై యుండవలయునని తోచుచున్నది. కల్హణప్రోక్తమైన ఈఅనుశ్రుతి గొప్పచారిత్రక ప్రమాణముగా కాన్పించుచున్నది. దీనిబట్టి 'నాగార్జునుడు,' కనిష్కునికాలమున నుండెనను విషయమునుబట్టి, 1వ కనిష్కుడని చాలమంది చరిత్రకారులు భ్రమపడిరి. కాని యిది సరికాదు. క్రీ. శ. 188-196 వరకు రాజ్యమేలిన 'రెండవకనిష్కుని' కాలములోకూడ నాగార్జునయతి జీవించియుండెననుట నిక్కువము.

8 'లామాతారానాథుని' వ్రాతలనుబట్టి, 'మహాచార్య బ్రాహ్మణ రాహులభద్రుడు' ఒడివిసాదేశమున జన్మించెనని,

చిన్నతనమున వేదవేదాంగముల జదివెనని, మధ్యదేశమేగెనని, అచట బౌద్ధధర్మ మంగీకరించెనని, క్రమముగా త్రిపిటకముల నెఱింగిన భిక్షువాయెనని, ఈయన గురువు స్థవిరకాలుడని, ఈయనగురువు 'అశ్వఘోషుడని', ఈయనగురువు 'ఉపగుప్తుడని' తెలియుచున్నది. ఈ 'రాహులభద్రుడు' విద్యాధర శరీరమును దాల్చి, స్వర్గమునకేగి అదృశ్యరూపు డగుచుండెనని, ఈయన బ్రాహ్మణరాహులుడని, స్థవిర రాహులుడు కాదని, ఇతని శిష్యుడు నాగార్జునుడని యున్నది.[112] కాని పైనచెప్పబడిన 'మహాచార్య రాహులభద్రుడు' సిద్ధనాగార్జునుని గురువుగా గాన్పించుచున్నాడు. కాని బోధిసత్వనాగార్జునుని గురువు కాదు. చరిత్రకారులలోగూడ చాలమంది ఈవిషయములో భ్రమప్రమాదములకు లోనైరి అని చెప్పవచ్చును. 'కెరన్' పండితుడుసైతము, మహాయానబోధకుడగు 'బ్రాహ్మణరాహులభద్రుని శిష్యుడనెను.[113]

గురుపరంపరను బట్టిచూడగా, నాగార్జునుడు అశ్వఘోషుని తర్వాత ఉత్తరాధికారి తర్వాత ఉత్తరాధికారి లేక ప్రశిష్యుడని తెలిసికోవచ్చును. 'అశ్వఘోషుడు' కనిష్కుని సమకాలీనుడు. (క్రీ. శ. 125-153) కనిష్కుని కాలమున జరిగిన బౌద్ధసభ కధ్యక్షుడు, బౌద్ధుల ప్రధానగురువైన పార్శ్వకుడని తెలియవచ్చుచున్నది. పార్శ్వకుని తరువాత ఆచార్య

---

112 Bhupendranath Datta. (Tr.) Mystic Tales of Lama Taranatha P. 8.

113 H. Kern-Manual of Indian Buddhism p. 122.

పీఠము నెక్కినవా డశ్వఘోషుడని, నాగార్జునుడు నాల్గవ వాడని, కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు తర్వాత వ్రాసిరి.[114] గురుపరంపర ఈవిధముగానున్నది. పార్శ్వకుడు, వసుమిత్రుడు, పుణ్యాయశస్సు, అశ్వఘోషుడు, కపిమల, తర్వాత నాగార్జునయతి వచ్చుటచేత, పార్శ్వకుని తర్వాత నాగార్జునుడు ఆరవవాడని తెలిసికొనవచ్చును. మొదటి నలుగురు కనిష్క సమకాలీనులు. అందుచేత కనిష్కుని నుండి మూడుతరముల లోపుగా నాగార్జునయతి జీవించియుండుట నిక్కవము. 'కనిష్కుడు' క్రీ. శ. రెండవశతాబ్ద మధ్యభాగమున జీవించియుండుటచేత, నాగార్జునుడు క్రీ. శ. 200 లోపుగా నుండుట నిక్కవము. నాగార్జున రచిత గ్రంథములలో, కనిష్క, అశ్వఘోషుల పేర్లుండుటచేత, వారి తర్వాతనే ఈయతి జీవించియుండెనని, నిశ్చయముగా జెప్పవచ్చును.

నాగార్జునుని గురువు 'సరహా' యని, ఈయన విదేశీయుడని, ఈపూజావిధానము ప్రథమముగా భారతవర్షమున జెప్పినవాడీయనయేనని, ఈయన శూద్రుడుగా చెప్పబడియుండెనని, ఈపూజ భారతభూమిలో లేదని, విదేశీయపూజయని, హిందూదేశమునకువచ్చెనని, 'అమితభ' ఒకరకముదేవతలని, 'విష్ణుపురాణము'లో గూడ వచ్చినవని, 'ఎలియెట్' పండితుడు వ్రాసెను.[115] ఇంకను తారానాధుని (టిబెట్‌చరిత్రకారుడు)

---

114. చి. వీరభద్రరావు — ఆంధ్రుల చరిత్ర పూర్వభాగము పుట 154

115 Sir Charles Eliot — Hinduism and Buddhism. Vol I P. XXXII also Vol. VI-P. 29

ప్రకారము ఈపూజావిధానము 'సరహ' లేక 'సర' లేక రాహులభద్రునికి జేరునని, ఈయన నాగార్జునుని గురువనిచెప్ప బడుచుండెనని, గొప్పమాంత్రికుడని, 'అమితభ' నీయన 'దీన కోట'లో జూచెనని, 'సుఖావతి' వైపు ముఖముత్రిప్పుకొని చనిపోయెనని, 'సరహ' హిందూదేశీయుడుగాదని, శూద్రుడని, త్రిపిష్టక పటములో గడ్డము, ముడి కల్గియుండెనని, చేతిలో బాణము కల్గియుండెనని, తక్కువజాతివాడని, ఈపూజకు మొదటివాడని, ఈయన 'ఆకసు'నుండి కాని, 'టర్కీ-స్థానము నుండికాని వచ్చిన ఆధారములు లేవని, 'ఎలియట్' వ్రాసెను.[116] ఈగ్రంథములో నుదాహరించిన ప్రధానగురువుల జాపితా యిట్లున్నది.[117]

1 మహాకాశ్యప. 2 ఆనంద. 3 సనవాస. (షంగ్నవాస. సనకవస. ఈయన రాజగృహవాసి) 4 ఉపగుప్త-మగధవాసి-అశోకునిగురువు. 5 ధృతక. 6 మిచ్చక, 7 బుద్ధనంది, 8 బుద్ధ మిత్ర, 9 పార్శ్వ, (కొందరు వసుమిత్రుని తర్వాత పేర్కొనిరి.) 10 పుణ్యాయశస్సు, 11 అశ్వఘోష, 12 కపిమల, 13 నాగార్జున, (క్రీ. శ. 150 ప్రాంతపువాడు) 14 దేవ (కణదేవ) దక్షిణ దేశవాసి, 15 రాహులత, (కపిలవాసి) 16 సంఘనంది. (శ్రావస్తి వాసి) 17 సంఘయశస్సు, 18 కుమారత, 19 జయత, 20 వసు బంధు, 21 మనుర, 22 'హక్లెన' లేక 'పద్మరత్న' కందహారు వాసి, (చెనీయగణితప్రకారమీయన క్రీ. శ. 209లో చని పోయెను.) 23 సింహభిక్షు, 24 బసియశిత, (కందహారువాసి,

---

[116] Ibid—Vol. III—P. 219.
[117] Ibid—Vol. III— P. 307.

క్రీ. శ. 328లో మరణము.) 25 పుణ్యమిత, లేక పుణ్యమిత్ర (దక్షిణ హిందూస్థానక్షత్రియుడు, మరణము క్రీ. శ. 388) 26 ప్రజ్ఞాతార, (క్రీ. శ. 457లో మరణము) 27 బోధిధర్మ, 'వసుమిత్రుని' పదవవాడుగా గణించిన 28మంది యగుదురు."

ఈవిషయము లింకను టిబెటీయశాస్త్రములనుబట్టి తారానాథుని వ్రాతలనుబట్టి, క్రీ. శ. 520లో వ్రాసిన 'సెంగ్సు' వ్రాతలనుబట్టి తెలియుచున్నది. 'బోధిధర్మ' క్రీ. శ. 526లో చైనాకేగినట్లు తెలియుచున్నది. కాని ఈవరుస, నాగార్జునునివరకు సరిగానున్నను, తర్వాత సరిలేదని కొందరు ప్రామాణికవిద్వాంసుల యభిప్రాయ మగుచున్నది. ఆర్యదేవుని పేరువరకు సరిగానే యున్నదని చెప్పవచ్చును. ఎడ్కిన్సు(Edkins) గురువరంపరలో 'బుద్ధమిత్రను' 9వ వానినిగా ఉల్లేఖించెను.[118]

'పార్శ్వుడు' కనిష్కసభ కధ్యక్షుడు. అశోకుని తర్వాత 300 వండ్లకని, బుద్ధనిర్వాణము తర్వాత 400వండ్లకని, 'వశానుత్సాంగు' వ్రాసెనేకాని, మొదటిదానిప్రకారము కనిష్కకాలము క్రీ. శ. 70 లేక 75 అగును. రెండవదానిప్రకారము క్రీ. పూ. 77 అగును. రెండును సరికావు.

"సరహాయొక్క ముఖ్యశిష్యుడు, ప్రఖ్యాతగురువు నాగార్జునుడు; అతనితర్వాత అతని శిష్యులమూలముగా బోధలు వ్రాకూవకముగా జరుపబడుచుండెనని చెప్పబడుచుండెను" అని ఎవాన్సు వ్రాసెను.[119] ఇది సిద్ధనాగార్జునుడని ఎటుగ

---

[118] Rev. Joseph Edkins-Chinese Buddhism P.8.

[119] W. Y. Evans-Tibetan Yoga and Secret doctrines. P. 101.

వలెను. మహాగురుపరంపరలో, 'సరహ' లేడు. చాలామంది తప్పుగ్రాసిరి. ఈ సరహాభద్రుడే, రాహులభద్రుడని, 'ధర్మకీర్తి' (క్రీ. శ. 600–650) సమకాలీనుడని తెలియుచున్నది.

'తారానాథుని' వ్రాతలనుబట్టి చూడగా, ఆర్యదేవుడు అశ్వఘోషుని మంత్రవిద్యచేత ఓడించి శిష్యుని చేసినట్లున్నది. కాని 'అశ్వఘోషుడు' ఆర్యదేవునికి చాల పూర్వుడగుటచేత, యిది చారిత్రకసత్యము కాజాలదు. అశ్వఘోషుని చరిత్రనుబట్టి, పార్శ్వుడే ఈపండితుని భిక్షువుగా మార్చెనని తెలియుచున్నది. కొన్ని ప్రమాణముల ననుసరించి 'పుణ్యవచసు' మార్చినట్లున్నది. ఎట్లాగైన, 14మంది గురువులలో, పార్శ్వ, పుణ్యవచస్సుల తర్వాతనే నాగార్జునుని ఆర్యదేవులపేర్లు వచ్చుచున్నవి. చైనీయ సాంప్రదాయమును బట్టి, 'అశ్వఘోషుని' శిష్యుడనుట ఏమాత్రము పొసగకున్నది. ఈయనయొద్ద 'నాగార్జునుడు' బౌద్ధధర్మస్వీకారము గైకొన్న ఆధారములుకూడ లభించవు. 'హెన్రీ అలబర్ట్' అను విద్వాంసుడుకూడ, ఈవిషయమును సందేహించెను.

'అశ్వఘోషుడు' వేరు వేరు తావులలో బుట్టినట్లు విద్వాంసులు వ్రాసిరి. కొందరీయన జననము 'కాశ్మీర' మనిరి. సాకేతవాసియగు 'సువర్ణాక్షి' సూనుడని 'సౌందరానందమును'బట్టి తెలియుచున్నది. సంయుక్త పిటకసూత్రము (సంయుక్త రత్న పిటకమని యస్. బీల్ వ్రాసెను.) నుబట్టి, 'తుఖారరాజగు' 'కండనకనిష్క' ముగ్గురిలో చెలిమికలవారితో స్నేహముచేసెనని తెలియుచున్నది. 'అశ్వఘోషుడు' కనిష్క సమకాలీనుడు.

సంయుక్తరత్నపిటకము 93, 94 కథలలో, 'చంద్రన్ రాజు కనిష్క, గాంధారకనిష్క' అను పేళ్లు కాన్పించుచున్నవి. 94వ కథనుబట్టి ఆయనకు ముగ్గురు మిత్రులున్నట్లు తెలియు చున్నది. ఒకడు బోధిసత్వ అశ్వఘోషుడు; రెండవవాడు గొప్పమంత్రి మో—చా—లో; (మాదర) ఈయనజ్ఞానోపదేశ కుడు. మూడవవాడు చే—లో—కి—యో. (చరక) ఈయన ముఖ్యవైద్యుడు.[120] కనుక అశ్వఘోషుడు, కనిష్క సమ కాలీనుడనుట సత్యము. ఈవిషయము ఫూ—ఫా—సాంగ్-ఇన్-యుయాన్-ఛుయాన్ అనుదానినిబట్టికూడ తెలియుచున్నది. కనిష్కుడు నాల్గు సైన్యములను గైకొని, పాటలీపుత్రము మీదకు పోయెనని వీరధైర్యముతో పోరాడెనని, 90 కోట్లు బంగారునాణెములు అడిగెనని, రాజు ధనముగా నివ్వలేక అశ్వ ఘోషుని, బుద్ధునిగిన్నెను, జాలిగలిగించుకోడి నొసంగెనని తెలియుచున్నది. పైమూటికి గొప్పయోగ్యతలు గలవని అట్లొ సంగెను. ఒక్కొక్కటి 30 కోట్ల బంగారునాణెముల విలువగల్గి యుండెను. రాజు సంతసించి వెడలిపోయెను. ఈకథ 'కుమార జీవ' రచితమగు 'అశ్వఘోషచరిత్రము'లోగూడ నుండుట చేత సత్యమేకావచ్చును.

అశ్వఘోషుని పేర్కొన్న నాగార్జునుడు క్రీ. శ. 125కు తరువాతవాడే కావలయును. నాగార్జున, ఆర్యదేవ, అశ్వ ఘోషుల' జీవితచరిత్రలు, చైనీయభాషలోనికి క్రీ. శ. 387-418లలో అనువాదమాయెనని తెలియవచ్చుచున్నది. 'కుమార

[120] S. Beal — The Age and Writings of Nagarjuna in Ind. Anti. XV — P. 353.

జీవుడు' 800 మంది పండితుల సాయమున చైనీయ భాషలో 800 సంపుటములు తయారుచేసెనని తెలియుచున్నది. కనుక 'నాగార్జునుడు', 'కనిష్కుని' రాజ్యారంభ కాలమునకు తర్వాత జన్మించి, (క్రీ. శ. 125కు తర్వాత) కుమారజీవుని కాలమునకు అనగా క్రీ. శ. 4వ శతాబ్దమునకు ముందే మరణించియుండుట నిక్కువము.

9 నాగార్జునకృతమగు దశభూమికకు గల రెండుఅనువాద ములలో 'ధర్మరక్షు' క్రీ. శ. 297లోను, రెండవది 'కుమార జీవుడు' చేసియుండెను. ఈనాటికి సంస్కృతఅనువాదము కాన్పించుచున్నది. ఈకాలమునకు పూర్వమే నాగార్జునుడు జీవించియుండుట స్పష్టము. ఇంకను నాగార్జునుడు 'సధర్మ పుండరీకమును పేర్కొనెను. దీని చైనీయఅనువాదము 'ధర్మ రక్షు' క్రీ. శ. 286లో జేసెను. కుమారజీవుడు క్రీ. శ. 406 లోను, జినగుప్త, ధర్మగుప్త అనువారు క్రీ. శ. 601లోను అనువాదములు చేసియుండిరి. ఇందు రెండవది అతిశ్రేష్టమైన దని విద్వాంసులు కొనియాడుదురు. కాన 'ధర్మరక్షు' కాలము నకు పూర్వమే 'నాగార్జునుడు' జీవించియుండెను. 'కుమార జీవుడు' క్రీ. శ. 406లో 'బ్రహ్మజాలసూత్రము'ను గూడ అను వాదము చేసియుండెను.[121]

10 'లంకావతారసూత్రము'లో ఆఖరున 'నాగార్జునుడు' పేర్కొనబడెను. దీనికి 'జపాను' చైనీయ అనువాదములు

---

[121] B. L. Suzuki—Mahayana Buddhism. P. 108.

గలవు. ధర్మరక్ష క్రీ.శ. 412-433 మధ్యకాలములో పైదానికి చైనీయ అనువాదము చేసియుండెను. ఇది ప్రస్తుతము ఖిలమై పోయినది. రెండవది 'గుణభద్రుడు' క్రీ. శ. 433లో జేసెను. ఈకాలమునకు పూర్వమే 'నాగార్జునయతి' జీవించియుండెను. దీనిలో నాగార్జునునిగూర్చి గుప్త, హూణులనుగూర్చి భవిష్యత్తు చెప్పబడెను. లంకలోని 'మలయ'లో రావణుడు బుద్ధునికి గౌరవము తెలియపర్చుటకు వచ్చెనని ఉండుటచేత 'రావణుడు' క్రీ.పూ. 6వ శతాబ్దములోని వాడని తెలిసికొనవచ్చును. కాని యివి చారిత్రకదృష్టిలో గల్పనలుగా గాన్పించుచున్నవి.

11 సరియైన నాగార్జునుని జననసంవత్సరము తెలిసికొనుటకు ఒక ఆధారము లభించుచున్నది. బౌద్ధగ్రంథము లన్నిటిని అపారముగా పరిశోధనచేసిన 'కెరన్' పండితు డిట్లు వ్రాసెను. "నాగార్జునయతి కనిష్క-సభా సంవత్సరకాలమున జన్మించెనని, సాంప్రదాయము వచ్చుచున్నది. ఈయన మహాయానస్థాపకుడనుటకంటె, దానిని ప్రచారములోనికి తెచ్చినవాడనుట మేలు."[122] ఇంకొకచోట, మాధ్యమిక బౌద్ధమత ప్రబోధకుడు, 'నాగార్జునుడు' కనిష్క-ని మూడవ సభా కాలమున జన్మించెనని బౌద్ధులు చెప్పుదురు. ఈయన మహాయాన మతస్థుడగు బ్రాహ్మణ 'రాహులభద్రుని' శిష్యుడు. ఇంకను ఈ బ్రాహ్మణుడు, కృష్ణయోగికి ఎక్కువగా ఋణపడెను. ఇంకను అధికముగా గణేశునికి ఋణపడెను; (తారా 66, 69, 105) దానిని

[122] H. Kern–A Manual of Indian Buddhism P. 6.

బట్టి, మహాయాన మతము 'భగవద్గీత'నుండి కల్గినది." ఇంకను ఎక్కువగా 'శైవమతము'నుండి కల్గినది."[123]

ఇందులోని చాలవిషయములు, అనగా గురువుపేరు, మున్నగునవన్ని, సిద్ధనాగార్జునునికి సరిపోవుచున్నట్లు కాన్పించు చున్నవి. ఈసిద్ధనాగార్జునునిగూర్చి 'కెరన్'పండితు డెరుగ డాయెను. కనుక 'బోధిసత్వ నాగార్జునుని' జననము కనిష్క సభా కాలమున జరిగినదను ఒక్క విషయము మాత్రము గైకొందము.[124]

ఈకనిష్క-సభ ఎపుడుజరిగినదో తెలిసికొన్నచో మనము 'నాగార్జునుని' జననకాలమును జెప్పవచ్చును. కనిష్క-సభ 'వాసిలిఫ్' లెక్కప్రకారము క్రీ. శ. 120లో జరిగెననియున్నది. అప్పటికి కనిష్కుని రాజ్యారోహణ జరిగియుండలేదు. ఈకార ణమున నిది తప్పుగానున్నది.

ఆధునిక పరిశోధనలనుబట్టి క్రీ. శ. 125-153 మధ్య 'కని ష్కుడు' రాజ్యపాలన చేసినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 128వ సంవత్సర ప్రాంతమున శకారంభమైనట్లు తెలియుచున్నది. శకారంభమైన మూడేండ్లకు హిందూదేశముపై దండెత్తెను. కనుక దండయాత్రకాలము క్రీ. శ. 131 ప్రాంతము కావచ్చును. తూర్పురాజ్యములపై దండెత్తినపుడు 'పాటలీపుత్రరాజు,' (కుసుమపురరాజు) ఓడిపోయెను. చైనీయ గ్రంథములనుబట్టి

123 Ibid—P. 122

124 C. S. Srinivasachari — A History of India Part I.P. 150 "Nagarjuna was born at the time of Kanishka's council"

ఆరాజునుండి అశ్వఘోషుని బహుమానముగా దీసికొనెనని తెలియుచున్నది. అప్పటికి 'కనిష్కుడు' బౌద్ధుడుకాడు. తర్వాత ఒక 'పార్థియా'రాజు కనిష్కునిపైకి దండెత్తివచ్చెను. కాని రక్తపుటేరులు పారినతర్వాత శత్రురాజు ఓడిపోయెను. అశ్వఘోషు డంత కనిష్కునికి బౌద్ధధర్మము బోధించెను. అప్పటి నుంచి 'కనిష్కుడు' బౌద్ధుడాయెను.

'అశ్వఘోషుడు' నాటకకర్త, గొప్పపండితుడు; వైద్యుడు. ఈయన ఒకభిక్షువునకు భగందర రోగమునకు 'శల్యకర్మ' యను ప్రయోగముజేసెను. ఈభిక్షువు మాటలువిని కనిష్కుడు బౌద్ధధర్మదీక్ష గైకొనెను.

కాశ్మీరములో 'జలందరు' ఒద్ద (కుండలవనము) నాల్గవ బౌద్ధసభ (మహాసంగము) జరిగెను. మహాయాన గ్రంథములు ఆయనను గౌరవించెను. ఈసభలో 'పార్శ్వక, వసుమిత్రుడు' మున్నగువారు ముఖ్యులు. ఇచటనే మహావిభాషనామక త్రిపిటక భాష్యము తయారాయెను. వసుమిత్రు డీసభకు అధ్యక్షుడు. 'అశ్వఘోషుడు' ఉపాధ్యక్షుడు. చరక సుశ్రుతులీ కాలపువారని పలువురువిద్వాంసులు వ్రాసిరి. వసుమిత్రుడు బౌద్ధుల విజ్ఞానసర్వస్వకర్త, మహావిభాషకర్త. ఈసభాకాలమున నాగార్జునయతి జన్మించియుండెను.

'కనిష్కుడు' ప్రథమములో బౌద్ధుడుకాడు. ఇతని మొదటి నాణెములపై సూర్యచంద్ర ప్రతిమలు గ్రీకు, పర్షియా, హిందూ దేశములోని దేవతల ప్రతిమలు కాన్పించుచున్నవి. కడపటి నాణెములపై 'బుద్ధుని' బొమ్మ ఉండుటచేత బౌద్ధధర్మదీక్ష

గైకొన్నట్లు తెలియుచున్నది. కనుక రాజ్యారంభ కాలమునకు దాదాపు 10 సంవత్సరములకు అశ్వఘోషునివలన బౌద్ధధర్మ దీక్ష గైకొనుట మహాసంగము జరుపుట జరిగియుండవచ్చును. అనగా క్రీ. శ. 134వ సంవత్సరప్రాంతమున బౌద్ధుల నాల్గవ సభ జరిగినట్లూహించవచ్చును. ఇది 'నాగార్జునుని' జనన కాలమని నేను తలంచుచున్నాను. 'కెరన్' పండితుడు వ్రాసినట్లుగా ఒకానొక సంప్రదాయమునుబట్టి 'నాగార్జునయతి' 60 ఏండ్లు జీవించినట్లు తర్వాత 'సుఖావతి' కేగినట్లు తెలియుచున్నది. ఈకారణమున క్రీ. శ. 194లో నాగార్జునయతి మరణించినట్లు తెలుచున్నది. అంతిమదశలో యతి ఆకస్మికముగా నొకదినమంతయు సమాధిలోనుండి ధర్మవచనములు మాత్రము వినుచుండెనని, ఏరూపమును గాంచలేదని, ఒకదినమంతయు బయటకు రాలేదని, పిమ్మట శిష్యులు తలుపును బ్రద్దలుచేసి చూడగా యతి సమాధిలో ప్రవేశించి మరణించెనని, హిందూదేశములోని రాజ్యములన్నిటిలో ఆయన కాలయములు కట్టిరని, ఆయనను బుద్ధదేవుడుగా గౌరవించిరని 'ఎడ్కిన్సు' వ్రాసెను.[125] తలకోసికొన్న గాథలకంటె ఇది సత్యముగా గాన్పించుచున్నది. ఈయన పోషకుడగు యజ్ఞశ్రీ శాతకర్ణికూడ ఆసంవత్సరమే మరణించియుండవచ్చును. 'ఐటల్' పండితుడు నాగార్జునయతి మరణసంవత్సరము క్రీ. శ. 194 అని చైనీయాధారములచేత వ్రాసియుండెను. కనుక క్రీ. శ. 134లో 'నాగార్జునుడు' జననము పొంది, క్రీ. శ. 194లో మరణించియుండినట్లు పైచెప్పిన ఆధారములచేత నేనూహించుచున్నాను.

---

125. Joseph Edkins–Chinese Buddhism. P.77

12 మొట్టమొదటి 'అమితభసూత్రములు' చైనాకు క్రీ. శ. 147లో చేరియుండెను. 'తఖార'నుండి యొక్క మత గురువు 'అమితభసిద్ధాంతము'ల గైకొని పోయియుండెను. ఇవి చైనాలో క్రీ. శ. 148-170లో అనువాదమాయెను. నాగార్జునయతికూడ 'అమితభసూత్రముల' ప్రచారములోనికి తెచ్చి యుండెను. కనుక నాగార్జునుడు పై కాలములోనే జీవించియుండవలయును.

13 బౌద్ధమత శాఖలలో 1 వైభాషిక, 2 సౌత్రాంతిక, 3 యోగాచార, 4 మాధ్యమిక అను నాలుగు భేదములు గలవు. మాధ్యమిక శాఖాస్థాపకుడు నాగార్జునుడు. సౌత్రాంతిక శాఖను స్థాపించినవాడు 'కుమారలబ్ధుడు.' ఆర్యదేవ, అశ్వఘోషులు కూడ సమకాలీనులు అని 'కెరన్' వ్రాసెను.[126] వీరందఱు క్రీ. శ. 2వ శతాబ్దములోనివారు. అంతకు పూర్వులు కాజాలరు. నాగార్జునయతి మహాయాన మతప్రబోధకుడు. ఈమహాయాన గ్రంథములు చైనీయభాషలోనికి క్రీ. శ. 2వ శతాబ్దమునుండి అనువాదమగుచుండుటచేత, నాగార్జునుడు క్రీ. శ. 2వ శతాబ్దమునకు తరువాతవాడు కాజాలడు. క్రీ. శ. 160—194 మధ్యనే 'మహాయాన శాస్త్రము' రచించెనని, దానికి చైనీయ అనువాదము లేదని రిచర్డు వ్రాసెను."

14 గాంధారశిల్పము క్రీ. శ. 1—4వ శతాబ్దముల మధ్య లోనే భారతదేశములో వ్యాప్తిగాంచెను. నాగార్జునకొండపైన

[126]. H. Kern-Manual of Indian Buddhism, P 121.

గాంధారశిల్పము ప్రస్ఫుటమై యున్నది. ఈమధ్యకాలములోనే నాగార్జునయతి జీవించియుండెననుట నిర్వివాదాంశము.[127]

15 వసుబంధుడు సముద్రగుప్తుని సమకాలీనుడని, ఆయన కుమారుడు 'నాగార్జునునికి ఆరవతరమువాడని, జగ్గయ్యపేట, స్థూపములోని శిలాశాసనము క్రీ. శ. 5వ శతాబ్దములోనిదని ఇందు నాగార్జునుని ప్రశిష్యుని ప్రశంస గలదని, కె. ఆర్. సుబ్రహ్మణ్యన్ వ్రాసెను. ఇట్టి కొన్ని కారణములచేత మూడవ శతాబ్దిలోకూడ కొంతకాలము యతి జీవించినట్లు పైచరిత్ర కారు డభిప్రాయపడెను. కాని, పైవానికంటె మంచిప్రమాణ ములు లభించినపుడు ఊహలపై ఆధారపడు విషయములను వదలిపెట్టడము ధర్మము. అందుచేత యతి రెండవశతాబ్దాంత ములో శాతవాహనరాజు చనిపోయిన సంవత్సరములో మర ణించియున్నట్లు ఆధారములు లభించుచున్నవి. మూడవ శతా బ్దాదిని జీవించియున్న ఆధారములు లేవు. యతి 60 సంవత్స రములు జీవించెనని ఒకవిశ్వాసమైన ప్రమాణము లభించుట చేత నాగార్జునుని జననకాలము క్రీ. శ. 134 అని, మరణకా లము క్రీ. శ. 194 అని నిర్ణయించవచ్చును. 'ఐటలు' పండితుడు వ్రాసిన ఈకాల నిర్ణయము సరియని నేను తలంచుచున్నాను.

127. A. A. Macdonall – India's Past P. 64

# V

## నాగార్జునుని జన్మభూమి

నాగార్జునుని జీవితమునుగూర్చి, కాలమును, జన్మభూమిని గూర్చి 'వాటర్సు' వ్రాసినట్లు వాదవివాదములు లేక పోలేదు. పూర్వప్రకరణములలో కాలనిర్ణయమును చేయగల్గినాము. జన్మభూమినిగూర్చి నిర్ధారణ చేయువలసి యున్నది.

నాగార్జునరచిత గ్రంథములనుబట్టి, చైనీయ, త్రిపిష్టకదేశ లేఖకుల వ్రాతలనుబట్టి 'నాగార్జునుడు' నివసించిన కొండ జాడలు తెలియవచ్చుచున్నవి. దీనిపేరు 'పర్వతము' లేక శ్రీపర్వతము. ఇచటలభించిన యొక శాసనాధారమున, నీప్రదేశము నకు 'విజయపురి' యను పేరున్నట్లు తెలియుచున్నది. ఇచటి శిలాలేఖనములు క్రీ. శ. 3వ శతాబ్దినాటివి. ఈకొండపైన 'నాగార్జునయతి' 29 ఏండ్లు గడపెను. ఈ 'శ్రీపర్వతము' కర్నూలుజిల్లాలోని 'శ్రీశైలమే' యని 'బర్గెసు', వీరభద్రరావు, మున్నుగాగల పాశ్చాత్య, పౌరస్త్య విద్వాంసు లభిప్రాయపడిరి.[128] ఆధునిక పరిశోధనలనుబట్టి, 'నాగార్జునుడు' నివసించిన శ్రీపర్వతము, పల్నాటితాలూకాలోని 'మాచెర్ల'కు ఉత్తరముగా 14 మైళ్ల దూరమున నున్న 'నాగార్జునకొండ' యని తేలుచున్నది. టిబెటీయులు వ్రాసిన యతి నిర్వాణస్థల మిదియే; ఈపర్వతమును మొదట వర్ణించినవాడు 'ఫాహియాను' అను (క్రీ. శ. 405-411) చైనీయ పరివ్రాజకుడు. ఈయాత్రికుడు దక్షిణాపథము

---

[128] T. Watters,-On Yuan Chwang's Travels Vol II P. 208.

రాకపోయినను, కొండనుగూర్చి విని వ్రాసియుండెను.[129] ఈపర్వతమే పారావతముగా మారియుండెనని, 'గైల్సు' పండితు డభిప్రాయపడెను కాని, సంఘారామములోని పై యంతస్థు పారావతాకారమున నుండుటచేత, ఈసంఘారామమునకు 'పారావత సంఘారామము' (Pigeon Monastery) అని పేరువచ్చెనని ఊహింపవచ్చును. 'పాహియాను' వర్ణించిన పో-లో-యూ వర్ణనలనుబట్టి, నాగార్జునకొండయే యగుట నిర్వివాదాంశము.

'హూయానుత్సాంగు' (క్రీ. శ. 629–645) అను మరియొక చైనీయయాత్రికుడు స్వయముగా దక్షిణాపథమునకు వచ్చి ఈకొండను వర్ణించెను. నాగార్జునుని గ్రంథాలయమును వర్ణించెను.[130] ఇచటనే నాగార్జునుని ఆశ్రమ ముండెను.

శ్రీశైలము ఒద్ద నిట్టి ఏర్పాట్లుగాని, గదులుగాని లేవు. కనుక 'నాగార్జునుడు' టిబెటీయకథలను బట్టి, జీవితకాలములో 'చాలభాగ మీకొండపైన గడపినట్లు, ఇచ్చటనే మరణించినట్లు తెలియుచున్నది. ఇచ్చట కొండపైన త్రవ్విచూడగా, అనేక శిల్పములు విగ్రహములు బయల్పడినవి.

నాగార్జును డమరావతీస్తూపమునకు బయట ప్రాకారమును గట్టించెనని టిబెటీయ చరిత్రకారుడు 'తారానాథుడు' వ్రాసెను. దీనినిజూచి కొందరీయన జన్మస్థలము 'అమరావతి'

---

129. James Legge – Travels of Pahiyan. P. 96

130. T. Watters — On Yuan Chwang's Travels P. 200–201.

యనిరి. ఈయతి హెచ్చుకాలము గుంటూరుమండలములోనే యున్నట్లు కాన్పించుచున్నది. ఈయనకాలమున 'నాగార్జున కొండ' ధాన్యకటకమేలు, శాతవాహనరాజ్యములో నుండెను. ఈకొండపైననే ఈయతి మరణించెను. మరణించినచోటు శ్రీపర్వతమని పేర్గాంచినది ఈకొండయే. జన్మభూమి విషయములో తగాదాలు గలవు. ఈయతి నాలందాలో చాల కాలము గడపెనని టిబెటీయుల విశ్వాసము.

ఈయన దక్షిణహిందూస్థాన బ్రాహ్మణుడని ఎల్లరంగీకరించిన విషయమే. తమిళులు కొందరు 'కంచి' జన్మస్థానమని వ్రాసిరి. హూనుత్సాంగు వ్రాతలనుబట్టి, నాగార్జునుడు నిర్దుష్ట రసశాస్త్రవేత్తయని, పరుసవేది యనగా రాలను బంగారుగామార్చు విద్య యెఱింగినవాడని, ఈయన జన్మభూమి 'విదర్భనగరము' ('బీరారు') అని తెలియుచున్నది.

'కథాసరిత్సాగరము' సోమదేవ రచితము. క్రీ. శ. 1063-1081 మధ్యకాలమున రచింపబడినది. ఇది క్రీ. శ. 6వ శతాబ్దమునకు బూర్వమే రచింపబడిన 'గుణాఢ్య' పండితుని 'బృహత్కథ' ననుసరించి వ్రాయబడినది. దండి, సుబంధు, బాణులు ఈబృహత్కథను పేర్కొనిరి. ఈ 'బృహత్కథ' ననుసరించి క్లుప్తముగా క్రీ.శ. 1037లో 'క్షేమేంద్రుడు' 'బృహత్కథా మంజరి'ని రచించెను. కథాసరిత్సాగరము ననుసరించి ఈక్రిందికథ తెలియుచున్నది. "చిరాయు నామముతో ప్రసిద్ధిగాంచిన ఒక నగరములో 'చిరాయు'నామముతో ఒకరాజుండెను. ఆయన ఆయుస్సు దీర్ఘమైనది. ఆయన మంత్రి నామము

'నాగార్జునుడు'; ఆయన రసాయనిక శాస్త్రవేత్త. చిరాయు రాజుకు, ఆయన ఒకరకమైన 'రసాయనిక పదార్థము' సేవించుట కొసంగెను. దీనిచేత రాజు దీర్ఘజీవి యాయెను. నాగార్జునుని జన్మ బోధిసత్వుని అంశలోనుండియే కల్గెను." దీనిని బట్టి 'చిరాయు నామక నగరము'లో నాగార్జును డుండెనని తెలిసికొనవచ్చును. కాని ఈనగర మేదియో మాకు తెలియకున్నది. దీనిజాడ 'డాక్టర్ కనింగ్ హాము' రచిత ప్రాచీన భూగోళ శాస్త్రమున కూడ కాన్పించలేదు. 'లామాతారానాథుని' (క్రీ. శ. 1573 జననము) వ్రాతలప్రకారము 'నాగార్జునుడు' బ్రాహ్మణుడని, దక్షిణదేశములోని 'విదర్భనగరము'లో జన్మించెనని తెలియవచ్చుచున్నది.[131] ఇతర టిబెటీయ ఉపాఖ్యానములనుబట్టి కూడ నాగార్జునుని జననము, విదర్భనగరములోనని తెలియుచున్నది.

టిబెటీయ, చైనీయ గాథలనుబట్టి నాగార్జునుని జీవితచరిత్ర వ్రాసిన 'వాలెసర్' (Walleser) కూడ నాగార్జునుని జన్మభూమి 'విదర్భ' (Berar) అని వ్రాసెను. 'కనింగ్ హాము' పరిశోధనల ప్రకార మీ'విదర్భనగరము' వర్తమాన 'నాగపూరు' అని తెలియుచున్నది.

ప్రసిద్ధ ఐతిహాసిక లేఖకుడు, 'అల్బరూని' (క్రీ. శ. 1030) 'గజనీముహమ్మదు'తో వచ్చిన చరిత్రకారుని వ్రాతలనుబట్టి చూడగా, 'నాగార్జునుడు,' సోమనాథకు దగ్గరగానున్న 'దైహక కోట' (Fort Daihak) వాస్తవ్యుడని, ఆయన రసశాస్త్ర

[131] Bhupendranath Dutta-Mystic Tales of Lama Taranatha P. 2.

వేత్త యని, దానిలో ఆరితేరినవాడని, రసశాస్త్రమను గ్రంథము రచించెనని, తెలిసికొందుము.[132] కాని ఈవ్రాతలు నిరాధారములు. దీనికి తగుప్రమాణములు లభించకున్నవి. 'ప్రఫుల్లచంద్రరాయ్' దీనినిజూచియే నాగార్జునుని జన్మభూమి 'దైహాకకోట'యని వ్రాసెను. కాని ఇది 'సిద్ధనాగార్జునుని' జన్మ భూమి కావచ్చును.

'జయచంద్ర విద్యాలంకారు' అను ప్రసిద్ధచరిత్రకారుడు 'భారతదేశకే అమరరత్న' యనుగ్రంథమున నాగార్జునుని వాస స్థలము, దక్షిణకోసలలోని 'ఛత్తీసుగఢ' యని వ్రాసెను. ప్రాచీనకాలములో దక్షిణకోసలకు ముఖ్యనగరము 'ఛత్తీసుగఢ' యని, ఉత్తరకోసలకు 'శ్రావస్తి' ముఖ్యనగరమని తెలియుచున్నది. 'ఫెర్గుసన్, గ్రాంటు మున్నగువారు 'ఛత్తీసుగఢ' యనగా కోసల యని' 'వైరఘురు' దీని ముఖ్యనగరమని వ్రాసియుండిరి. (Y. R. A. S. 1875-P. 260. Watters. P. 202) 'బీహారు'కు దక్షిణమునఉన్న దక్షిణ(దక్కను) రాజ్యములో 'నాగార్జునుడు' జన్మించెనని, 'ఐటలు' పండితుడు వ్రాసెను. ఈయన దక్షిణహిందూస్థానములో బ్రాహ్మణకుటుంబములో జన్మించెనని, అచట బౌద్ధమతము బోధించెనని జి. కె. నారాయణ వ్రాసెను. ఈయన దక్షిణహిందూస్థాన బ్రాహ్మణుడని 'ఆర్థర్ లాయడ్' వ్రాసెను. 'నాగార్జునుడు' దక్షిణ హిందూదేశీయుడని, 'జోసఫ్ ఎడ్కిన్సు' వ్రాసెను. 'పశ్చిమ హిందూస్థానము' జన్మభూమియని కొందరు వ్రాసిరి. ఇది

132 Sachua — Alberuni's India. Chap XVII P 189.

'సిద్ధనాగార్జునుని' జన్మభూమి కావచ్చును'; ఈయన దక్షిణ హిందూస్థానవాసియని, విధర్భనుండి వచ్చెనని దక్షిణకోసల ముఖ్యనగరములో నివసించెనని, 'వింటర్‌నిట్జ్' వ్రాసెను. 'విలియంగమ్మెల్', నాగార్జునుడు పశ్చిమహిందూదేశీయుడని, ఒక అర్జునవృక్షముక్రింద యోగిగా నివసించెనని, అందుచేత ఈపేరు కల్గెనని, ఆఖరుజీవితము కోసలలోని సంఘారామములో గడపెనని, క్రీ. శ. 194లో చనిపోయెనని వ్రాసెను. ఈప్రకారము నాగార్జునుని జన్మభూమి 'పడమటి హిందూస్థానము' లోని 'దైహాకు' గ్రామమని కొందరు వ్రాసిరి. రెండు ప్రమాణములనుబట్టి దక్షిణహిందూదేశములోని విదర్భ (కోసల) జననమని, త్రివిష్టప వాసులప్రకారము బహుకాలము 'నాలంద'లో గడపెనని తెలియుచున్నది.

'ఐటలు పండితుడు' నాగార్జునయతి పశ్చిమహిందూస్థాన యతి యని, తర్కవాదములలో ప్రసిద్ధికెక్కెనని, దక్షిణ హిందూస్థానమున కేగెనని, కోసలదగ్గర ఒకసంఘారామములో దనతలను గోసికొనెనని వ్రాసెను. దక్షిణకోసలలో జాలకాల ముండెనని, 'బీల్ పండితుడు' వ్రాసెను. రేవా (నర్మదా) తీరమందు శాంతినికేతనమను ఒకసుందరమగు ఆశ్రమములో నీయతి చాలకాల ముండెనని, 'సిద్ధవినోదనమను గ్రంథము' తెల్పుచున్నదని ఈమధ్య ఎవరో వ్రాసిరి. నేనీగ్రంథమును జూడలేదు. ఆపండితు డుదాహరించిన శ్లోకమిది.

శ్లో॥ సిద్ధనాగార్జునో నామపురాఽసీత్ తాపసోమహా
శాంతో దాంతో జితాత్మా చనియతః ప్రయతశ్శుచిః

ఉవాస సచిరం సోఽపి రేవాతీరే మనోరమే
శాంతినికేతనే తత్ర ఆశ్రమే చిత్తహారిణి ॥

కాని ఇందు వ్రాయబడినది 'సిద్ధనాగార్జును'ని గూర్చి యని వేరుగా జెప్పనక్కరలేదు. 'సిద్ధనాగార్జునుడు' వేరు, నాగార్జున యతి వేరు; కాన మన 'నాగార్జునయతి' నర్మదాతీరమున మనోజ్ఞమైన ఆశ్రమములో నివసించిన ఆధారములు లేవు. ఈప్రకారము నాగార్జునుని జన్మభూమి 'అమరావతి'యని 'దయ హాక్కు'అని 'కోసల'యని, శ్రీపర్వతమని, విదర్భయని వాదోపవాదనలుగలవు. 'కుమారజీవుడు'అందరికంటె ప్రామాణికుడు. ఆయన వ్రాతలనుబట్టి, 'హూనుత్సాంగు' వ్రాతలనుబట్టి 'నాగార్జున యతి' దక్షిణహిందూస్థాన బ్రాహ్మణుడని, జన్మభూమి విదర్భ నగరమని తెలియుచున్నది. కనుక ఇతనిజన్మభూమి ఆధునిక'నాగపూరు' అని తెలిసికొనవచ్చును. అది మధ్యరాష్ట్రములలో నున్నది. యతి చాలకాలము నాగార్జునకొండపైన సంఘారామమును నిర్మించి, అందు బహుకాలముండెను. అందుచే 'నాగార్జునుడు' ఆంధ్రుడుగా జన్మించక పోయినను, ఆంధ్రదేశములో చాలకాలము గడపియుండెను. ఈవిషయములో నేను సుబ్రహ్మణ్యన్ అను చరిత్రకారుని అభిప్రాయముతో నేకీభవించక తప్పలేదు. [133]

అదియునుగాక 'హూనుత్సాంగు' కళింగను, దక్షిణకోసలను, అంటోలో, (ఆంధ్ర) ధనకటక దేశములను వేరు

[133] K.R. Subrahmanyan-Andhra History P. 54. "So Nagarjuna, a subject of the Satavahana king, as we shall see presently, lived

వేరుగా వర్ణించెను. ఇందుచేత నాగార్జునుని జన్మభూమి దక్షిణకోసలలోని విదర్భ (Modern Nagpur) యని, అది మధ్యరాష్ట్రముల లోనిదని తెలిసికొనవచ్చును. కనుక 'నాగార్జునయతి' మధ్యరాష్ట్రములలో జన్మించి, ఆంధ్రదేశములో జీవితమును గడపుకొనెను. 'అమరావతి' బయటప్రాకారమును గట్టించుచు కొంతకాలమట నుండెను. 'శ్రీపర్వత'మనగా 'నాగార్జునకొండ' యే యని తేలినది. 'కోసల, విదర్భ' మున్నగునవి దేశములపేర్లు. కనుక ఇవియన్ని ఒకే ప్రదేశమును దెల్పుచున్నవి. 'డయహాక్షు' అనునది 'ఘూర్జర' దేశములోనిది; అచట 'సిద్ధనాగార్జునుడు' జన్మించియుండవచ్చును; నర్మదానదీ తీరమున 'శాంతినికేతనమను ఆశ్రమ మేర్పరచుకొన్నదీయనయే కావచ్చును. 'నాగార్జునుడు,' కాశ్మీర రాష్ట్రకన్యమున ఆరు దినము లుండెనని 'రాజతరంగిణి' తెల్పుచున్నది. కాని యే 'నాగార్జునుడో' తెలియకున్నది. కనిష్కుని అనంతరము, అభిమన్యుని కాలములో మనయతి, కాశ్మీరములోని బౌద్ధమతాభివృద్ధిని విని, అచటకు జనెనేమో తెలియకున్నది; 'నాలందా'లో అధికకాలము గడపినవాడు, సిద్ధనాగార్జునుడు' కావచ్చును. ఏలనన, మన 'నాగార్జునయతి' కాలములో నాలందా విద్యాలయస్థాపన జరిగియుండలేదు. క్రీ. శ. 7వ శతాబ్దమునాటికి, అనగా సిద్ధనాగార్జునుని కాలమునాటికి, అది ఉచ్ఛస్థితిలో నుండెను. అందుచేత 'సిద్ధనాగార్జునునికి' నాలందా విద్యాలయము'తో సంబంధ మున్న ఉండవచ్చును.

---

mostly in Andhra and was a naturalized, if not a born Andhra."

మన 'నాగార్జునయతి' బౌద్ధభిక్షువైన తర్వాత లంకకు బోయి అచట కొన్నాళ్లు బౌద్ధసంఘారామములో నుండి ప్రజ్ఞాపరిమితసూత్రములను, బుద్ధుని అస్థికలనిచ్చెను, గైకొని వచ్చి, పదివేలమంది ద్విజులను రాజును భిక్షువులుగా జేసి, శ్రీపర్వతముపైననే తన జీవితశేషమంతయు గడపినట్లు తెలియుచున్నది. 'హూనుత్సాంగు' నాగార్జునుడు మొదట దక్షిణకోసలకొక్క ముఖ్యనగరమునకు దగ్గరగానున్న సంఘారామములో నివసించెనని, అది ఒకప్పుడు కృష్ణవరకు వ్యాపించె నని, తర్వాత ఈయతి పో—లో—మో—లో-కి—లీ పైన నుండె నని, ఇది యొక పర్వతమని, వ్రాసెను; ఇటీవల దొరకిన శాసనములబట్టి ఇది 'నాగార్జునకొండ' యని తేలినది. ఈయతి ఆంధ్రదేశములో జన్మించకపోయినను ఆంధ్రదేశములో దీర్ఘకాల ముండెనన్నమాటలో సందియములేదు. యతి కొండపైననే ప్రయోగశాలను సర్వకళాపరిషత్తును గ్రంథాలయ మేర్పరచుకొని కాలమును గడపుకొనెను. ఈగ్రంథాలయమునందు పిటకములు, బౌద్ధుల శాస్త్రము లుండెను. రేవా (నర్మదా) నదీ తీరమునకుగాని, నలందాకుగాని, కాశ్మీరమునకు గాని పోయి ఉన్న ఆధారములు హెచ్చుగా లభించకున్నవి. కనుక ఉత్తర దేశసంచార విషయము మేమేమియు ధృఢముగా చెప్పజాలకున్నాము. 'ఆర్థర్ లాయడ్' దీర్ఘకాలము పరిశోధనలుసలిపి, కోసలలో, అనగా దక్షిణహిందూస్థానమునకు ఉత్తరభాగములో యతి మరణించెనని వ్రాసెను. శ్రీపర్వతము పైననే యతి మరణించినట్లు మనము ధృఢముగా విశ్వసించవచ్చును.

# VI

## నాగార్జునుని కులము

'నాగార్జునుడు' దక్షిణ హిందూస్థాన బ్రాహ్మణుడని, 'విదర్భ వాసి' యని సమకాలీన ప్రమాణము లన్నియు దెల్పు చున్నవి. 'కుమారజీవుడు' బ్రాహ్మణుడే యనెను. 'ఆర్థర్ లాయడ్' మున్నగు ప్రసిద్ధపండితు లెల్లరు దీని నంగీకరించిరి. కాని కొందరీయనను క్షత్రియుడని వ్రాసిరి. 'రాజతరంగిణి' లోని యొకశ్లోకమునుబట్టి, ఈయన భూమీశుడని, కొందరు పండితు లనుమానించిరి; కాని ఇది సరికాదు. 'రాజతరంగిణి కర్త కల్హణుని' అభిప్రాయము నీపండితులు గమనించరైరి. నాగార్జునుడొక బోధిసత్వుడని, ఒక భూమి కధిపతియని, (రాజత—ఏకో భూమీశ్వర) అందున్నది. అనేక మహాయాన శాస్త్రములలో గూడ నిట్లే చెప్పబడియున్నది. ఈవాక్యములు అతని క్షత్రియత్వమును సూచించవని, 'వాటర్సు' అభిప్రాయముతో నేను ఏకీభవించుచున్నాను.[134]

బుద్ధుని మేనమామయగు 'నాగార్జునుని' దత్తుపండితుడు పేర్కొనెను. గౌతముడు శాక్యవంశజుడగు క్షత్రియుడగుటచేత, ఈనాగార్జునుడుకూడ క్షత్రియుడే కావచ్చును. కాని క్రీ. పూ. 5వ శతాబ్దములోని బుద్ధుని మేనమామ నాగార్జునునికి, క్రీ. శ. 134-194 మధ్యనున్న మన నాగార్జున యతికి ఎట్టిసంబంధము లేదు; కాన మనయతి క్షత్రియుడు కాజాలడు.

---

134. Watters-On Yuan Chwang's Travels Vol II - P. 206.

కొన్నిచోట్ల మన 'నాగార్జునయతి'కి శాతవాహనరాజులతో బంధుత్వము చెప్పబడినది. 'శాతవాహనరాజులు' బ్రాహ్మణులే కాని, క్షత్రియ వంశోద్భవులు గారు. కనుక మన నాగార్జున బోధిసత్త్వుడు, ఆంధ్ర శాతవాహనరాజుల బంధువే యనుకొన్నను, బ్రాహ్మణుడే యగుచున్నాడు కాని, క్షత్రియుడు కావాలదు.

కనుక 'రాజతరంగిణి'లోని శ్లోకమును అపార్థము చేసికొని పండితు లీతని క్షత్రియుడని చెప్పుట పొరపాటు; ఈయతి జీవితకర్త కుమారజీవుడే బ్రాహ్మణుడని వ్రాయుచుండ, మన పండితు లీయనను విచారింపకుండ, క్షత్రియుడని వ్రాయుట అపభ్రంశమగును కదా! 'హానుత్సాంగు' కూడ బ్రాహ్మణుడే అనెను. క్షత్రియుడను జనశ్రుతిని 'స్టెయిన్' పండితుడుకూడ నిరాకరించెను. 'వింటర్ నిడ్జ్' కూడ 'విదర్భ(Berar) బ్రాహ్మణుడని, మాధ్యమికశాఖ స్థాపకుడని, మాధ్యమిక సూత్రకర్తయని, శూన్యవాదియని వ్రాసెను. 'మాక్డనాలు'కూడ బ్రాహ్మణుడే యనెను. క్షత్రియుడని ఏప్రామాణికుడు అంగీకరించలేదు; కాన బ్రాహ్మణుడనుట నిశ్చయము.

# VII

1 నాగార్జునునిజననము—బాల్యము—యౌవనము—విద్య. 2 నాగార్జునుడు యౌవనములో వ్యభిచారి. 3 బౌద్ధమత దీక్ష. 4 దేశసంచారము. 5 నాగార్జునుడు ఎల్లిజండాను బట్టుకొని తిరుగుట.

## 1. నాగార్జునుని జననము

పైపరిశోధనలను బట్టి క్రీ. శ. 134వ సంవత్సరమున విదర్భ నగరమున (Modern Nagpur) నాగార్జునుడు బ్రాహ్మణ కుటుంబమున జన్మించినట్లు తెలియుచున్నది. పుట్టిన 7వ సంవత్సరములోనే మరణగండమున్నదని జ్యోతిషశాస్త్రవేత్తలు చెప్పిరి. కాని ఆమారక మెట్లో తప్పిపోయెను.

ఈయనతండ్రి గొప్ప శాస్త్రవిదుడు. నాగార్జునుడు కూడ మంత్ర, తంత్ర శాస్త్రముల నేర్చెను. చిన్నతనములోనే నాల్గువేదములను, సమస్తశాస్త్రములను సాంగోపాంగముగ నేర్చెను. మంత్రవిద్యచేత ఒక్కొక్కప్పు డదృశ్యరూపమును దాల్చుచుండెనట!

'మంజూశ్రీమూల తంత్రము'లో 'శాక్యముని' తన తర్వాత 400 ఏండ్లకు 'నాగార్జునుడు' జన్మించునని కలదు. పంచక్రమలోని ఆరుభాగములలో అయిదుభాగముల కీయన కర్తయని చెప్పబడును. అది యోగమును గూర్చి తెల్పుచున్నది.[135]

ఇంకను 'లంకావతారసూత్రము'ను బట్టి చూడగా నాగార్జునుని పుట్టుక, భవిష్యత్తు చెప్పబడినది. దీనిలో బుద్ధుని

---

[135] G. K. Narayana-Literary History of Sanskrit Buddhism P. 120.

తర్వాత 600 ఏండ్లకు నాగార్జునుడు జన్మించునని కలదు. ఈ దేశములోని దక్షిణభాగములో అనగా 'వేదలి'లో ఒక గొప్ప ధీశాలియగు భిక్షువు 'నాగాహ్వయుడనువాడు' జన్మించును. ఆయన 'ఉనికి' విషయసంబంధమగు మతమును నాశనముచేయ ప్రబోధించును. ఆయన ప్రపంచములోనే యుండి, సాటిలేనట్టి 'మహాయానమతము'ను వృద్ధిచేసి, ఆనందస్థితిని పొంది, సౌఖ్యమగు భూమిలో ప్రవేశించును.[136] (పే 163-166) నాగార్జునునికి బదులు 'నాగాహ్వయుడని' కలదు. సంస్కృతగ్రంథములో 'నాగార్జునునికి బదులు నాగాహ్వయుడని యున్నది. ఇరువురు ఒకటియా, లేక వేరువేరా అను విషయము సందేహముగా నున్నదని కొందరుపండితులు వ్రాసిరి. కాని నాగార్జునునికి నాగాహ్వయుడని పేరున్నట్లు కాన్పించుచున్నది. ఇందలి 'వేదలి' విదర్భయేమో! కానిచో జన్మభూమిని మార్చవలసి వచ్చునా! తమిళులు కొందరు 'కంచి'దగ్గర 'నాగార్జునుని' జననమని వ్రాసిరి. కీత్ ఇట్లువ్రాసెను. "మహాయాన బౌద్ధుడు ప్రసిద్ధగురువగు 'నాగార్జునుడు'మాగౌరవపాత్రుడగుచున్నాడు. ఏలననగా 'బుద్ధుడు' ఐదుశతాబ్దములకు పూర్వమే నాగార్జునుడవతరించునని, బోధించునని భవిష్యత్తు చెప్పియుండెను."[137] కనుక నాగార్జునునిజన్మమునుగూర్చి 'బుద్ధుడు' చెప్పినట్లు బౌద్ధగ్రంథములు నుడువుచున్నవి. సత్యము తెలియదు.

---

136 D. T. Suzuki—Studies in the Lankavatharasutra. P. 24-

137 A. B. Keith—Buddhist Philosophy in India and Ceylon. P. 34.

నాగార్జునుడు మొదట బ్రాహ్మణమతస్థుడు; శైవుడని కొందరు వ్రాసిరి. సంస్కృతమును నేర్చెను. బ్రాహ్మణ శాస్త్రములు, విద్యలన్ని నేర్చుకొనెను. తర్వాత హీనాయాన మతస్థుడు. పిమ్మట మహాయాన బోధకు డాయెను. కంచిలోని తారవలననో, నాలందాలోని, చండికవలననో ఈయన సిద్ధి పొందెనని ఒకరు వ్రాసిరి.

'నాగార్జునుడు' ఏకసంథాగ్రాహి. ఒకానొక బ్రాహ్మణుడు లక్షగాథల గ్రంథమును వ్రాసినపుడు బోధించుటకు కూడ వీలులేనట్టి యాగ్రంథమును 'నాగార్జును' డంతయు ఒకసారివిని యర్థము చేసికొనగల్గెను. 'కణదేవుడు' రెండుసార్లు విని యర్థము చేసికొనగల్గెను. ఈయన ద్విసంథాగ్రాహి.[138] ఈయన నాలుగువేదములు చదివెనని, అన్నిశాస్త్రము లెరింగెనని, మాంత్రికుడని, పైగ్రంథకర్త నుడువుచున్నారు.[139] మొత్తము మీద 'నాగార్జునుడు' యౌవనము వచ్చునప్పటికి, వేదశాస్త్రములను పూర్తిచేసి శీఘ్రముగా విద్వాంసుడు, కవి, తత్త్వవేత్త యైనట్లు తెలియుచున్నది.

## 2. నాగార్జునుడు యౌవనములో వ్యభిచారి

ఈయన సత్యాన్వేషణుడు. హీనాయాన బౌద్ధమతము వైపు చూపును ప్రసరింపజేసెను; కాని విశ్రాంతి చిక్కియుండలేదు. యౌవనములో దుర్వ్యసనపరుడై సంచరించిన యాధారములు లభించుచున్నవి.

---

[138] Rev. Joseph Edkins–Chinese Buddhism P. 78.

[139] Ibid – P. 79:

ఈయన మంత్రవిద్య నెఱింగినవాడగుటచేత ముగ్గురుమిత్రులను దోడ్కొనిపోయి రాజమందిరములో ప్రవేశించెను. అంతఃపుర స్త్రీలను జెరచుచుండెను; అకస్మాత్తుగా ఈవిషయమును రాజోద్యోగులు గనిపెట్టిరి; అంతట మిగత ముగ్గురు స్నేహితులను ఉరితీసిరి; నాగార్జునుడు మాత్రము ప్రాణము దక్కినచో, బౌద్ధభిక్షువు నగుదునని ప్రమాణముచేసెను. ఆవాగ్దానప్రకారము బౌద్ధభిక్షువై పసుపువస్త్రములను ధరించెను.[140] ఇట్టియతి ప్రమాణమును నెరవేర్చెను.

3. బౌద్ధమతదీక్ష గైకొనుట.

'కపిమల'యనే గురువునొద్ద బౌద్ధధర్మదీక్ష గైకొనెను. కొందరీయన మొదట జైనధర్మము గ్రహించెనని, తరువాత 'బౌద్ధధర్మము' స్వీకరించెనని వ్రాసిరి; కాని బ్రాహ్మణధర్మము వదలి సంపూర్ణముగా బౌద్ధధర్మము స్వీకరించెననుటకు ఆధారములు గలవు. ఈయన బాల్యమునుగూర్చి, బౌద్ధధర్మదీక్ష గైకొన్న వృత్తాంతములనుగూర్చి, 'టిబ్బతీ ఉపాఖ్యానముల'లో వేరువేరు కథలు కాన్పించుచున్నవి. అవి యిట్లున్నవి. "విదర్భ నగరములో నొకధనికుడౌ బ్రాహ్మణుడుండెను. చాలదినముల

---

140 M. Winternitz —A History of Indian Literature Vol II—P, 342.

H. H. Coates-Honen-The Buddhist saint-P 209.

G. K. Narayana-Literary History of Sanskrit Buddhism, P. 92.

వరకు ఆయనకు సంతానము లేదు. ఒకరాత్రి ఆయన స్వప్నములో దీనిని జూచెను. "నూరుమంది బ్రాహ్మణులకు భోజనమును బెట్టుచో వానికొక పుత్రుడుగల్గును." పుత్రుడు (నాగార్జునుడు) కల్గినతర్వాత, వాని తలిదండ్రులు పెద్దపెద్ద జ్యోతిష శాస్త్ర పండితుల రావించి, భాగ్యగణన చేయసాగిరి. వారిట్లు వచించిరి. "నాగార్జునుని మాతాపితలు ఇంకను నూరుమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టించినచో, నింకను మరి ఏడు వర్షములు ఆయుర్వృద్ధి యగును; లేనిచో ఆయుర్దాయము లేదు." ఏడేండ్లు గడచు వయస్సు వచ్చినతర్వాత, నాగార్జునుని జననీజనకు లాయన మృత్యువును తమ కండ్లఎదుట చూడజాలక బాలకుని ఒక నిర్జనవనములో వదలివైచి వచ్చిరి. బాలకుడైన నాగార్జునుడు అనేక దినములవరకు, దుఃఖముతో గాలమును గడపెను. ఈసమయములో 'మహాబోధిసత్త్వ అవలోకితేశ్వరుడు' పిల్లవానిచెంతకు వచ్చి, ఇట్లు చెప్పెను. "నీవు మృత్యుగహ్వరమునుండి విడుదలకాగోరినచో మగధలోని నలేంద్రవిహారమున కేగుము." అంతట బాలకుడు నలేంద్రవిహారమునకు వచ్చెను. అచట విహారాధ్యక్షుడు 'శ్రీసరహాభద్రుడు' నాగార్జునుని ప్రవ్రజితుని జేసెను.

ఆసమయముననే 'మగధ'లో దుర్భిక్షము సంభవించెను. ఈక్షామములో నావిహారముకుకూడ చాలకష్టము గల్గెను. విహారాధ్యక్షు డిదిచూచి చాలచింతించెను. నాగార్జును డిట్లు నిశ్చయించెను. "నేను మహాసముద్రముయొక్క ఒడ్డుకేగి, రసాయనవిద్య నేర్చి, తిరిగివచ్చెదను. ఈదుర్భిక్షము పోగొట్టె

దను.” మహాసముద్రముయొక్క తీరమున నొక చిన్న ద్వీప ముండెను. దానిలో నొకసాధువు రసాయనవిద్యను లెస్సగా నెరింగినవాడు నివసించుచుండెను. నాగార్జును డచటికి జేరెను. ‘నాగార్జునుడు’ రసాయనవిద్యాశిక్షను బొందుటకు ఇచ్ఛ ప్రకటించినవెంటనే, ఆసాధువు కూడ నాగార్జునుని యొద్ద సమ్మోహనవిద్య నేర్చుట కభిలాష కన్పరచెను. ఉభయులు నొకరివిద్యల నొకరు నేర్చిరి. ‘నలేంద్రవిహారము’నకు దిరిగి వచ్చిన తర్వాత, నాగార్జునుడు నికృష్టతమధాతువుల, స్వర్ణ ములోగలిపి దుర్భిక్షమును బోగొట్టెను. తరువాత నాయన ఉత్తరకురుభూములలో సంచారమొనర్చి, తన జన్మస్థానము నకు జేరెను. అచట అనేకచైత్యముల, విహారముల నిర్మించెను. ఆయన ‘విజ్ఞానశాస్త్రము, భేషజవిద్య, జ్యోతిర్విద్య, రసాయన శాస్త్రము’యొక్క పరిశోధనలు, ప్రచారము జేసెను. ‘శ్రీనరహా భద్రుడు’ చనిపోయిన తర్వాత, ఆయన నలేంద్రవిహారమునకు ప్రధానాధ్యక్షు డాయెను. అచ్చోట ఆయన మాధ్యమిక దర్శనమును ప్రతిష్ఠచేసెను.”

ఈకథ ‘సిద్ధనాగార్జును’నికి సంబంధించినట్లు కాన్పించు చున్నది. గురువు ‘శ్రీనరహాభద్రు’డనుట నలేంద్రవిహారముతో సంబంధము చెప్పుటచూడగా ఈకథతో బోధిసత్త్వ నాగార్జు నునికి సంబంధములేదని చెప్పవచ్చును.

## 4. దేశసంచారము.

తొంబది దినములలో నాగార్జునుడు త్రిపిటకములు జదివెను; వాని యర్థమునంతను సంపూర్ణముగా గ్రహించెను; వానితో

నాయన తృప్తిపడకుండెను; ఇతరసూత్రముల వెదకుట కారం భించెను; కాని చివరకు 'హిమాలయాపర్వతముల'లో నొక గొప్ప వృద్ధయోగి యొద్దనుండి 'మహాయానసూత్రముల' గైకొనెను. నాగరాజను, నాగులచక్రవర్తి సాయముచేత ఆసూత్రముపైన ఒక వ్యాఖ్యను గూడ గైకొని వచ్చెను. మహాయానమువలన విశేషమగు ఖ్యాతిగాంచెను."[141]

జపానీయ లేఖకుడగు 'తాడకానే' (Tadakanae) వ్రాత ప్రకారము, నాగార్జునుని మొట్టమొదటియాత్ర, ఆది బుద్ధుని పీఠమున కని, అచట 'అమితాభ' ఉండెనని, అచట 'మహా నాగబోధిసత్త్వుని' పరిచయము గల్గెనని, 'ధైర్య' అతనికి మతము బోధించెనని, తర్వాత నాగులభవనమునకు గైకొని పోయెనని, అది సముద్రములో నుండెనని, అచట మతమునకు, జ్ఞానమునకు నిధివంటివారు కనబడి నాగార్జునునికి బోధించిరని, వారిబోధను దీర్ఘకాలమునుండి దాచియుంచిరని, దాని నిపుడు యతికి ఒసంగిరని తెలియుచున్నది.

పూర్ణమగు 'ప్రజ్ఞాపరిమితసూత్రములు' మనదేశములో ఖిలమైపోవుటచేత, ఈయన నాగలోక (లంక) మేగెనని యొక ప్రమాణము తెల్పుచున్నది. 'బుద్ధఘోష, బుద్ధదత్తు' లిచ్చ టనే యభివృద్ధి గాంచుటచేత, నిది సింహళము గావచ్చును. నాగార్జునుడు 'వైపుల్య'యు, నింక నితరసూత్రముల నేర్చి, అస్థికలపెట్టెను దెచ్చి, దానిపైననే శ్రీపర్వతముమీాద స్థూప

141 141. G. K. Narayana–Literary History of Sanskrit Buddhism. P. 92.

నిర్మాణ మొనర్చెను; ఈస్థూపమే 'మహాచైత్యము'; తరువాత వచ్చిన ఇక్ష్వాకు రాజకుటుంబమువారుకూడ దీనిపైన మిగుల యభిలాష కనపరచిరి. ఈయనయాత్ర గొప్పఖ్యాతినిదెచ్చెను. తిరిగివచ్చినపిమ్మట రాజును, పదివేలమంది బ్రాహ్మణులను, ఈయన భిక్షువులుగా మార్చెను. ఆయన మరణించిన 100 ఏండ్ల తర్వాత, ఆయనపేరున ఆలయములు వెలసెను; అంతా యన పూజింపబడెను.

హిమాలయమునుండి నాగార్జునుడు హిందూదేశములోని దక్షిణభాగ మేగెనని, దక్షిణహిందూస్థానములో నొక ఇనుప గోపురమును గనిపెట్టెనని తెలియుచున్నది. అచట 'వజ్రసత్వు డుండెను.' ఈయనయే నాగార్జునునికి 'వైరోచనగాధ' బోధించెను. ఈప్రకారము 'అమితభ, విరోచన, నాగమందిరము, ఇనుపగోపురము, నాగులు, వజ్రసత్త్వులతో నాగార్జునునికి బరిచయమాయెను. తర్వాత ఆయన దక్షిణహిందూస్థానమునకు బోయి అచటనే మిగతాకాలమంతయు గడపెను; అచటనే గ్రంథములు లిఖించెను. జపానీయ లేఖకుల వ్రాతలప్రకార మీయనకు కనిష్క-సభతో నెట్టిసంబంధము గాన్పించదు.[142]

'షింగన్' సిద్ధాంత ప్రకారము, బుద్ధమహావైరోచనుడు, మొదట 'మహాయాన బౌద్ధమతము' బోధించెనని, ఆయన

---

Also see Winternitz- A History of Indian Literature Vol. II P. 342-343

Also see Arthur Lloyd—The Creed of Half Japan P. 106 and 107.

[142] Arthur Lloyd-The creed of Half Japan P. 107.

బోధిసత్వ వజ్రసత్త్వునికి, ఆయన 'నాగార్జునుని'కి బోధించెనని జపానీయ లేఖకుల వ్రాతలవలన దెలియుచున్నది.[143]

'మంజుశ్రీ మూలతంత్రము 1వ సంపుటిని, బౌద్ధకథలనుబట్టి' 'తారానాధుడు', నాగార్జునయతి అమరావతి స్థూపమునకు బయట ప్రాకారము కట్టించెనని వ్రాసెను. ఇందు బుద్ధుని అస్థికలు గలవు. అమరావతి చైత్యములోని పలకలు, నాగార్జున కొండమీదవి, ఒకేవిధముగా నుండుటచేత ఆకొండమీదవి, యతి చనిపోయినతర్వాత క్రీ. శ. 3వ శతాబ్దములో జేయబడి నవని, విద్వాంసు లూహించుచున్నారు.

బౌద్ధమత ప్రచారముచేయుచు దక్షిణదేశములో దిరిగెనని, 300 ఏండ్లు బోధించెనని, టిబెటీయులు 600 అందురని తెలియుచున్నది. కుమారజీవుడీయనను మాంత్రికుడుగా, ఖగోళ, వైద్య శాస్త్రవేత్తగాను, విలువగల రాళ్లను తయారుచేయు వానిని గాను, వర్ణించెను. "నాగార్జునుడు నాగరాజుదగ్గర ముత్యాల హారమును గైకొనెనని, ఇది పాముకాటుకు, సమస్తవిధములగు నొవ్వుల కుపయోగించునని, బాణుడు వ్రాసెను.

కుమారజీవుని వ్రాతలబట్టి, నాగార్జునుడు యౌవనములో నన్నిదేశములు ఒంటరిగా సంచారము చేసెనని, ప్రపంచము లోని అన్నివిద్యలు, కళలు నేర్చెనని, జ్యోతిషము, భూగోళము, మంత్రశక్తిని గల్గియుండెనని తెలియుచున్నది. "ఆయన రాజు దానపతి 'అలమన' భూమిలో నుండెనని, రాజుపేరు 'సింధుక, జంతక,' యని తెలియుచున్నదని, ఈదేశము 'సౌరా

[143] Beatrice Lane Suzuki-Koya San P. 25

ష్ట్రిలోని 'ఉజ్జంత'గా నున్నదని 'బీల్' పండితు డభిప్రాయ పడెను; కాని యిది సరియని తలంచము. నాగార్జునుడు తన ముప్పదిరెండవ ఏటనుండి అరువదివరకు నాగార్జునకొండపై ననే కాలము గడిపినట్లు తెలియుచున్నది.

నాగార్జునుడు, నాగలోకమను లంకకేగినట్లు తెలిసికొన వచ్చును. బుద్ధుడుకూడ లంకకు వెళ్ళెనని యందురుకాని, ఇది నిరాధారముగా గాన్పించుచున్నది. బుద్ధత్వము చెందిన తర్వాత 9వ నెలలోను, 5వ సంవత్సరములోను, 8వ సంవత్సరములోను లంకను వెళ్ళెనను కథలు కలవు; కాని యివి నిరాధారముగా నున్నవి.[144]

సంస్కృతములో ప్రజ్ఞాపరిమిత సూత్రములలో 125000 శ్లోకములకుపైగా గలవు. దీనిఅనువాదములు ఆంగ్లేయ, చైనీయ, మంగోలియా, మంచు, జపాను, టిబెట్టు మున్నగు అనేక భాషలలోనున్నవి. ఇది మిగుల విలువగల పవిత్రమగు గ్రంథము. మొదటివాడగు 'మహాకాశ్యపుడు' రెండవవాడగు 'ఆనందుడు' 13 వ గురువు 'నాగార్జునుడు' వీని నెరుంగును. నాగార్జునుని మతప్రకార మీగ్రంథములో బుద్ధునిబోధలు గలవని, అవి నాగులవశములో నుండెనని, (సర్పదేవతలు) వానిని సరస్సు అడుగుననో, సముద్రము అడుగుననో ఉంచి, వానిని స్వీకరించు మనుజుల రాకకొరకెదురుచూచు చుండిరని, నాగులరాజు నాగార్జునునితో రాజభవనములోనికి, సముద్రములోనికిజొచ్చి

---

144 R. Spencer Hardy–The Legends and thesis of Buddhists P. 207

కేవలసినదని, నాగార్జునునికి ఉపదేశమిచ్చెనని, అంతట నాగార్జునుడు నాగలోకమేగి, యాగ్రంథమును దెచ్చెనని తెలియుచున్నది.[145]

లామాల కథానుసారము బుద్ధుడు 'గృధ్రశిఖరము'మీద జ్ఞానోదయమైన 16 ఏండ్లకు దీనిని బోధించెనని, 'మహాకాశ్యపుడు' రహస్యముగా దానిని భద్రపరచెనని, చెప్పుదురు. జపానీయ లేఖకుల వ్రాతలనుబట్టి "నాగార్జునుడు, నాగరాజు భవనమున కేగెనని, సూత్రముల జదువుకొని, వానిని గైకొని వచ్చెనని, ఈ ప్రపంచములోనికి వానినిదెచ్చి, బోధించెనని, వీనిని తర్వాత 'బుద్ధభద్ర' (క్రీ. శ. 359–452) అనువాదము చేసినని తెలియుచున్నది.[4] ఇంకను నాగులజూచుటకేగు యాత్రికుడుగా హిమాలయమునకేగి, 'మహానాగబోధిసత్వని' స్నేహముజేసెనని, ఆయన ఒకకోటలో నివసించుచుండెనని, ఆయన నాగార్జునుని 'నాగరాజభవనము'నకు బంపెనని, అచట మహాయానసూత్రముల దెచ్చెనని, దక్షిణమునకేగి మతబోధచేసెనని తెలియుచున్నది.[147] లంకనుండి నే 'నాగార్జునుడు' 5000 శ్లోకములుగల 'పరినిర్వాణ వైపుల్యసూత్రముల' గొనివచ్చెను. 'నాగార్జునుడు' బౌద్ధసంఘములోనుండి బాహ్య ప్రపంచమునకు 'మహాయానము' తెచ్చెను. ఈయన నిర్మాత

---

145 W. Y. Evans Wentz-Tibetan Yoga and Secret Doctrines. P. 343

146 H. H. Coates – Honen–The Buddhist Saint P. 204

147 Ibid P. 209

యని కొందరందురుకాని యది నిరాధారము. ఈతని సూత్రములనేర్పాటుచేసి ప్రచారములోనికి తెచ్చెను.

పైవానినిబట్టి తేలు చారిత్రకసత్య మేమనగా, 'నాగార్జునుడు' లంకకేగి యచట, ప్రజ్ఞాపరిమిత సూత్రముల, వైపుల్యసూత్రముల' నేర్చి, వానిని గైకొనివచ్చినట్లు చెప్పవచ్చును. హిమాలయములకుకూడ నేగి, 'మహాయానసూత్రములను' వృద్ధభిక్షువుదగ్గర నేర్చియుండవచ్చును. మొత్తమువిూద ఆసేతుహిమాచలము, 'నాగార్జునుడు' పర్యటనము చేసినట్లు కాన్పించుచున్నది. చివరకు శ్రీపర్వతమును నాగార్జునకొండపైన స్థిరనివాస మేర్పరచుకొని, ఇచటనే మరణించెను. నాగార్జునునిమతము 'టిబెటు'లోగూడ వ్యాప్తిగాంచెను. 'కమలశిల' టిబెటుపోగా, యచట వాదనలలో నొకచైనీయ భిక్షువ్వరునితో గెల్చెను. అందఱు మాధ్యమిక నాగార్జునుని మతము గైకొనవలెననిరి. అంతటినుండి దీనిని గైకొన్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 11వ శతాబ్దమునుండి 'టిబెటు' లో గ్రంథాలయములు కూడ స్థాపించబడెను.

5. నాగార్జునుడు ఎఱ్ఱజెండాను బట్టుకొని తిరుగుట

జోసఫ్ యెడ్కిన్సు ఈలాగున వ్రాసెను. "నాగార్జునుడు 14వ ప్రధానగురువు. ఆయన దక్షిణహిందూదేశమునకు జెందినవాడు. అచటిరాజు బౌద్ధమతమునకు వైరిగా నుండి, దీనివంక న్యూనభావముతో జూచుచుండెను. 'నాగార్జునుడు' వానిని మార్చుటకు ప్రయత్నించెను. ఏడు సంవత్సరములు 'నాగార్జు

నుడు' ప్రయాణముచేయునపుడు, ఎల్లజాండాను తనముందు బట్టుకొని తిరుగుచుండెను. రాజిట్లు అడిగెను. "ఈమనుష్యు డెవరు?" ఆయన జవాబిట్లు చెప్పియుండెను. "నేను సమస్తవిధములగు జ్ఞానమును గల్గిన మనుజుడనై యున్నాను." రాజిట్లు అడిగెను. "ఇపుడు దేవతలేమి చేయుచున్నారు? నాగార్జును డిట్లు జవాబుచెప్పెను. "ఇపుడు దేవతలు అసురులతో బోరాడుచున్నారు." క్షణకాలములో రాక్షసుల ఖడ్గములు, చెవులు, ముక్కులు క్రిందపడి పోయెను; రాజు వానిని జూచి, గౌరవపూర్వకముగా, నాగార్జునునికి సాష్టాంగము చేసెను. ఆచతుశ్శాలలోని పదివేలమంది బ్రాహ్మణులు, నాగార్జునుని అద్భుతశక్తిని జూచి, స్తుతించసాగిరి. అందరు క్షురకర్మ చేసికొనుట కంగీకరించి, బౌద్ధభిక్షు జీవనములో బ్రవేశించిరి."[148]

# VIII

## గ్రంథరచన

1 నాగార్జునకృత గ్రంథములు - 2 సిద్ధనాగార్జునకృత గ్రంథములు.

### 1. నాగార్జునకృత గ్రంథములు

చైనీయ త్రిపిటకములను బట్టి 'నాగార్జునుడు' 24 గ్రంథములకు కర్తయని తెలియుచున్నది.[149] 'బీల్ పండితుడు' కూడ దీని

---

[148] Rev. Joseph Edkins-Chinese Buddhism. P. 77.

[149] S. Beal—Indian Antiquary Vol. XVI—P. 169(1887)

సంగీకరించెను; 'హెచ్. హెచ్. కోట్సు' అను పండితుడుకూడ జపానీయ అభిప్రాయమును వ్రాయుచు నాగార్జునుడు 24 గ్రంథ ములకు కర్తయనెను; కాని చైనీయభాషలో 20 కలవని 'వాటర్సు' వ్రాసెను.[150] కాని 'నాంజో క్యాటలాగు'లో 18 గ్రంథ ముల పేర్లున్నవి. ప్రస్తుతములో నున్న గ్రంథములు నాగార్జున రచితములా యని సందేహముకలదు అని 'కెరన్' వ్రాసెను. కొన్ని గ్రంథములు ఏ 'నాగార్జున' రచితములో తెలియకున్నవి. ఈక్రిందివి 'నాగార్జున బోధిసత్వ రచితములు,' అని పలువురు విద్వాంసు లంగీకరించిరి. వాని పేర్లు, అందలి విషయములు కొన్ని నేను వ్రాయుచున్నాను. వీనిలో గొన్నిటినిమాత్రము నేను చూడగలిగినాను; కొన్ని కాలగర్భములో లీనమైనవి. చాల భాగము చైనీయభాషలో ననువాద రూపమున నున్నవి.

1 సుహృల్లేఖ— సంస్కృతభాషలోని మూలము పోయి నది. 'టిబెటీయభాష'లో ననువాదరూపమున సురక్షితముగా నున్నది. అపరబుద్ధుడనబడు నాగార్జునుడు శాతవాహనునికి వ్రాసిన లేఖ గలదు. టిబెటులో నీరాజును 'ఉదయన' అం దురు. ఇందు 123 శ్లోకములు గలవని జి. కె. నారాయణ వ్రాసెను. దీని అనువాదమును గుణవర్మ చైనీయభాషలోనికి క్రీ. శ. 431లో మార్చెను. 'ఇత్సింగు' కూడ ఒకటి అనువ దించి చైనాలోని యొకమిత్రునికి బంపెను.

---

[150] T. Watters—On Yuan Chwang's Travels. Vol. II—P. 204.

ఇది దానపతికి వ్రాసిన ఉత్తరము; ఈయనను షి-యెం-టె-కియా అని పిల్తురు. ఈయనయొక్క బిరుదు షా-తో-పొ-హాన్-న; 'ఇత్సింగు' దీనినిగూర్చి వ్రాయుచు 'బుద్ధ, ధర్మ, సంఘము' నందు విశ్వాసము అనివ్రాసెను.

ఇందు బౌద్ధధర్మములు గలవు. 'ఆర్య నాగార్జున బోధి సత్వ కృతమగు ఈగ్రంథము 'ఇత్సింగు'కాలము (క్రీ. శ. 7వ శతాబ్దము) నాటికి మిగుల ప్రసిద్ధిచెంది యుండెను. తలిదండ్రుల పోషించవలెనని, శ్రద్ధగా జూడవలెనని ఈగ్రంథము బోధించు చున్నది. 'ఇత్సింగు' వ్రాతలప్రకారము చైనాలో వేయి అక్షరముల కావ్యమును వల్లించినట్లు, భారతదేశములో జిన్నబిడ్డ లీలేఖను వల్లించెదరని తెలియును. 'ఇత్సింగు' ఇట్లు వ్రాసెను. "భారతవర్షములోని బిడ్డలు దీనిని వల్లించి నేర్చుకొనుచుండిరి; పెద్దవారు జీవితకాలమంతయు జదువుకొను పాఠ్యగ్రంథముగా భావించుకొనుచుండిరి."[151]

చైనాకు మనదేశమునకు ఎంతరోా కాలమునుండి సంబంధము గలదు. క్రీ. శ. 65లో 18 మంది చైనాకు వెళ్లి క్రీ. శ. 67లో తిరిగివచ్చిరి. ఇందు కశ్యపమాతంగుడు, గోభరణుడు మున్నగువారుకలరు. వారిటనుండి విగ్రహములు, శాస్త్రములు గైకొనిపోయిరి.[152] ఈప్రకారము నాగార్జునుని గ్రంథములు కూడ చైనాకుచేర్చి, అనువాదము చేసియుండిరి. 'సుహృల్లేఖ' అనువాదములు మూడుకలవు. (నాంజోక్యాటలాగులో 1464—

[151] Takakusu—Itsing P. 158—162.
[152] H. Hackmann-Buddhism as a Religion P.78.

1440-1441వ నంబర్లుచూడుడు) 'గుణవర్మ' చైనాకు క్రీ. శ. 431లో వచ్చెను. మొదటి అనువాదము క్రీ. శ. 431లో, 442 పంక్తులలో జరిగెను; రెండవఅనువాదము 'సంఘువర్మ' క్రీ. శ. 434లో జేసెను; మూడవ అనువాదము 'ఇత్సింగు' క్రీ. శ. 700లో జేసెను. 'బీల్'పండితుడు ఇంగ్లీషులో దీని అనువాదమును 104 పంక్తులవరకు చేసియుండెను.[153] మిగతా భాగమును తరువాత చేసియుండచ్చును; కాని నాకు లభించలేదు. ఈ లేఖలోని రాజు 'జంతకుడు'; ఈ రాజును 'సింధు' దేశ రాజని 'సింధువాసి' యని పేర్కొనెను. తారానాథు డితనిని ఉదయున లేక అంతివాహన అని పిల్చెను. చిన్నతనములో నితని పేరు 'జేతక'. ఇంకను 'తారానాథుడు' నాగార్జునుని చిన్నతనము నుండి సలమన (లేక అలమన) స్థితిలో నుండ, నెరింగియుండెను. ఈయన ఆంధ్ర శాతవాహన రాజులలోని వాడనుట స్పష్టము. ఈరాజెవరో తెలియకున్నదని, అనుమానమైన ప్రమాణమని, 'కీత్ పండితుడు' విమర్శించెను. కారణమేమి? 'సుహృల్లేఖ' నుండి ఒక్క శ్లోకమునుమాత్రము అనువాదము చేయుచున్నాను; దీనిభావమిది.

"ఏప్రకారము భూతలము చరమునకు స్థిరమునకు ఆధారభూతమగుచున్నదో, అటులనేనీతిపథము, గొప్పతనము (ఘనత) న కంతటికిని ఆధారభూత మగుచున్నది."

దీనిలో నింకను త్రిగుణాతీతమగు జ్ఞానము (Three fold wisdom) అష్టాంగమార్గము, చతుర్విధసత్యములు, నిర్వాణ

[153] S. Beal—Ind. Ant. XVI—P. 169

మనకు పద్ధతులు చెప్పబడినవి. "అవలోకితేశ్వరునివలె శత్రు మిత్ర భేదభావము చేయరాదు. అందుచేత మనము 'సుఖావతిలో' నుందుము." అని చెప్పబడినది.

ఈప్రకారము శాతవాహనరాజు కిచ్చిన ఉపదేశము అమూల్యమైనది. ఈయాతి విక్రమాదిత్యుని (ఉదయన) అనగా టిబెటియభాషలో 'డెఛడ్ జంగుకో' అనువానిని, మనసును చతుర్విధస్మరణములపై బరపి యుంచవలసినదని కోరెను. అవి 1దేహము 2ఇంద్రియములు, 3 మనసు. 4 కర్మలు. వీనిమీద దృఢనిశ్చయముతో లక్ష్య ముంచవలసినదని కోరెను. వీనిపేరు 'కర్మకవాటములు'; ఈక్రింది భావము చూడుడు. "ఓ బాహుబలాఢ్యుడా! ఈనాల్గు స్మృతులు బౌద్ధులు సంచరించుమార్గము, దోషరహితమైనదని, తెల్పును. మీరు సర్వకాల సర్వావస్థలయందు పూర్తిగా జాగ్రత గైకొని ఉండవలసినది. అజాగ్రత్త చేత ఆధ్యాత్మిక సంబంధమగు ప్రయత్నములన్ని నిరర్థకములగును."

2 ప్రజ్ఞాప్రదీప శాస్త్రకారిక:- (Sastra of the Mean) 'ప్రభాకర మిత్రుడు' క్రీ. శ. 630-632లో దీని అనువాదమును జేసియుండెను. నాంజోక్యాటలాగు 1185వ నంబరున ఉన్నది. నాగార్జునుడు మాధ్యమిక శాఖ బోధకుడు. ఆయన భావమిది. "ఆత్మకు ఉనికిలేదు; లేకపోనూ లేదు. అది శాశ్వతము కాదు; అశాశ్వతమును కాదు. మరణముచేత నశించునదికాదు; నశించనిది కాదు." ఇది మాధ్యమిక శాఖీయుల వాదము.

3 దశభూమి విభాషశాస్త్రము-నాంజోక్యాటలాగు 1180వ నంబరునఉన్నది. 'నాగార్జునుడు' దీనిని దక్షిణహిందూస్థాన

ములో వ్రాసెను. చైనీయభాషలో దీని అనువాదములు రెండు కలవు. క్రీ. శ. 297లో 'ధర్మరక్షు' మొదటిఅనువాదము జేసెను. రెండవదానిని 'కుమారజీవుడు' వ్రాసెను. దీని సంస్కృత మూలము నేటికిని గలదు.

4 మహాప్రజ్ఞ పరిమిత సూత్ర వ్యాఖ్యాశాస్త్రము:- దీనినే 'ప్రజ్ఞాపారమిత శాస్త్రము' అందురు. నాంజో క్యాటలాగులో 1169వ ఉన్నది. క్రీ. శ. 405లో 'కుమారజీవుడు' 100అధ్యాయములలో దీని ననువాదము చేసెను. మూలసంస్కృతములో 'ప్రజ్ఞాపారమితలో' 125000 శ్లోకములు గలవు; శతసాహస్రిక 'ప్రజ్ఞాపరమిత' యని, 'శతసాహస్రిక' అని దీని నందురు. దీని అనువాదములు, ఆంగ్లేయ, చైనా, మంగోలియా, మంచు, జపాను, టిబెటీయ మున్నగు భాషలలో గలవు. చాల విలువగలది; పవిత్రమైనది. చైనా, నేపాలుదేశములలో దీనిని ఉత్తమమైన దానినిగా దలంచుచున్నారు. ఇది మహాయానమునకు విజ్ఞానసర్వస్వము. 'తారానాథుడు' పొగడెను. దీనిసార మిట్లున్నది. "చైతన్యముయొక్క ఆరుధర్మములు (ఎరుక) కంటిఎరుక, చెవిఎరుక, ముక్కుఎరుక, నాలుకఎరుక, దేహము ఎరుక, మనసు ఎరుక; స్పర్శలు, కన్ను, చెవి, ముక్కు, నాలుక, శరీరము, మనసులయొక్క, స్పర్శచేత కలుగునట్టి ఇంద్రియజ్ఞానము, కన్ను, చెవి, ముక్కు, నాలుక, శరీర, మనోసంబంధములు; ఆరుభూతములు, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, చైతన్యము అనునవి; ద్వాదశ నిదానములు, అవిద్య (జన్మ, ఆలోచనలు) రూపములు, చైతన్యము, మానసిక, శారీ

రిక మూలపదార్థములు, ఆరు (భూములు) ఇంద్రియశక్తులు, స్పర్శ, ఇంద్రియజ్ఞానము, తృష్ణ, భోగము, ఉనికి, జననము, వయస్సు, మరణము అయియున్నవి.

అన్ని శారీరిక, దైవత్వ ధర్మములు జ్ఞానమునంటి ఉండును. అన్ని వ్యాక్యుల యొక్క దైవత్వ ధర్మములు జ్ఞానమునంటిఉండును. అది 'శూన్యత' బోధించును. ఈలక్షశ్లోకముల గ్రంథములో, మొదటి 12సంపుటములు 'టిబెటీయ భాష'లో ననువాదమైనవి. 'జినమిత్ర, సురేంద్రబోధి' యను వారు టిబెటీయ భాషలో దీనిని క్రీ. శ. 9వ శతాబ్దములో మార్చిరి. దీనివిషయము 'బుద్ధుడు' 'సుభూతి'తో నిట్లుచెప్పెను. "ఓసుభూతీ! ఈ శాస్త్రముయొక్క ప్రాముఖ్యత క్లుప్తముగా చెప్పబడుచున్నది. ఇందలి సత్యము. అనంతమైనది; దీనివిలువ కెనలేదు; దీని యోగ్యత తుదముట్టనిది; దీనిప్రభావము చెప్పనక్కరలేదు."[154]

'శతసాహస్రిక ప్రజ్ఞాపారమిత' పై 'నాగార్జునుడు' 'మహా ప్రజ్ఞా పారమిత శాస్త్ర వ్యాఖ్య రచించెను; అది 'శూన్యతను' బోధించును; 'అశ్వఘోషు'డీ బోధకు ఆరంభకుడు; తర్వాత 'నాగార్జునుడు' వచ్చును.

క్రీ. శ. 402లో 'కుమారజీవుడు' దీనిని 100 సంపుటములుగా మార్చెను; క్రీ. శ. 402-405 మధ్యనని కొందరి యభిప్రాయము. ఇందులో నొకటవ అధ్యాయము 34 సంపుటములాయెను. 'మహాపరి నిర్వాణసూత్రము'ను 'ధర్మరక్ష' క్రీ. శ. 423 లో మార్చెను. మహాయానసూత్రములు, ఉత్కృష్ట

---

[154] W. Y. Evans Wentz - Tibetan Yoga and secret doctrines - P. 346-347-348.

మైనవి. 1 ప్రజ్ఞాపారమిత. 2 సద్ధర్మ పుండరీకము. 3 నిర్వాణ అనునవి మూడును ముక్తికి ద్వారములు. 'కుమారజీవుడే' 'ప్రజ్ఞాపారమిత' చెడుఅభిప్రాయముల పోగొట్టునని, 'సధర్మ పుండరీక' ఆఖరుకు సత్యము బోధించునని, నిర్వాణము నిజమైన మార్గమును బోధించునని చెప్పెను.

ఈవ్యాఖ్యను 'డైచిడోరన్' అందురు. ప్రజ్ఞాపరిమిత సూత్రమును 'డైబోన్హాన్న్యకో' అందురు. ఈయన 'సధర్మపుండరీక, దశభూమికా, గండవ్యూహా, అమితభ సూత్రములను, ప్రజ్ఞాపారమిత సూత్రములను చేర్కొనెను. ప్రజ్ఞాపారమిత సూత్రముల నాధారముగా జేసికొని, దక్షిణదేశములో తత్త్వవిచారమును వృద్ధిజేసెను. 'ఈప్రజ్ఞాపారమిత' శూన్యవాదమును చేర్కొనెను. ఈబోధ కిగ్రంథమే మూలము. దీనికి భిన్నభిన్న రూపములు గలవు; 1 మహాప్రజ్ఞాపరామిత, 2 అష్టసహస్రిక ప్రజ్ఞాపరామిత 3 ప్రజ్ఞాపరామితహృదయ; దీనిలో శూన్యతా చర్చ సంపూర్ణముగా గలదు.

'దశసాహస్రిక ప్రజ్ఞాపరిమితా' క్రీ. శ. 75-220 సంధ్య అనువాదమాయెను. ఇతర మహాయాన గ్రంథములు క్రీ. శ. మూడవ, ఐదవ శతాబ్దముల మధ్యజరిగెను. కశ్యప మాతంగుడు క్రీ. శ. 67 లో 42 నిబంధనల సూత్రము ననువాదము చేసెను. చైనీయభాషలోని మొదటి అనువాద మిదియే కావచ్చును.

తరువాత చైనీయ అనువాదము క్రీ. శ. 170 లో జరిగెను. కుమారజీవుడు ప్రజ్ఞాపరామితయొక్క వేరు వేరు సంస్కరణముల

ననువదించెను; అష్టసహస్రిక, వజ్రచ్ఛేదిక, మొదలగువానిని అనువదించెను. ఈచివరదానిలో నిట్లుగలదు. "అన్నివస్తువులు భ్రమవలన గల్గినవి. దృగ్విషయము మనోసంబంధములేక అంతఃకరణ సంబంధము. మన మనసువలననే ఉద్భవించినవి." "ఈమాటలతో గ్రంథమంతమగుచున్నది; ఈక్రింది భావమును కూడ దిలకించుడు. "అనేకపదార్థములలో జేరిన వస్తువు లన్ని స్వప్నమువంటివి; భ్రాంతిరూపములు; నీటిబుగ్గవంటివి; నీడ వంటివి; ఇవియన్ని మంచుబిందువువలె నుండును; మెరుపు లేక అగ్నికణమువంటివి."

వజ్రసూత్రములు (Diamond Sutra) ప్రజ్ఞాపరామిత లోనివి. వీనిని కాశ్మీరవాసి కుమారజీవుడు (క్రీ. శ. 384 -417) చైనీయభాషలోనికి మార్చెను. ఈయన మొదటివాడు. 'హూనుత్సాంగు' వీనిని బూర్తిచేసెను. చైనా, నేపాలుదేశ ములలో ఈగ్రంథమునకు మంచిపేరు గలదు.

5 అవతంశక సూత్రము-(బుద్ధావతంశక.) దీనికి కర్త 'నాగార్జునుడు'; చైనీయభాషలోనికి క్రీ. శ. 4వ శతాబ్దములో నను వాదమాయెను. 'ఫాలింగు' దీనిని అనువాదము జేసెను. మూలముపోయినను మూడు అనువాదములు నిల్చియున్నవి. వ్యతిరేకవాదమున క్రింది ఉదాహరణ మివ్వబడినది. "పుట్టుక లేదు; మరణములేదు; ఎడతెగని శాశ్వతత్వము లేదు; నాశ నములేదు; ఏకత్వములేదు, అనేకత్వము లేదు; భవిష్యత్తులేదు; భూతములేదు."[155]

[155] Karl Ludvig Reichelt - Truth and tradition in Chinese Buddhism P. 120.

నాగార్జునుని శిష్యుడు 'వసుబంధుడు' తనగురువు భావము లకు చాల లోతైన, గాఢమైన, అర్థమిచ్చెనని, 'అమితభ విగ్రహ ము'ను నిజమైన జీవప్రతిమగా చేసెనని, పైగ్రంథకర్త వ్రాసెను; కాని అది తప్పని చెప్పవచ్చును. నాగార్జునుని శిష్యులలో వసుబంధుడు లేడు. నాగార్జునుని స్వప్నములో 'మైత్రేయ నాథుడు' కాన్పించెనని, యతి అతని ప్రార్థన నంగీకరించెనని తెలియుచున్నది.

ఈ 'అవతంశక శాస్త్రము' ఆరుభాగములు గలది. మొదటి రెండు ఎన్నడును వ్రాయబడలేదు. లాటిఆకులమీద వ్రాయ బడకుండ, ధారణిశక్తి చేత, గొప్ప బోధిసత్త్వుల మహాత్తర శక్తిచేత నిది నిల్చియుండెను. మూడు, నాల్గు భాగములు నాగుల మందిరములో, సముద్రాంతర్భాగములో నుంచిరి. జంబూద్వీప ప్రజలకిది ఎన్నడు లభించలేదు. ఐదవదానిని, నాగులమందిరమునుండి కైకొనివచ్చి 'నాగార్జునుడు' హిందూ దేశవాసుల కొసంగెను. అందులో నొకభాగము, 'చైనా'కు 'అన్షికయో', అతనిస్నేహితులు తీసికొనిపోయిరి. ఆరవభాగము క్రీ. శ. 317 420 మధ్యలో చైనాకు జేరెను. దీనిని బుద్ధ భద్రుడు, అనువాదము చేసెను. ఇనుపగోపురపు గాథను కొందరు నిరాకరింతురు.[156] ఈ 'అవతంశకసూత్రము' యొక్క సారాంశమిది.

"దీని సారము ప్రకాశమానమైన అద్దమువలె నున్నది; అది దృగ్గోచరమగుదాని కంతటికి మూలము; అపునాదియే నిత్యమై

[156] Arthur Lloyd - The Creed of Half Japan P. 113.

నది; సనాతనమైనది. కంటికి కనబడునదంతయు "అశాశ్వతము, మిథ్య; అద్దము ఎటులనైన అన్ని బొమ్మలను ప్రతిబింబించు కొనునో, అటులనే సారము కంటికి గోచరమగుదాని నంతటి నావరించుకొనును; అన్నిపదార్థములు దానిలోపల, దాని వలన మనుగడపొందును. ఇది శూన్యత, మహాశూన్యత అనబడును."[157]

నాగార్జునుడు 'ధర్మచక్రము'ను (Wheel of the law) దైవాంశసంభూతులగు నాగులయొద్దనుండి నేర్చెను; వారు దీనిని 'బుద్ధుడు' బోధించునపుడు వినియుండిరి.

6 తర్కశాస్త్రగ్రంథములు- 'విగ్రహవ్యావర్తిని' (కారిక- Logic) ప్రమాణవిహేతన, ప్రమాణవిధ్వంసన, వివాదసమాన శాస్త్రము అనువానిని వ్రాసెను; అనేక సిద్ధాంతములను ఖండించెను.[158] నాగార్జునుని తర్కమిట్లున్నది. "ఆశ్రితమగు ఉత్పత్తి, మొదలులేనిది, అంతములేనిది, మార్పులేనిది; అదియే పరిపూర్ణము; అదియే నిర్వాణము."[159] 'వివాదసమాన శాస్త్రము' 1251న 'నాంజో క్యాటలాగు'లోనున్నది. 'విగ్రహవ్యావర్తిని'కి 'అమితాయుర్ధ్యాన సూత్రము' అను పేరుకలదని ఒకరు వ్రాసిరి కాని నమ్మకములేదు. ఈయన గొప్పతార్కికుడని తెలిసికొనవచ్చును.

---

[157] Karl Ludvig Reichelt—Truth and tradition in Chinese Buddhism. P. 349.

[158] Th. Stcherbatsky P.H.D.—Buddhist logic. P. 28.

[159] Ibid. P. 38

7 చతుస్తవము:— ఇందు నాలుగు సూక్తములు గలవు. నాగార్జునకృతము; యితికూడ 'అశ్వఘోషుని' వంటివాడు.

8 లంకావతార సూత్ర వ్యాఖ్య:— ఇది 36000 శ్లోకములు గలది. పశ్చిమదేశములో 'నాగార్జునుడు' 'లంకావతార సూత్రముల'పై వ్యాఖ్య రచించెనందురని, 'సుజుకి' వ్రాసెను. సత్యము తెలియకున్నది.[160]

9 సమాధిరాజము:— నాగార్జున కృతము.

10 రత్నకూట సూత్రములు:— 'నాగార్జున' కృతము. ఈ రెండుగ్రంథములు 'నాగార్జున' కృతములని 'వాడెల్' వ్రాసియుండెను.[161]

11 శ్రద్ధోత్పాద శాస్త్రవ్యాఖ్య:— 'నాగార్జునుడు' అశ్వఘోషుని, గ్రంథముపై వ్యాఖ్య వ్రాయుచు దానిలో నారుగురు వేరువేరుకాలములలోవి 'అశ్వఘోషుల' పేర్కొనెను. దీనిని సంస్కృతములో 'మహాయాన శాస్త్రవ్యాఖ్య' అందురు. దీనిని 'చైనీయభాష'లోనికి 'పాటిమోటా' అను భారతీయపురోహితుడొకడు క్రీ. శ. 401-402 లలో మార్చెను. 'నాగార్జునుడు' స్వయముగా 'అశ్వఘోషుని' శిష్యుడని చెప్పబడియున్నది. కాని యిది సత్యముకాదు; కాని ఈ గ్రంథములో బరస్పరవిరుద్ధమగు వ్రాత లుంటుటచేత, అభూతకల్పనలుగల

---

[160] D.T. Suzuki—Studies in Lankavathara Sutra. P. 42.

[161] L. A. Wadell -The Buddhism of Tibet P. 125

గ్రంథమని తెలియుచున్నది.[126] క్రీ. శ. 502-551లో దీని 'చైనీయ' అనువాదమని 'టి. రిచర్డు' వ్రాసెను.[163] ఈక్రింది విషయములు దీనిలోనున్నవి.

1 'మహాయాన పుణ్యధర్మసూత్రములు' బుద్ధుడు చనిపోవు నపుడు అశ్వఘోషుని కిచ్చెను.

2 మూడువందల ఏండ్లతర్వాత నాయుపదేశములు కల్గును. (విక్రయపుణ్యసూత్రములు)

3 మహామాయ సూత్రములు చెప్పుచు, 600 ఏండ్లతర్వాత 96 శాఖలు గల్గునని, అశ్వఘోషుడు బోధించును.

4 సమాధిసూత్రములలో 800 ఏండ్ల తర్వాత 'అశ్వఘో షుడు'కల్గునని యున్నది; ధర్మమేర్పరచును.

5 'మణివిమలసూత్రము'లో బుద్ధనిర్వాణమైన 100 ఏండ్లకు 'అశ్వఘోష మహాసత్వుడు' వచ్చునని యున్నది; ధర్మము కాపాడును; బౌద్ధధ్వజ మెత్తును.

6 త్రిమూర్త రాజసూత్రములలో వెల్లువచ్చిన 17వ రోజున తీర్థకుడు 'కాలనక్షత్ర' అనువాడు, గొప్పనాగరాజై (Snake King) 86000 తలలతో 86000 నాల్కలతో 86000 ప్రశ్నలు వరుసగా నడిగెనని, (తథాగతుని) వీనినన్నిటి బోధించుచు మూడురెట్లు జవాబుల నిచ్చెనని, అప్పుడు 'నాగరాజు'పదిరెట్లు

---

162 T. Suzuki - Awakening of faith in Mahayana P. 7

163 T. Richard - The Newtestment of higher Buddhism P. 9

ప్రశ్నలడిగెనని, 'తథాగతుడు' 100 రెట్లు జవాబులు చెప్పెనని, చివరకు 'బుద్ధుడు' నాగరాజుతో నిట్లు చెప్పెనని యున్నది. "ఓ అశ్వఘోష శ్రమణుడా! చాలమంచిది; చాలమంచిది. ధర్మ సాధమునుగా పాడుటకు, నీవు ప్రళయరూపమును దాల్చినావు; బౌద్ధధర్మమును స్థాపించెదవు; శాంతముగా నుండుము. ఈవిధముగా నెల్లపుడు క్రమశిక్షను బొందుము: ఈవిధముగా నెల్లపుడు ధర్మము వహించుము; చిన్నవలయములో గుండ్రముగా పోకుము; కాని విశ్వసంచారము చేయుము." ఆనాగరాజపుడు తన జంతురూపమును వదలి, తన నిజస్వభావమును బయల్పరచి, ఆగౌరవపాత్రుని యొద్దకు వచ్చి నమస్కరించి, ఆనందముతో నొకశ్లోకములో జెప్పెను. "ఈయనయే ఆరవ అశ్వఘోషుడు." అశ్వఘోష చరిత్రములోని ఈకథ సత్యమేమో; అశ్వఘోషుడు సాకేతవాసి; పాటలీపుత్ర రాజుదగ్గర చాల కాల ముండెను; ఆరాజోడినపుడు డీవండితుని 'కనిష్కుని'కి కానుకగా నొసంగిరి.

12 ఏకశ్లోకశాస్త్రము - ఇది నాంజోక్యాటలాగు 1212 నంబరున ఉన్నది. ఒకశ్లోకమును గైకొని తాను స్వయముగా జేసెను. ఈగ్రంథమును 'ఎడ్కిన్సు' అనువాదము చేసెను. ఈశ్లోకభావ మిట్లున్నది. "చావు లేదు; పుట్టుక లేదు; అనిత్యము లేదు; నిత్యము లేదు, ఏకత్వము లేదు, అనేకత్వము లేదు. కనబడునది లేదు. కనబడనది లేదు." ఈసత్యమును 'నాగార్జున యతి' బోధించెను. 'బుద్ధుడు' సత్యమునుగూర్చి యిట్లు చెప్పెను. "సత్యమొక్కటియే; సూర్యునివెల్గు అన్ని రాజ్యము

లలో నొకటియే. కండ్లుండి చూడగల ప్రతివాడు, దానిపక్వ్వముయొక్క చిహ్నములు చూడవచ్చును."[164]

13 ప్రణ్యమూల శాస్త్రటీక- (ప్రాణ్యమూల శాస్త్రటీక) దీనిలో నిర్వాణవర్ణనము గలదు. ఆత్మ, ప్రకృతియనునవి లేవని 'నాగార్జునుడు ' వ్రాసెను.

"గట్టిగా ప్రయత్నము చేయకుండ నున్నది, లభించనట్టిది, కాలమునకు లోబడనిది, శాశ్వతమైనదని చెప్పుటకువీలుకానిది, దేనికి ఆరంభములేదో అంతమునకురానిదో, ఇదియే నిర్వాణ మనబడును."[165]

'ఇత్సింగు' ప్రజ్ఞాసూత్రముల నన్నిటి పదివేల అధ్యాయములుగా వ్రాయనెంచెను. 'నాగార్జునుడు, శిష్యుడు నీలనేత్రుడు' నిర్వాణముపై వ్రాసిరి.[166] 'బీలు' పండితుడు 1440 పంక్తులలో దీని ననువాదము చేసెను. ఇందు 'నిర్వాణ ప్రకరణము' మాత్రము కలదు.

నాగార్జునుని 'ప్రణ్యమూలశాస్త్ర టీక' అనువాదము. (నిర్వాణము)

1 అన్నివస్తువులు అసత్యమేయైనచో, దేనినుండి దేనిని తొలగించి 'నిర్వాణము' మిగిల్చెదమో, చెప్పుట కసాధ్యముగా నున్నది.

---

164 Har Dayal-Bodhisatwa doctrine P. 238 See also, W. H. Dawson-Buddha and Buddhism.

165 S. Beal – Buddhism in China. P. 40.

166 S. Beal – Ind. Anti. XV. P. 353.

2 అన్ని సత్యములే యైనచో, మనము జననమరణములను వాస్తవికమగు ఉనికిని ఎట్లుతొలగించి నిర్వాణము చేరగలము?

3 దేనికొరకు ప్రయత్నించి సంపాదించమో, ఏది కొలది కాలముగాని సర్వకాలముగాని ఉండదో, ఏదిపుట్టదో, ఏది చావదో, అదియే 'నిర్వాణము' అనబడును.

4 'నిర్వాణము' భావము అని పిలువబడదు; అట్లయినచో అది వార్ధక్యమును, మృతిని అంగీకరించును. వాస్తవముగా ఉనికి, ఉనికిలేమి ఇవిరెండును ప్రకృతిస్థితులు. కాబట్టి లక్షణ రహితములగుచున్నవి.

5 నిర్వాణము భావమేయైనచో, అది ఆత్మీయమైనది. వాస్తవముగా, వ్యక్తీకరింపజాలనిది, అనాత్మీయముగా చెప్ప బడుచున్నది.

6 నిర్వాణము భావమేయైనచో, అది 'అనువేదన' లేని దిగా పిల్వబడజాలదు; ఏలనన జడత్వము అనువేదన నుండి సంభవముకాదు. ఇదియే దానివిశిష్టత.

7 నిర్వాణము భావముకానిచో, అది అభావముకాదు; జీవికి తావులేనిచో, జడపదార్ధమున కెట్లు తావుండును?

8 నిర్వాణము శూన్యమైనచో, అది అనువేదనలేనిదిగా ఎట్లు పిల్వబడును? ఏవస్తువైన అనువేదన గ్రాహ్యముకానిచో, దానిని శూన్యమనిపిల్చుట ఆశ్చర్యకరముగానున్నది.

9 కార్యకారణ సంబంధములో తగులుకొన్నచో, సనాతన మైన ఉనికి వచ్చుచుండును; తగులుకొనకుండ యున్నచో, నిర్వాణముకల్గును.

10 'బుద్ధుడు' సూత్రములో జెప్పినాడు, "ప్రత్యేకమగు 'ఉనికి' 'ప్రత్యేకమగుఉనికిలేమి' యే నిర్వాణము. ఈనిర్వాణము ఉనికికి విరుద్ధము; ఉనికిలేమికి విరుద్ధమే.

11 ఉనికి, ఉనికిలేమి, అనే రెంటిసమ్మేళనముచేత నిర్వాణము కల్గునన్నచో, అవిరెండు ఒకటియే యగును. ఇది అసంభవము.

12 ఉనికి. ఉనికిలేమి, అనే రెంటిసమ్మేళనమువలన నిర్వాణము కల్గినదన్నచో, అపుడు 'నిర్వాణము' 'అనువేదన' లేనిది కాదు. ఏలనన ఉనికి ఉనికిలేమి, అనువేదనతో గూడియున్నవి.

13 ఉనికి, ఉనికిలేమి అనేరెంటి సమ్మేళనముచేత నిర్వాణము కల్గినదన్నచో, అపుడు 'నిర్వాణము' అనాత్మీయము కాదు; ఏలనన ఇవిరెండు ఆత్మీయమైనవి.

14 ఉనికి, ఉనికిలేమి, ఒకటిగా కలసినచో, నిది ఎట్లు నిర్వాణమగును? ఈరెంటికి సమాన గుణములులేవు. చీకటి, వెల్గులు కలియునా?

15 ఉనికి, ఉనికిలేమియే నిర్వాణమైన, వానివిభేదముల నెట్లు కనుగొనగలము?

16 వానిభేదమును గుర్తించినచో, వానికలయిక నిర్వాణమగును; ఉనికి, ఉనికిలేమి, భావమునుఏదిపరిపూర్ణముచేయునో, అది ఈరెంటియొక్క వ్యతిరేకార్థములను బూర్తిచేయును.

17 'తథాగతుడు' వెళ్లిపోయినతర్వాత, ఉనికినిగూర్చి, ఉనికిలేమిని గూర్చి ఏమియు చెప్పడు. అతని ఉనికిలేదనికాని, తద్వ్యతిరేకముగాగాని ఆయన చెప్పడు.

దీనిసారాంశమేమనగా, 'నిర్వాణము' తథాగతుని స్వభావముతో నేకీభవించును. దానికి స్థలము, కాలపరిమితులు లేవు.

14విద్యాధరపిటక-దీనికర్త 'నాగార్జునుడు' అని 'ఇత్సింగు' వ్రాతలవలన తెలియుచున్నది; ఈయతిశిష్యుడు 'నంద' దీని నంతయు వల్లించెను; ఈ 'పిటక' లోని చాలభాగము లుప్తమైపోయెను. ఇందులోని 12000 శ్లోకములను 'నంద' జ్ఞప్తియందుంచుకొనెనని తెలియవచ్చుచున్నది.

15 మాధ్యమికకారిక: దీనిలో"నిర్వాణము'నుగూర్చియిట్లు వ్రాయబడియున్నది.

శ్లో॥ నిర్వాణస్య చ యాకోటి: స్మరణస్య చ
న తయోరంతరం కించిత్ సుసూక్ష్మమపి విద్యతే॥
(అధ్యాయము 25-కారిక 20.)

"నిర్వాణకోటికి స్మరణ కోటికి మధ్య స్వల్పమైన యంతరమును లేదు.

నాగార్జునుని 'మాధ్యమిక శాస్త్రము' జపానులోగూడ ప్రఖ్యాతిగాంచినది. దీనిని యతి, శిష్యుడు 'నీలచక్షుసు' కలసి రచించిరని, 'కోట్సు' పండితుడు వ్రాసెను; మూలమాధ్యమిక కారికల కీయన స్వయముగా 400 కారికులకు, 27 అధ్యాయములలో 'అకుతోభయ' అను వ్యాఖ్య వ్రాసెను. ఇది నేడు 'టిబెటు'లో గాన్పించుచున్నది. 'కుమారజీవుడు' దీనిని క్రీ.శ. 405లో చైనీయభాషలోని కనువాదము చేసియుండెను. ఇది 4 సంపుటములు, 27అధ్యాయములలో నున్నది. 'నీలచక్షుసు' గురువుగారి సిద్ధాంతములను 500 విశదీకరించెను.

'మాధ్యమిక సూత్రముల' 'భూతదూత' లోని రెండుశ్లోక ముల భావమిట్లున్నది. "బుద్ధుడు పోయిన తర్వాత, ఆయన ఇచటనే యింకను ఉన్నాడని తలంచవలదు. ఉన్నను, ఉండక పోయినను, జీవించి ఉన్నపు డిచటనే ఉన్నను, ఇట్లు తలంచ వలదు. ఆయన జన్మభేదముల కతీతుడు ఉన్నదన్న శాశ్వతము. అది లేదన్న నాస్తికత్వము-ఉన్నను, లేకపోయినను, జ్ఞానులు వినిలో నంటుకొనియుండరు.[167] "ఈయన రచించిన మూల మాధ్యమిక శాస్త్రము" పరదేశములలో కూడ విశేషఖ్యాతి గాంచినది.

16 మాధ్యమిక సూత్రములు- ఇది రెండు భాగములలో నున్నది. మొదటి భాగముపేరు 'సంప్రతిసత్య'; రెండవభాగము 'పరమార్థసత్య'.

'నాగార్జునుడు' (160-194) 'మహాయాన శాస్త్రము' రచించెనని, దీనికి చైనీయ అనువాదము లేదని 'టి. రిచర్డు' వ్రాసెను. 'మహాయాన వింశక' అను గ్రంథమును రచించెనని కొలఁదరు వ్రాసిరి; మాకది లభించలేదు.

17 ద్వాదశనికాయశాస్త్రము- ఇది 12 అధ్యాయములలో నున్నది. దీని అనువాదము చైనీయభాషలోనికి 'కుమారజీవుడు' క్రీ. శ. 408లో జేసెను. ఇది 'జపాను'లోకూడ ప్రఖ్యాతి గాంచినది. 'దేవ' వ్రాసిన 'శతశాస్త్రము' కూడ 'జపాను'లో ఖ్యాతిగాంచినది. దీనిని 'కుమారజీవుడు' క్రీ. శ. 404 లో

[167] A. Coomaraswamy-Buddha and the Gospel of Buddhism, P. 319.

రెండు సంపుటములలో పది అధ్యాయములలో ననువదించెను. ద్వాదశ నికాయశాస్త్రము 'నాంజోక్యాటలాగు' 1186 నంబరున ఉన్నది.

18 సుఖావతివ్యూహము- 'కుమారజీవుడు' దీనిని చైనీయ భాషలోనికి క్రీ. శ. 402లో మార్చెను. దీనికి 'ప్రజ్ఞాపారమిత సూత్రముల'తో సంబంధము గలదు. శూన్యభావము చక్కగా నిందు ప్రకటించబడినది. క్రీ. శ. 147లో నీగ్రంథమును, 'అన్షికయో', లోకరక్ష యనువారు చైనాకు గైకొని పోయిరి. ఇది క్రీ. శ. 148-170 మధ్య చైనీయభాషలో ననువాదమాయెను.

'పెద్దసుఖావతి వ్యూహము'కు (అమితభ) ప్రజ్ఞాపారమిత సూత్రములతో సంబంధముగలదు. శూన్యవాదము ఇందు స్పష్టపడియున్నది. అమితభ, చైనాలో షికావో, లోకరక్ష' యనువారలచేత క్రీ. శ. 2వ శతాబ్దములో నేర్పరచబడెను. తరువాత ననేక అనువాదములు చేయబడినవి. 'సంఘవర్మ' క్రీ. శ. 252లో జేసెను. 'కుమారజీవుడు' క్రీ.శ. 465లో జేసెను. చిన్నసుఖావతి వ్యూహమును గూడ అనువదించెను. నాగార్జునుని కాలమున పునర్జన్మనుగూర్చి మూడుసిద్ధాంతములు ప్రచారమం దుండెను.

1 మైత్రేయునియొక్క 'తుషితస్వర్గము'లోని పునర్జన్మ 2 'అక్షోభ్యుయొక్క' తూర్పుభూమిలో పునర్జన్మ, 3 'అమితభ' యొక్క పశ్చిమపరిశుద్ధ భూమిలో పునర్జన్మ.

నాగార్జునుని గ్రంథములలో 'అమితభ' సిద్ధాంతములకు సంబంధించిన విషయములు గలవు. ఆయన చనిపోయినపుడు పశ్చిమస్వర్గము వైపునకు ముఖము త్రిప్పెను. 'జపాను' దేశములోని 'జోడో', షిన్' తెగల కీయన మొదటి ప్రధానగురువాయెను; రెండవవాడు వసుబంధు డాయెను. 'అమితభ' బౌద్ధ వాఙ్మయము చైనాలో నభివృద్ధియాయెను. నాగార్జునుని గ్రంథములలోని కొన్నిశ్లోకములు భక్తిసంబంధములు. 'మహాయాన సూత్ర సుఖావతివ్యూహము (అమితాయు సూత్రములు) చైనాభాషలోనికి క్రీ. శ. 148-170 మధ్యలో మార్చిరి అని, 'కిరన్' పండితుడు వ్రాసెను. కాని క్రీ. శ. 147-186 మధ్య మార్చిరని, 'సర్ ఛార్లెస్ ఇలియట్' వ్రాసెను; ఇందులో చిన్న సూత్రములు క్రీ. శ. 402లో మార్చబడినవి.

'తొఖార'నుండి ఒకపురోహితుడు, చైనీయదేశమునకు మొదట 'అమితభ' సూత్రమును క్రీ. శ. 147లో తీసికొని వచ్చెనని, దానిని చైనీయభాష'లోనికి క్రీ.శ. 148-170మధ్యలో మార్చిరని 'ఐటలుపండితుని వ్రాతలవలన దెలియుచున్నది.

'అమితభ' శాఖకు నాగార్జునుడు మొదటివాడు; 'వసుబంధుడు' రెండవవాడు. ఈయన 'అమితాగుస సూత్రోపదేశ' రచించెనని, క్రీ. శ. 529లో 'బోధిరుచి' చైనీయభాషలోనికి మార్చెనని, ఈయన 'అసంగుని' చిన్నసోదరుడని, వసుబంధుని కృతులు వేయికలవని 'టి. రిచర్డ్' అను విద్వాంసుడు వ్రాసెను.

19 భావసంక్రాంతిసూత్రము- సంస్కృతములో మూలము పోయినది. టిబెటీయ, చైనీయ అనువాదములను బట్టి తిరిగి

సంస్కృతభాషలోని కనువాదము చేసిరి. టిబెటీయభాషలో మూడును, చైనీయభాషలో నొకటియును గలవు. వీనిని భావసంక్రాంతి పరికథా (మాధ్యమ) భావసంక్రాంతి, భావ భేదశాస్త్రము' అందురు.

'భావపరికథ'లో 16 శ్లోకములు, మధ్యమభావములో 19 శ్లోకములు, చైనీయగ్రంథములో 27 వాక్యములు గలవు. వీనికి టీక, వ్యాఖ్య మైత్రేయనాథుడు రచించెను. ఈ మైత్రనాథు డెవ్వరో తెలియకున్నది. 'తారానాథు' డొకని పేర్కొనెను. ఆయన శ్రీపర్వతమున నున్నట్లు తెలియుచున్నది. క్రీ. శ. 5వ శతాబ్దములో నొక మైత్రనాథుడు (మైత్రపాదుడు) ఉండెను. ఈయన ఆర్యసంగుని గురువు. ఆరంభమున "నమస్సర్వ బుద్ధబోధి సత్త్వేభ్యః" అని ఉన్నది. మొదటిదానిలో 'ఏవం మయాశ్రుతమ్' అని ఆరంభము. చివర "ఆర్యభావ సంక్రాంతి ర్నామ మహాయాన సూత్రసంపూర్ణః" అని ఉన్నది. ఇందు 15 శ్లోకములు గలవు.

1 చైనీయ అనువాదము క్రీ.శ. 386-534 మధ్యనున్న 'బోధిరుచి' ప్రణీతము — 15 శ్లోకములు

2 ,, క్రీ. శ. 534-550 మధ్యనున్న 'బుద్ధశాంత' ప్రణీతము.

3 ,, క్రీ. శ. 618-650 మధ్యనున్న 'ఇత్సింగు' ప్రణీతము.

టిబెటీయ అనువాదము 'జినమిత్ర'యు 'దానశీల' యును జేసిరి. ఇందు 15 శ్లోకములు గలవు. 'నమః సర్వజ్ఞాయ'— మైత్రేయనాథకృత టీకః అనికలదు.

దీనిలోని 5వశ్లోక భావమిట్లున్నది. "హేతువులేక మూలము, స్థితిగతుల సమానావశ్యకత చేతనే జ్ఞానము కల్గుచున్నది. కన్ను పదార్థమును జూడదు. మానసికస్థితు లుండవు. కనబడు నదంత మిథ్యగా నున్నది. ఇదియే పరిపూర్ణమైన సత్యము. దీని నేదియు గ్రహింపజాలకున్నది." శంకరుని మాయావాదము 'నాగార్జునుని' వాదమునుండియే కల్గినదని విద్వాంసులెల్ల రంగీకరించిరి.

20 ప్రజ్ఞామూల శాస్త్రటీక—ఇది నాగార్జున రచితమని 'గైల్సుపండితుడు' చైనీయ సారస్వత చరిత్రములో వ్రాసెను. (పుట 119).

21 శూన్యసప్తతి- నాగార్జునకృతము.

22 మధ్యాంతానుగమ శాస్త్రము — నాంజో క్యాటలాగు 1246న ఉన్నది. నాగార్జున రచితము.

23 ఉపాయ కౌసల్య శాస్త్రము—ఇది నాగార్జున రచితము.

24 సూత్రసముచ్చయము – 'శాంతిదేవుని' ప్రకారము 'బోధిచారి నాగార్జునుడు' దీని కర్తయని తెలియుచున్నది.

25 ధర్మసంగ్రహ— ఇది 'నాగార్జున' రచితమని తెలియు చున్నది. ఇందు పారిభాషికపదముల సముదాయము గలదు. నాగార్జునరచితము కావచ్చును; కాకపోవచ్చును; అనుమానా స్పదమని 'కీత్' వ్రాసెను.[168]

---

[168] A. B. Keith—Buddhist Philosophy in India and Ceylon P. 229.

'తారానాథుడు' నాగార్జున రచితములైన యుక్తిషష్టిక (60 Arguments.) వైదుల్య అను రెండుగ్రంథములను పేర్కొనెను. ఇంకను కొందరు విద్వాంసులు, 'సురలేఖ, మరాలజ్ఞాన, ధర్మధాతుస్తోత్ర, సూత్రసంగ్రహ, నయనచికిత్స, విషవైద్య చికిత్స, మున్నగు గ్రంథములు బోధిసత్వ నాగార్జునకృతములని వ్రాసిరి. గండవ్యూహ, కూడ ఈయన రచనయని కెరన్ వ్రాసెను. బృంద, చక్రపాణి మున్నగువారు నాగార్జునుని రసాయనికసూత్రములు పాటలీపుత్రము (పాట్నా)లో రాళ్లపై చెక్కబడిన వని వ్రాసినారు. 'హర్షచరిత్రము'లో నాగార్జునుని లోహశాస్త్ర ప్రశంస గలదని తెలియుచున్నది. ఈయన విషవైద్యము'ను బాణుడు ప్రశంసించి యుండెను. ఈయన సిద్ధిశాస్త్రము, జననశాస్త్ర విషయిక అమూల్య గుహ్య జ్ఞానములయొక్క భండారమై యున్నదని 'జయచంద్ర విద్యాలంకారు' అను విద్వాంసుడు వ్రాసెను. కాని పైగ్రంథ రచయిత ఏనాగార్జునుడో తెలియదు. ఖగోళ, వస్తు, ద్రవ్యగుణ, వైద్యశాస్త్రాదుల నెరింగినవాడని, 'సుశ్రుతము'ను సంస్కరించెనని, చైనాలో నీయన 'నేత్రచికిత్స' నంద రెరుంగుదురని విద్వాంసులు వ్రాసిరి. నయనచికిత్స, సిద్ధనాగార్జున రచితము కావచ్చును.

2 సిద్ధనాగార్జున కృతగ్రంథములు

1 మహాయాన వింశక- ఇదికూడ మూలము పోయినది. టిబెటీయ, చైనీయ అనువాదము లున్నవి. వీనినుండి తిరిగి సంస్కృతములోనికి మార్చిరి. 'చైనీయభాషలో' మహాయాన గాధ (కారిక) వింశక శాస్త్రమందురు. అదియే 'మహాయాన

వింశతి, తత్త్వమహాయానవింశతి' యనబడును. టిబెటులో రెండు అనువాదములు గలవు. ఇది బోధిసత్వ నాగార్జున రచితమనుట కాధారములు లేవు. ఏలనన క్రీ. శ. 7వ శతాబ్దిలోపున ఉన్న చైనీయగ్రంథము లేవియు దీనిని పేర్కొనలేదు. కనుక ఈగ్రంథమును క్రీ. శ. 650వ సంవత్సరప్రాంతమున నున్న సిద్ధనాగార్జునుడు రచించియుండుట తథ్యము.

'వింశక'యనగా 20అయినను, 22,23, 24 శ్లోకములుకొన్నిటిలో గలవు. టిబెటీయ అనువాదమును భిక్షుకీర్తి, 'భూతప్రజ్ఞ అనువారు చేసిరి. క్రీ. శ. 800 లోని పండిత చంద్రకుమార, భిక్షు శాక్య ప్రభలు దీని ననువదించిరి. 'పాలరాజుల' వంశములోని 'గోపాలుని': సమకాలీనుడు 'దానపాలుడు' అను చైనీయుడు (క్రీ. శ. 980-1000) కూడ చేసెను. క్రీ. శ. 700 ప్రాంతము లోని 'ఇంద్రభూతి' తన 'జ్ఞానసిద్ధి' XI-8లో నొకశ్లోకమును వ్రాసెనని, అది 'మహాయానవింశక' 22లో కూడ కలదని, 'విధుశేఖర భట్టాచార్యులు' అను విద్వాంసుడు వ్రాసెను. అందుచేత నీగ్రంథము క్రీ. శ. 700 కి తర్వాతగ్రంథము కాదని విద్వాంసుల అభిప్రాయము.

ఆరంభము ఇట్లున్నది: 'నమస్ త్రిరత్నాయ'
'నమోవాచ వాచ్యం అపిదయ యో మొనదేశితం
ధీమతె వీతరాగాయ బుద్ధాయా చింత్యసక్తామ్॥

చివర 'ఆచార్యనాగార్జున కృతమ్' అని కలదు. 'మహాయాన వింశకమ్ 'సంపూర్ణమ్' అనికలదు. ఏ'నాగార్జునుడు' వ్రాసినను ఇందలి భావములు భాషాంతరీకరణము చేసికోవచ్చును. "ఎవ

రైతే సర్వోత్కృష్టమైన సత్యమును సాక్షాత్కారము చేసి కొనినో, ప్రతీత్యసముత్పాద మెరుంగునో ఆయనకు ప్రపంచము శూన్యము. సంసారము, నిర్వాణము ప్రత్యక్షమాత్రమే. వాస్త వముగా వానికిఉనికి లేదు. ఇది యంతయు మనస్సే కాని వేరుకాదు; మాయవంటిది; ఈచిత్తచక్రము నశించినపుడు అన్నిపదార్థ ములు అదృశ్యమగును; అందుచేత నవి 'అనాత్మ' యనబడును. అనగా ఏవిధమగు నిర్ణీతస్వభావము లేనట్టివి."

నాగార్జునకృత మహాయాన వింశక అనువాదము

1 జ్ఞానముగలట్టి అన్నిబంధములనుండి విముక్తుడైన, భావ మున కతీతమైన శక్తులుగల బుద్ధునికి నేను నమస్కరించు చున్నాను. ఆయన మాటలచేత వివరించుటకు వీలులేని సత్య మును మనకు ప్రేమతో బోధించియుండెను.

2 సర్వోత్కృష్టమైన సత్యములో 'ఉత్పాదన' లేదు. వాస్త వముగా 'నిరోధము' లేదు. 'బుద్ధుడు' ఆకాశము వంటివాడు. (ఆకాశమునకు పుట్టుకలేదు, విరామము లేదు) జీవులు వాని వలె ఉన్నవి. అందుచేత అవియన్ని అట్టి స్వభావము కలవి.

3 ఇహ, పరలోకములలో జననమనునదే లేదు. పరిస్థితుల ననుసరించి 'సంస్కృత' ఉత్పన్నమగు చున్నది. అందుచేత అది స్వభావముచేత శూన్యము. ఈవిషయము సర్వజ్ఞుని జ్ఞాన దశను అందుచున్నది.

4 స్వభావరీత్యా అన్నివస్తువులు ప్రతిబింబములవలె పరిగ ణింప బడుచున్నవి. అవి నిర్మలములు; స్వభావసిద్ధముగా నిశ్చలమైనవి; ద్వంద్వము లేనివి; సమానమైనవి, సనాతనములు;

సర్వకాల సర్వావస్థలయందు అదేవిధముగా నుండునవి. (తథాతా.)

5 వాస్తవముగా ఐహికసుఖాభిలాషులు ఆత్మను అనాత్మగా దలంతురు. అదేవిధముగా వారు సౌఖ్యమును దుఃఖమును, ఔదాసీనతను, వికారములను, ముక్తిని భావించుచుందురు.

6-7 ప్రపంచముయొక్క- ఆరు రాజ్యములలోని పుట్టుక, స్వర్గములోని అధికతమమగు సౌఖ్యము, నరకములోని విశేష బాధ,- ఇవియన్ని సత్యపదార్థ కోటిలోనివిగా యంగీకరింపబడ జాలవు. యోగ్యతలేని పనులు చేయుటచేత విశేషదుఃఖము, వార్థక్యము, రోగము, మరణము, కల్గునను భావములుగాని, యోగ్యతగల పనులు వాస్తవముగా మంచి ఫలితములు నిచ్చునను తలంపులుగాని సత్యములు గావు.

7 అరణ్యము కారుచిచ్చువలన దగ్ధమైనట్లు తప్పుఅభిప్రాయముల చేత జీవులు మనోవికారమను అగ్నిలో దహించబడి, నరకాగ్నిలో బడి కూలుచున్నవి. 'మాయ' నిలచియున్నట్లే, 'జీవులు' సాక్షాత్కరించును. జగత్తుమిథ్య; అది కార్యకారణ సంబంధమును బట్టి నిల్చుచున్నది.

8 (పాఠాంతరము) చిత్రకారు డేవిధముగా తానే వ్రాసిన భయంకరమైన 'యక్ష' పటమునుజూచి భయపడుచుండునో, అట్లే మూర్ఖుడు తన తప్పు అభిప్రాయముల చేత ప్రపంచములో భయపడుచుండును.

9 (పాఠాంతరము) మూర్ఖుడు చిత్తడినేలలో బడి ఎట్లు దానిలో మునిగిపోవునో, అట్లే మూర్ఖుడు, తప్పుఅభిప్రాయ ములనే చిత్తడినేలలో మునిగి దానినుండిబయటకు రాజాలడు.

10 ఉనికిలేనట్టి ఒకవస్తువును ఊహించుకొన్నచో దుఃఖము అనుభవమునకు వచ్చుచున్నది. వస్తువు వస్తుగత జ్ఞానమునకు సంబంధించిన తప్పుఅభిప్రాయముల యొక్క విషముచేత జీవులు హింసింపబడుచున్నవి.

11 కనికరముగల హృదయముతో నీదిక్కులేని వస్తువులను గాంచి, వాని ఉపయోగార్థము 'బోధికార్యము' (జ్ఞాన)యొక్క అభ్యాసములను జేయవలయును.

12 అందుమూలముగా కావలసిన పరికరముల సంపాదించు కొని విశేషమైన బోధి (జ్ఞాన)పొంది, ఆవ్యక్తి,ప్రపంచమునకు మిత్రుడు, తప్పుఅభిప్రాయముల బంధమునుండి విముక్తిపొంది నట్టి వాడు అగు 'బుద్ధుడు' కావలయును.

13 'ప్రతీత్య సముత్పాదము' నెరింగి ఎవడు సర్వోత్కృష్ట మైన జ్ఞానమును బొందునో వాడు ప్రపంచమును 'శూన్యమని', ఆదిమధ్యాంత రహితమైనదని యెఱుంగును.

14 సంసారము, నిర్వాణము కేవలము ప్రత్యక్షమాత్రము; సత్యము కలుషరహితమైనది; మార్పులేనిది, ఆదినుండి నిశ్చల మైనది, ప్రకాశింపచేయబడినది.

15 ఒకడు జాగ్రదావస్థలోనుండగా స్వప్నావస్థలో తాను గాంచిన వస్తువును కాంచడు; ఆలాగుననే, అజ్ఞానమనే చీకటి నుండి మేల్కొన్నపుడు, వానికి ప్రపంచ మదృశ్యమగును.

మాయయొక్క పుట్టుక భ్రాంతిమూలకము; ప్రతివస్తువు సంస్కృత; అట్టిచో యదార్థవస్తువని చెప్పతగినది ఏదియు లేదు. అన్నివస్తువుల స్వభావము అట్టిదే.

16 పుట్టుకగలవాడు తన్ను తానే పుట్టించుకొన జాలడు. ఉత్పత్తియనునదే జనులలోనున్న ఒక దురభిప్రాయము. అట్టి అభిప్రాయములు, తదభిప్రాయగత జీవులు, యివిరెండును హేతుబద్ధములు కావు.

17 మనసు (చిత్త) వినా ఇతరము లేదు; ఈఇతరము భ్రాంతి మూలకము, కాబట్టి మంచి, చెడు పనులు చేసినచో వాని వలన మంచి, చెడు జన్మలు కల్గును.

18 మనోచక్ర మణచివేయబడినపుడు అన్ని వస్తువులు అణగి పోవును. కాబట్టి పదార్థములన్నియు ఆత్మరహితములు, (స్వతంత్రస్వభావము కలవి) కాబట్టి అవి నిర్మలమైనవి.

19 స్వతంత్ర స్వభావములేని వస్తువులను నిత్యమైనవని, ఆత్మయుని, ఆహ్లాదకరమైనవని తలంచుట చేత, బంధము అజ్ఞానములచేత నావరింపబడినవానికి, ఉనికి కాన్పించుచుండును.

20 మహాయానములో ప్రవేశించకుండ, తప్పు అభిప్రాయములనే నీరుతో నిండిన సంసారమనే మహాసముద్రముయొక్క ఆవలితీరమున కెవరు చేరగలరు? ఈజగత్తు అజ్ఞానమునుండి ఉత్పన్నమైనదని ఎవరు సాకల్యముగా తెలిసికొందురో వారిలో నెట్లు ఈతప్పుభావము లుద్భవిల్లును?

'ఆచార్య నాగార్జున మహాయాన వింశక' సంపూర్ణము.

2 ప్రజ్ఞాదండ (Eng. The staff of wisdom) (టిబెటీయ భాషలో శేఖదబ్) డబ్లుయూ యల్. కాంప్ బెల్ (W. L. Campbell) దీనిని సంపాదించెను. దీనికర్త 'మొదటినాగార్జునుడనుట కాధారములు లేవు. 'సిద్ధనాగార్జునుడే' రచించెనని తోచుచున్నది. ఏలనన చైనీయలేఖకు లెవరు దీనిని చేర్కొనలేదు; అనువాదము చేయలేదు. ఇందలి 9 శ్లోకముల భావ మిట్లున్నది.

1 పదార్థముల నిజస్వభావ మెరింగినవారికి, గురువుతో నవసరమేమి? రుగ్మతపడి తేలినవానికి, వైద్యునితో నవసరమేమి? ఏరుదాటినవానికి పడవతో నిమిత్తమేమి? (Folio 5.)

2 ఒకజ్యోతిష్కుడు లెక్కలువేసి గుణించి, చంద్రుని నక్షత్రముల గమనమునుగూర్చి భవిష్యత్తు చెప్పుచుండును. కాని ఆయన తనయింటిలోనున్నవారు, తనస్త్రీలు దుర్నడత నడచుట యెరుంగడు. (Folio 7)

3 ఆహార, నిద్రా, భయ, మైథునక్రియలలో మనుజులు జంతువులు సమానము. మనుజుడు మతకర్మలు అభ్యాసము చేయుటచేత, పశువుకంటె నధికుడు. అందుచే మతములేనిచో, మనుజుడేల పశువుకు తుల్యుడుకాడు? (Folio 8.)

4 కాలము తరుగిడిపోవుచున్నది. విద్య అనంతము; ఒకని జీవిత మెంతకాలమో, ఎవరికి తెలియదు. అందుచేత హంసవలె నీటినుండి పాలను విడదీయుచుండక ఎరింగి, అతిశ్రేష్ఠమైన మార్గములో నిమగ్నుడవగుము. (Folio 13).

5 అనేక నక్షత్రములు ప్రకాశించిన, భూమి కాభరణముగానున్న చంద్రుడుకూడ ప్రకాశించిన, సూర్యు డస్తమించినపుడు అది రాత్రి యగుచుండును. (Folio 14)

6 కళలు, చేతిపనులనుగూర్చి చెప్పు శాస్త్రమంతయు జీవనోపాధిని సంపాదించు శాస్త్రమగును; కాని ప్రాపంచిక బంధమునుండి తప్పించుకొనిపోవు శాస్త్రము సత్యమైన శాస్త్రము కాదా? (Folio 15.)

7 తనకై ఒకవస్తువును కోరనివాడు దానిని ఇతరులకొరకు కూడ కోరడు. (Folio 20.)

8 మూర్ఖులు నీటిమీద అలలవంటివారు. వారేదిచేసిన అది శీఘ్రముగా తుడిచివేయబడుచున్నది; కాని న్యాయబుద్ధి, సత్యము, రాతిమీద చెక్కడపుకనివలె శాశ్వతమై యుండును. ఏలనన వారి అల్పకార్యములుకూడ సుస్థిరములు. (Folio 23)

9 తెలివిగల, శాంతమైన, తృప్తిపడునట్టి, సత్యవంతులైన వారితో స్నేహము చెరసాలలో గల్గినప్పటికి, అవివేకులగు 'సార్వభౌములతోటి సంపర్కము'కన్నమిన్నయగును.[169] (Folio 23.)

3 కక్షపుట తంత్రము- ఇది 'సిద్ధనాగార్జున' కృతము 'ఇంద్రజాల విద్యాసంగ్రహ' అనే గ్రంథములో 264-390 వరకు 126 పుటలు ఈగ్రంథమే.

శ్లో॥ యంశాంతః పరమాలయః పరాశివః
కంకాల కాలాంతకో। ధ్యానాతీత అనాది
నిత్యనిచయః సంకల్ప సంకోచకః।

ప్రార్థవతర్వాత అనేక తంత్రగ్రంథముల పేర్లు గలవు. మేరు తంత్రము మొదలగువాని, అందలి సారము వ్రాసెదనని గ్రంథ

169 W. Y. Evans Wentz — Tibetan Yoga and secret doctrines. P. 62 and 63,

కర్త శివధము. ఇందు 20 పటలములు కలవు. 'సర్వవశీకరణము. 2 అధరాజవశ్య మాహా. 3 అధ స్త్రీవశ్యమాహా. 4 అధ పతివశ్యమ్. 5 అధ ఆకర్షణమ్. 6 అధ స్తంభనమ్. 7 అధజల స్తంభనమ్. 8 అధ సైన్య స్తంభనమ్. 9 అధమోహనమ్. 10 అధమారణమ్. 11 అధ విద్వేషమ్. 12 అధ కేతునం. 13 ఇంద్రజాల విద్యాసాధనమ్. 14 అధ యక్షిణీసాధనమ్. 15 అధ అంజనమ్. 16 అజ్ఞాతనిధానస్య గ్రహణమ్. 17 మృత సంజీవినీ విద్య మొదలగు వింశః పటలః అని ఉన్నది. ప్రతి పటలము చివర 'ఇతి శ్రీనాగార్జున సిద్ధవిరచితే కచ్ఛపుటే మహాతంత్రే మంత్రఖండే—పటలం అనికలదు. ఆఖరది కాల జ్ఞానయోగకధనం నామత్రయో వింశతి పటలః" అని ఉన్నది. "ఓం ఆంగ్లాం ఐం హ్రీం సౌః ఈం క్రోం—ఇది పంచకాళి మంత్రము. ఇది మాంత్రికులకు, తాంత్రికుల కుపదేశాగము. ఛండాలి మంత్రము - "ఓం ఆం హ్రీం ఐం క్లీం గ్లౌం సౌః క్రోం ఎహి ఎహి మాతంగీశ్వరీ" అనికలదు. అష్టోత్తర శతం జపం - వ్రాతప్రతిలో 130 పుటలున్నవి. త్రయోవింశతి పటలములు కలవు. చైనీయగ్రంథములు దీనిని పేర్కొనకపోవుట చేత, 'శ్రీ సిద్ధనాగార్జున సిద్ధగురు బ్రహ్మణేనమః'అని ఉండుట చేత, ఇది 'సిద్ధనాగార్జున' రచితమని క్రీ.శ. 650లో వ్రాయ బడినదని తెలిసికొనవచ్చును. 'వీబరు' ఈ గ్రంథమును గార్స్యయే ప్రశంసించి యుండెను.[170] "శ్రీగారీశాయ మంగళం శ్రీపార్వతీ

[170] A. Weber - The History of Indian literature P. 265. "Magic - The work of some extent on this subject bears the name of Nagarjuna, a name of high renown among the Buddhists.

పరమేశ్వరార్పణమస్తు సదాశివ గురుబ్రహ్మార్పణమస్తు" అని ఉన్నవి. 'నృసింహ మహాంభజే' అని మొదట కలదు. బౌద్ధుల గ్రంథములలో నిట్లుండుటకు కారణమేమో!

తంత్రగ్రంథములు 4 విధములని, ఇందు 2 గుహ్య (మర్మ) సంబంధములని ఈరకము 'నాగార్జునుని' చేతనో, అతని అనుచరులచేతనో క్రీ. శ. 2 లేక 3 శతాబ్దములలో బయలుదేరెనని, 'ఎవాన్స్‌వెన్జ్' అభిప్రాయము. (Tibetan Yoga and doctrines P. 120.) కాని వీనికర్త 7వ శతాబ్దములోని 'సిద్ధనాగార్జు' డనుట స్పష్టము.

4 కనకమంజరి:- ఇది వైద్యగ్రంథము. చెన్నపట్టణములోని ప్రాచ్యలిఖిత పుస్తకాలయములో నున్నది. దీని ఆరంభములో 'శ్రీ' అనికలదు. ఇందులో చాల తప్పుల తడికె లున్నవి. 'అమృతభట్టారకుడు' దీనిని నాగార్జున కృతమనెను; ఇందు రససిద్ధి కలదు; ఇది 12 పుటల గ్రంథము. చివర 'నాగార్జునకృతే కనకమంజరీ దీనానాం హితార్థాయ సోపిలిఖితాయాం అమృతభట్టారకానాం రససిద్ధిం "అంటూ ఉన్నది.

5 రసరత్నాకరము- ఇది సిద్ధనాగార్జున రచితమని కొందరు, 'బోధిసత్వ నాగార్జున కృతమని' కొందరు వ్రాసిరి. ఆకాలమున శిష్యులు ప్రయత్నశీలురై ఎట్లు ప్రయత్నించుచుండిరో, నాగార్జునకృత 'రసరత్నాకరము' నుబట్టి, రసశాస్త్ర 'అధిష్ఠాత్రి' దేవియొక్క ఉద్దేశ్యముతో వ్రాయబడిన, నిమ్నలిఖిత శ్లోకమును బట్టి తెలిసికొనవచ్చును.

శ్లో॥ ద్వాదశానిచ వర్షాని మహాక్లేశో కృతోమయా యది తుష్టాసిమే దేవీ సర్వదా భక్తవత్సలే దుర్లభం త్రిషు లోకేషు రసబద్ధం దదస్వమే॥

తా॥ నేను 12 ఏండ్లవరకు శరీరపరిశ్రమ చేసితిని. ఓదేవీ! నీవు సంతుష్టిపడినచో, నాకు మూడులోకములలో దుర్లభమైన రసాయనజ్ఞానము నొసంగుము.

6 ఆరోగ్యమంజరి. 7 రసేంద్రభంగ. 8 రసార్ణవ. 9 సిద్ధ నాగార్జునీయ. 10 యోగసారము 11 యోజశతకము 12 సిద్ధ వినోదనము. 13 రతిరమణము. ఇవియన్ని సిద్ధనాగార్జున' కృతములు. ఈగ్రంథములలో ననేకచోట్ల రసాయనప్రక్రియ కుప యోగించే, అనేకయంత్రముల పేర్లు లభించుచున్నవి. ఇంకను అనేకగ్రంథముల పేర్లు వినబడుచున్నవి. కురుకుల్లకొంకల-సాధన, పద్మవజ్ర, గుహ్యాసిద్ధి అనువాని కీయనకర్తయని తెలియుచున్నది.

అల్బరూని. (971-1030) నాగార్జునుని 'రసశాస్త్రవేత్త' యని పేర్కొనెను. 'రసరత్నాకరము'నుబట్టి పాదరసమును భస్మముచేయు విధానము, వజ్రభస్మము చేయువిధము తెలిసికొననగును. ఖనిజములగూర్చి కూడగలదు. ఆకాలమున రసాయనవిద్య ఉన్నతిలో నున్నది. బట్టీలో ఔషధములు వండు పద్ధతి, ధాతువుల భస్మముచేయుట పుటముపెట్టుట మున్నగునవి దీనివలన దెలియును. ఇనుమును కాచుపద్ధతి ఇందుకలదు; రసములో 'గంధకమిశ్రమమును' తయారుచేయు విధానమును గూర్చి ఇందుకలదు. ఈయన శాస్త్రీయకళాశాలలలో 'వృతు

శాస్త్రము, రసాయనశాస్త్రము, లోహశోధన శాస్త్రము ద్రవ్యగుణ శాస్త్రము, మున్నగు సమస్త శాస్త్రములు వేలకొలది శిష్యులకు యతి నేర్పుచుండెనని, విద్వాంసులు వ్రాసిరి. పి. సి. రే. నాగార్జునుని భారతీయ రసాయన శాస్త్రమునకు జనకుడని పేర్కొనెను. ఈనాగార్జునుడు రసరత్నాకరములో 'శికండుడు' అను మరియొక రసాయనశాస్త్రవేత్తను పేర్కొనెను. ఆయన ప్రయోగములు చాల ఖ్యాతిగాంచినవని తెలియుచున్నది. కాని రసరత్నాకరకర్త 'బోధిసత్వనాగార్జునుడు' కాక 'సిద్ధనాగార్జునుడు' అని 'అల్బరూని' అభిప్రాయము. శాతవాహనునితో సంభాషణ యుండుటచేత, కర్త బోధిసత్వనాగార్జునుడని కొందరు వ్రాసిరి.

'నయనచికిత్స'కు చైనాలో విశేషమైన పేరుకలదు. దీనికర్త నాగార్జున బోధిసత్వుడని ప్రతీతి. ఈయతి చక్షురోగముల చికిత్సచేయుటలో యోగ్యతకలవాడని కొందరు వ్రాసిరి. పాట్నాలోని శిలా స్తంభముపై ఈక్రిందిచికిత్సలు కాన్పించుచున్నవి. 'నయనచికిత్స' నాకు లభించలేదు. కాని, పాట్నాలోని శిలా స్తంభముపై చెక్కబడిన యోగము 'సిద్దనాగార్జునుని'దై యున్నది. దీనిపేరు 'సిద్దనాగార్జునవర్తి' యని భైషజ్య రత్నావళి పేర్కొనుచున్నది. చూడుడు. సిద్ధనాగార్జునవర్తి భై. ర.

శ్లో॥ త్రిఫలావ్యోష సింధూత్థయష్టీ తుత్థరసాంజనం ప్రపౌండరీకం జంతుఘ్నంలోధ్రం తామ్రం చతుర్దశ ద్రవ్యాణ్యేతాని సంచూర్ణ్యవర్తిః కార్యానభోంబునా నాగార్జునేన లిఖితా స్తంభే పాటలిపుత్రకే నాశనీ తిమిరాణాంచ పటలానాం

విశేషతః సద్యః ప్రకోపం స్తన్యేన స్త్రియా విజయతే ధ్రువం కింశుక స్వరసేనాధ పైన్యం పుష్పంచ రక్తతాం అంజనాల్లో ధ్రతో యేన ఆసన్నతిమిరం జయేత్ చిరం సంఛాదితే నేత్రే బస్తమూత్రేణ సంయుతా ఉన్మీలయత్యకృచ్ఛ్రేణ ప్రసాదంచాధి గచ్ఛతి॥

తా॥ 1-3 త్రిఫలచూర్ణము, 4 శొంఠి 5 పిప్పళ్లు 6 మిరియములు 7 సైంధవలవణము 8 అతిమధురము 9 శుద్ధి చేసినమైల తుత్తము 10 రసాంజనము 11 మిట్టతామరదుంపలు 12 వాయువిడంగములు 13 లొద్దుగచెక్క 14 తామ్రచూర్ణములనువానిని ఒక్కొక్కటి తులమువంతున గైకొని ఇందు 4, 5, 6, 8, 11, 12, 13 వీని నెండించి చూర్ణించి వస్త్రగాలనముచేసి ఉంచుము. మైలతుత్తమును పెరుగులో నొకరేయి నానవైచి నిప్పుమీద పొంగించి చక్కగా తయారైన తామ్రభస్మమును, రసాంజనమును, క్రమముగా ఖల్వములో వేసి బాగుగా నూరి తర్వాత త్రిఫలములవప్పులు సైంధవలవణము వేసి, వేరువేరుగా నూరి, అందుకలిపి పిమ్మట మిగతచూర్ణములను వేసి వాననీటిలో మర్దనచేసి బాగుగా పాకమునకువచ్చిన తర్వాత ఉండలుచేసి వాడిన, అనేక నేత్రరోగములు హరించును. చనుబాలతో నూరిన కండ్ల ఎరుపులు మోదుగపువ్వు రసముతో వేసిన కండ్లలోనిపువ్వులు లొద్దుగ చెక్కరసముతో వేసిన తిమిరరోగము హరించును. ఈయోగము క్రిందటిసంవత్సర మొకఆంధ్రపత్రికలో ప్రచురింపబడినది. ఇంకను ములుగు రామలింగయ్యగారి వైద్యయోగరత్నావళి 180 వ పుట చూడుము

# IX

1 ప్రావీణ్యత, 2, మహాత్తు, 3 మతము

## 1. ప్రావీణ్యత

ఈయతి ధీశాలి; గొప్పవిద్వాంసుడు. అసాధారణ ప్రజ్ఞలు గలవాడు. ఈయన 'శూన్యమతవాది' లేక నాస్తికుడు; కాని పూజ, భక్తిమార్గముల బ్రవేశపెట్టెను; ఈయన భ్రాంతివాదమునుండియే, శంకరుని మాయవాదము కలిగినట్లు తోచుచున్నది. ఈయన తీక్ష్ణముగా మహాయానమును బోధించెను. ఈమహాయానమునుండియే హిందువుల భక్తియోగము వెలువడినదని విద్వాంసుల అభిప్రాయము.

## 2. మహాత్తులు

ఈయనకు 'అణిమాది అష్టసిద్ధులు కలవని ప్రకృతి వశీకరణము చేసికొన్నవాడని, 'హానుత్సాంగు' వచ్చునాటికి జనులు నమ్ముచుండిరి. ఆయుర్వృద్ధిని జేసికొనుటకు కాయకల్పచికిత్సను జేసికొనెనని, రసాయన ప్రక్రియల మూలమున ఆయుస్సును వృద్ధిచేసికొనెనని, ఈయన సేవించిన గుళికలు రాజునకుకూడ ఇచ్చెనని, యతి 300 ఏండ్లును, పోషకుడగు రాజు 150 ఏండ్లును జీవించియుండెనని, చివర కారాజు వారసునికోర్కెపై ప్రాణములు వీడెనని 'తారానాధుడు' మున్నగువారి వ్రాతలవలన దెలియ వచ్చుచున్నది. బీలుపండితుడుకూడ వీనిని వ్రాసెను; కాని యివియన్ని సత్యమనుట కాధారములు లేవు. జనులు మహాత్తుకొరకు కొన్నికథలను గల్పించడము

సహజము; 'హూయనుత్సాంగు' వ్రాతలనుబట్టి ఈయతి రసాయనవిద్యావేత్త యని పర్వతముపైన రాళ్లను బంగారుగా మార్చెనని, ఆద్రవ్యముతో రాజు పర్వతముమీద సుందరమైన విహారమునుగట్టించెనని తెలియుచున్నది. ముక్కు-రంధ్రములలో నీరు ప్రవేశపెట్టి దీర్ఘకాలము జీవించెనని, కొందరు వ్రాసిరి. ఈయన ఆయుస్సుకొందరు 400 అని, కొందరు 500 అని, కొందరు 600 అని, ఈయన జీవితమును చెంపిరి. ఇవి సత్యములుకావు.

'సిద్ధవినోదనము'ను బట్టి ఈయన మూడుకాలముల నెరింగినవాడని, మారణోచ్చాటనాది షట్కర్మల నెఱింగినవాడని, మహేశ్వరుని ప్రియశిష్యుడని, 'తుండి' అతని శిష్యుడని, శైవుడని తెలియుచున్నది, కాని ఈవిషయములు 'సిద్ధనాగార్జును'నికి సంబంధించినవి కాని మన 'నాగార్జునయతి'కి సంబంధించినవి కావు.

'నాగార్జునుడు' 'వంగదేశము'లోనున్నపుడు నృత్యము నేర్పు అధ్యాపకుడొకడు, తూర్పునుండి బిడ్డలనుగైకొని వచ్చెను. వారినిపిల్చి, బోధిసత్వ మహారత్నమతిని జూచెను. గురువు కూడ చూడదలచెను. ఒకఅద్దము చూపగా దానిలో నాయన నరకాగ్నిలో గాలిపోవుచున్నట్లు కాన్పించెను. రక్షించుడని యడుగగా 'శంబరుని' గూర్చి ప్రార్థించుడనిరి. ధ్యానమైన తర్వాత అతని ఆత్మయొక్క మూలకారణమును గ్రహించి, 'బోధిసత్వ మహారత్నమతి' ముఖమును గుర్తించెను. 'నాగార్జును' డపుడు ఆయనకు శక్తిగల్గుటచేత "శ్రీపర్వతము పోవలె

లెనని చెప్పెను. వేటకానివలె జీవించవలెనని, జీవులకు మేలు చేయవలెనని ఆయనచెప్పెను. 'లాగి' గుణియను సోదరీమణు లిరువురువచ్చిరి. వారిని 'దక్షిణిపద్మావతి, జ్ఞానవతి, యని పిల్వ సాగిరి. వారితో పాటు ఆయన బహుట పాపివలె నివసించెను. ఆయన 'విద్యాధర' యనుగ్రహమును సంపాదించెను. 'సావరి వలె ప్రఖ్యాతిగాంచెను.

'రామాలభద్రుని' జ్ఞానాధిక్యత అయినకొలది 'సరోహ' యను పేరుపొందెను. శిష్యుడగు 'నాగార్జునునికి'కూడ చిన్నస రోహ(Younger Saroha) యను పేరుండెను. ఈఆచార్యుని శిష్యుడు 'ల్యూవద'; ఈయనకు 'డొంబి,' ఆయనకు 'టిల్లి,' ఈయనకు 'నారో,' ఈయనకు 'చిన్నడొంబి,' ఈయనకు కుశలి భద్ర శిష్యులు. శిష్యవర్గమింకను, 'లూపి' దరిక, అంతర మున్నగువారు వేరువేరు శాఖలు స్థాపించిరి.(Mystic tales P 53.) తారానాధుడు వ్రాసిన ఈవిషయములు సిద్ధనాగార్జు నునికి సంబంధించినవని చెప్పవచ్చును.

'మంత్రయానము' టిబెటులోనికి ప్రవేశించుటకు గార ణము, నాగార్జునుడని, దక్షిణహిందూస్థానములో నినువ గోపురము దగ్గర 'బోధిసత్వ వజ్రసత్వ' మూలముగా, 'బుద్ధ వైరోచనుడు' సంపాదించిన జ్ఞానమును, 'నాగార్జునుడు' తెలిసి కొనెనని తెలియుచున్నది."[171]

ఈయన సిద్ధనాగార్జునుడే కావచ్చును. బౌద్ధులు తంత్ర గ్రంథములను నాల్గువిధములుగా జేసిరి. 1 క్రియ. 2 కార్య,

---

[171] L. A. Waddell—The Buddhism of Tibet or Lamaism P. 15.

3 యోగ, 4అనుత్తరయోగతంత్రములు. ఏసంబంధముగు జ్ఞానము 'సిద్ధనాగార్జునుని' కి కలదో తెలియదు.

రాజును, పదివేలమంది బ్రాహ్మణులను భిక్షువులుగా మార్చుటకుముందు 'నాగార్జున బోధిసత్వు'డొక మహాత్తును జూపి వారినిమార్చినట్లు తెలియుచున్నది. ఇది ఎంతవరకు సత్యమో తెలియకున్నది.

## 3. మతము

'నాగార్జునుడు' మాధ్యమిక శాఖనేర్పరచెను. ఆత్మయొక్క ఉనికినిగూర్చి ఈయన స్థిరపరచెను. కొందరుఆస్తికులు, కొందరు నాస్తికులు, కాని 'నాగార్జునుడు' మధ్యమార్గముగా మాధ్యమికశాఖ నేర్పరచెను. 'ఆత్మవుండుట, ఉండకపోవుట, అను విషయము, దానిని నీవు చూచుపద్ధతిని బట్టిఉండును" అని 'నాగార్జున బోధిసత్వుడు' వ్రాసెను.

"ఈ జగత్తుకు కొన్నిఅవస్థలకు లోబడిన ఉనికికలదు. అది పూర్తిగా సత్యముకాదు; పూర్తిగా అసత్యముకాదు. నిజముగా నేవస్తువుకు స్వభావముకాని, స్వయంభువత్వము గాని లేదు. ఈవిధముగా జగత్తుకు, కొన్నిసంబంధముల కలయిక మాత్రము కలదు. దానివలన నది నీటిచక్రమువలె గుండ్రముగా దిరుగును.........ఉత్పత్తి, లయములు, జనన మరణములు మున్నగునవి సంబంధముయొక్క మూలభావములు, వాస్తవముగా నసత్యములు. మనకు ఊహాల నుదయింప జేయును. వానిలో నశాంతి, దుఃఖముల సూత్రము లణగి

యుండును; మనుజులు వానినంటుకొని యుందురు. "శూన్యత, యనగా నిర్వాణము, నిబంధనలులేనిస్థితి. దానిలో అన్ని విరుద్ధ భావములు పోవును." ఇట్టి భావముల ననేకములు గైకొని శంకరుడు అద్వైతమతమును బోధించెను.

ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు 'నాగార్జునుడు,' బుద్ధోపదిష్టమైన 'త్రిలక్షణ,' ప్రతీత్యసముత్పాద, సిద్ధాంత ఆధారములపై, అత్యంత గంభీరదర్శనము వ్రాసెను. 'శాశ్వతవాదము' ఉచ్ఛేద వాదము, అను రెండింటిని వర్జించినందువలన, బుద్ధుడు తన యొక్క 'ప్రతీత్యసముత్పాద' అను సిద్ధాంతమును, మాధ్యమిక మార్గమని చెప్పెను. ఆ మాధ్యమిక మార్గమును అనుసరించియే 'నాగార్జునుడు' తనయొక్క 'దర్శనము'ను 'మాధ్యమిక దర్శనము' అని పేర్కొనెను. దీనిని స్పష్టముచేయుచు, ఆచార్యుడు స్వయముగా నిట్లులిఖించెను.

శ్లో॥ యః ప్రతీత్యసముత్పాదః శూన్యతాం తాం ప్రచక్ష్మహే సా ప్రజ్ఞప్తిరుపాదాయ ప్రతిపత్సైవ మధ్యమా॥

(24–18)

తా. ఏది 'ప్రతీత్యసముత్పాద'యో దానినే 'శూన్యత' అందుము. అదియే ప్రజ్ఞప్తి; 'ప్రతిపత్తు'ను గ్రహించి అదియే 'మధ్యమ' యనబడును.

'ఆచార్య నాగార్జునుడు' పరమార్థ తత్వమును శూన్య నామముతో బేర్కొనెను. అందువలన ఈదర్శనమునకు వ్యతిరేకులైనటువంటి ప్రతిపక్షులకు, వారినారోపించుట కవకాశము గల్గెను. వారిశూన్యమున కర్థమేమనగా, పరమార్థ

తత్వము నిర్గుణమనియు, బాహ్యజగత్తంతయు కంటికి కనబడున దనియు వారియొక్క భావము.

'చైనా, జపానుదేశముల'లో నాగార్జునుని శూన్యతత్వ వాదము, అచటపరిపూర్ణ భావముగా గైకొనబడెనని, 'కీత్' వ్రాసెను.[172] పరిపూర్ణసత్యభావమునుబట్టి శంకరుని వ్యవహారిక సత్యము తప్పు; కాని మాయావాదముచేత నదియు సత్యముమీదనే ఆధారపడి యున్నది. దానినిచేయు మాంత్రికుడే దానికధిపతి. 'నాగార్జునుడు' వ్రాసిన అజ్ఞానముయొక్క సత్యము సంపూర్ణముగా నసత్యమైనది. కుందేలుకొమ్మువలె గొడ్రాలుబిడ్డవలె ఉండును. ఇట్లు వేదాంతమునకు మహాయానమునకు కొన్ని ముఖ్యమగు భేదములు గలవు.

బౌద్ధులలోగల 1 వైభాషికము, 2 సౌత్రాంతిక, 3 యోగాచార, మాధ్యమిక అను 4 శాఖలలో 'నాగార్జునుని' మాధ్యమిక శాఖ ముఖ్యమైనది.

నాగార్జునుని దర్శనమునకు శూన్యమనుటకు కారణమిది. పరమార్థతత్వము నిర్గుణమైనది. ఏబాహ్య జగత్తు దృశ్యమానమైనదో, ఆసత్యము అవిద్యామూలకమైనది. ఆచార్య డిట్లు వ్రాసెను.

శ్లో॥ ద్వేసత్యే సముపాశ్రిత్య బుద్ధానాం ధర్మదేశానా లోకసంవృతి సత్యం చ సత్యంచ పరమార్థతః యే అనయోర్న విజానంతి విభాగం సత్యయోర్ద్వయోః తే తత్వం న విజానంతి గంభీరం బుద్ధశాసనే॥ (24-8-7)

[172] A. B. Keith-Buddhist Philosophy in India and Ceylon. P. 223.

తా॥ రెండుసత్యములను ఆశ్రయించి బుద్ధుని ధర్మోప దేశముండును; అందొకటి 'లోకసంవృతి సత్యము'; రెండవది 'పరమార్థసత్యము' ఎవరు ఈరెండు సత్యముల విభాగమును ఎఱుగరో, వారు 'బుద్ధశాసనమున' గల గంభీరతత్వము నెరుగరు శంకరాచార్యుని అద్వైతవాదముకూడ బ్రహ్మము యొక్క పరమార్థిక సత్యమును, జగత్తుయొక్క వ్యవహారిక సత్యమును అంగీకరించుచున్నది. ఇందువలననే, శంకరుని ప్రచ్ఛన్న బౌద్ధుడందురు. ఈప్రకారము 'శంకరుడే' అనేక విషయములను 'నాగార్జునుని' బౌద్ధదర్శనమునుండి గ్రహించి నట్లు తెలియుచున్నది. కనుక 'నాగార్జునుడు' చెప్పినది, శంక రుడు చెప్పినది స్వల్పభేదముతో నొకటియే యైనను, 'నాగార్జు నుడు' బౌద్ధుడగుటచేత, అతనిని 'శూన్యవాది'యని నాస్తికు డని భారతీయపండితులు నిరసించిరి,

# X

1 గ్రంథాలయము 2 శిష్యులు. 3 నాగార్జునునిఅంత్యకాలము. 4 పరిశిష్టము.

## 1. గ్రంథాలయము

శ్రీపర్వతమును 'హుయానుత్సాంగు' వర్ణించియుండెను. పైన బౌద్ధుల సంఘారామములో బౌద్ధుల జపమందిరములు, ఐదు శ్రేణులలో విశాలమగు చతుశ్శాలలు గలవు. పైచతుశ్శా లలో 'నాగార్జునుడు' శాక్యముని ధర్మవచన గ్రంథములను, పూసలయొక్క వ్రాతప్రతుల నుంచెను. ఇదియే నాగార్జునుని

గ్రంథాలయము. ఈయన 'సరస్వతీ భాండారము'లో 84000 సంభాషణలుగల త్రిపిటకములు, తంత్ర గ్రంథములు, ఆరోగ్య శాస్త్రములు, వైద్యగ్రంథములు, విషవైద్యశాస్త్రములు, కాయకల్ప చికిత్సాగ్రంథములు, రస, రసాయన శాస్త్రములు వృక్షశాస్త్రము, లోహశోధనశాస్త్రము, రసవాదశాస్త్రము మున్నగాగల పెక్కింటికి సంబంధించిన గ్రంథము లుండవచ్చును. పై యన్నిశాస్త్రములలో నీయతి గొప్పవాఁడేకదు. 'నాగార్జునుడే' స్వయముగా నొక సజీవగ్రంథాలయము అనుటలో సందియము లేదు. లంకలోని గ్రంథాలయముల జూచి, ఆపద్ధతిలోనే ఇచట గ్రంథాలయ మేర్పరచి యుండవచ్చును. లంకనుండి తిరిగి వచ్చినతర్వాతనే 'నాగార్జునయతి', రాజును పదివేలమంది బ్రాహ్మణులను బౌద్ధభిక్షువులుగా మార్చి, గొప్ప విద్యాలయమును, ప్రయోగశాలను, గ్రంథాలయాదుల నేర్పరచి యుండెను.[173]

## 2. శిష్యులు

నాగార్జునుని శిష్యులలో 'ఆర్యదేవుడు' ముఖ్యుడు. 'బౌద్ధతత్వ శాస్త్రమును మహాయానమును' బోధించిన ఆరుగురు ప్రధానగురువులలో 'నాగార్జును' డొకడు. 'ఆర్యదేవుడు' నాగార్జునుని క్రిందనే తరిబీతు పొందియుండెను. స్వయముగా గురు వీయనను తయారుచేసెను.

---

173 నేను వ్రాసిన ప్రాచీనభారతీయ గ్రంథాలయ చరిత్ర పుట. 75—76.

'ఆర్యదేవుడు' సింహళమునుండి వచ్చెను. 'నాగార్జునుడు' వృద్ధుడైనపుడు ఈయన యువకుడై యుండెను. ఈయన క్రీ.శ. 3వ శతాబ్దారంభములోని 'థేరదేవుడని' దేవుని కాలమునకు చాలదూరముగానట్టి గ్రంథప్రమాణములనుబట్టి యెఱుంగ వచ్చునని, కెరన్ వ్రాసెను. ఇంకను ఈ'దేవుడు' గుప్తరాజగు చంద్రగుప్త కాలములో 'నాలందా'లో నధ్యాపకుడుగా నుండెనని చెప్పుట సత్యముకాదని, 'కెరన్' వ్రాసెను. 'దేవుడు' సింహళవాసి యని చెప్పుటయే కాకుండా, ఈ 'థేరదేవుడే' నాగార్జునుని శిష్యుడైన దేవుడని కొందరు విద్వాంసులు వ్రాసిరి. 'దేవుడు' నాగార్జునునితో వాదసలు ఘెల్పుటకువచ్చి, ఇచటనే నిల్చిపోయెను.

'బీహారు'లో 'రాజగృహా'కు ఏడుమైళ్లు ఉత్తరముననున్న ఆధునిక గ్రామము 'బరగాన్' నాలందావిద్యాలయ ప్రదేశము. 'నాలందా'లోని సంఘారామము ప్రసిద్ధికెక్కినది. గొప్ప విహారము కాకముందే 'నాగార్జునుడు, ఆర్యదేవుడు' భవిష్యత్ విశ్వవిద్యాలయమునకు బీజారోపణ చేసిరని తెలియుచున్నది. 'ఫాహియాను' (క్రీ.శ. 405–411) 'నలో'ను జూచినపుడింకను విద్యాలయము పూర్తికాలేదు.

లామాతారానాథుని వ్రాతలనుబట్టి 'ఆర్యదేవుడు' నాలందా విద్యాలయస్థాపనకు కారకుడని, 'టిబెటులో' నీయనకు పేరుప్రఖ్యాతులు గలవని తెలియుచున్నది.

'హూనుత్సాంగు' వ్రాతలనుబట్టి. 'ఆర్యదేవుడు' నాగార్జునుని శిష్యుడెట్లాయెనో ఈవరకే వ్రాసియున్నాను. దేవ, గురు

వగు నాగార్జునుని అనుమతిపొంది 'మగధ' కేగి యొక తీర్థకుని తో వాదనలుసల్పి జయము పొందెను.

'వైభాషిక భదంతుడు,' 'ఆర్యదేవుని' శిష్యుడు. 'సుర, శాంతిదేవ' అనువారుకూడ శిష్యులుగా పేర్కొనబడినారు. క్రీ. శ. 200 ప్రాంతపువాడగు 'ధర్మత్రాత, యనువాడు' ఆర్యదేవుని శిష్యుడు అని 'కీత్' వ్రాసెను. క్రీ. శ. 200 ప్రాంతపువాడగు 'కుమారలబ్ధుడు' వీరి సమకాలీనుడుగా గాన్పించుచున్నాడు.

'కణదేవుడను ఆర్యదేవుడు' మూడుసిద్ధాంతములను బ్రతిపాదించియుండెను.

1 బుద్ధుడు ఋషులందరిలో మహా ప్రతిభాశాలి.

2 బౌద్ధధర్మముతో సాటిగా నేధర్మము బోధింపబడదు.

3 బౌద్ధ భిక్షువులతో సాటియైన సౌఖ్యము, భూమిమీద నెవరు అనుభవించజాలరు.

ఈమూడు సిద్ధాంతములమీద నన్నెవరైన జయించినచో, నాశిరచ్ఛేదన యగుట కంగీకరించెదను." వాదనల కనేకమంది వచ్చిరి; వారెల్ల రోడిపోయిరి. వాదనలలో నోడిపోయిన యొక విద్వాంసుడు, 'కణదేవుని'పై క్రోధముచేత, 'దేవ' తర్కసంబంధమగు నొకగ్రంథమును వ్రాయుచు, నొకనాడు ధ్యానమగ్నుడైయుండ, ఖడ్గముతో నతనిని బొడిచెను. చనిపోవునపుడుకూడ ఆర్యదేవు డిట్లనెను. "అన్ని పద్ధతులు, శాఖలు శూన్యములు; నేను లేను; నాకు హానిజేయువారు లేరు; నన్ను ప్రేమించువారు లేరు; ద్వేషించువారు లేరు. ఆమనుష్యుడు నన్ను

గాయపరచుట, నా పూర్వజన్మ సంబంధమగు దానికి ప్రతిఫలము; ఆ అనుభవమును నేనుగాను" ఇట్లు చెప్పుచు, ఒకజాతి కీటకము తనబయట రెక్కలభాగముల దీసివేయునట్లు, తనశరీరమును వదలివైచెను.[174]

'ఆర్యదేవుడు' సాంఖ్య, వైశేషికలుగాక, ఇంకను 20 ఇతర మతశాఖలను, 'లంకావతార సూత్రముల'లో చేర్కొనబడిన భిన్నమతావలంబకులను 'నిర్వాణవివరము' అనే గ్రంథములో నెదుర్కొనెను. ఈయన 9 గ్రంథములలో 3 గ్రంథములు 'టిబెటు'లో గలవు. మొదటిదగు (శతశాస్త్రము) శతకశాస్త్రమునకు, 'శతకచతుష్టయ' యని, 'చతుశ్శతక' యని పేర్లు కాన్పించుచున్నవి. 'చంద్రకీర్తి' యనువాడు తన 'మాధ్యమిక వృత్తి'లో, 'శతకచతుష్టక' (చతుశ్శతక) శతకశాస్త్ర, ఆర్యదేవపాదీయ' అను గ్రంథములను వేరువేరుగా చేర్కొనెను. అట్లయిన 'శతకచతుష్టక' భిన్నమా! ఇవిగాక 'హస్తబాలప్రకరణ' చిత్తవిశుద్ధిప్రకరణ, ఆర్యదేవుని కృతులని 'కీత్' పండితుడు వ్రాసెను. భ్రమప్రమదన యుక్తి హేతుసిద్ధి, మాధ్యమిక భ్రమఘటనాము, అనునవి 'ఆర్యదేవ' కృతములని వెనుకనే వ్రాసితిని. మిగత కృతు లెందున్నవో తెలియులేదు.

'ఇత్సింగు' వ్రాతలనుబట్టి 'నంద, నాగ' యను యిరువురు శిష్యులు నాగార్జునునికి గలరని తెలియుచున్నది. 'తుండి' ఒక శిష్యుడని ఒక ప్రమాణము తెల్పుచున్నది. 'వ్యాలి' యను

---

174 Rev. Joseph Edkins - Chinese Buddhism P. 78.

వాడు 'సిద్ధనాగార్జునుని శిష్యుడు 'నాగార్జునుని' ఇతరశిష్యుల పేర్లు తెలియవు.

హూయనుత్సాంగు వ్రాతలవలన, నాగార్జునుని మరియొక శిష్యుడు లభించుచున్నాడు. హూయనుత్సాంగు చంద్రభాగ జయపుర, నరసింహాలు దాటి 'చెక్క-దేశము' యొక్క- తూర్పు భాగమునకు జేరెను. ఇచట ఆయన ఒక గొప్పనగరమును గాంచెను. ఒక మామిడిచెట్ల తోటలో పడమటి వైపున, 700 ఏండ్లు వయస్సుగల, యొక బ్రాహ్మణుడు నివసించుచుండెను. ఆవిప్రుడు 30 ఏండ్ల ప్రాయముగల యువకునివలె కాన్పించుచుండెను. ఈయన చాలమానసిక, శారీరక శక్తులుగలవాడు; నాగార్జునునిశిష్యుడు; బ్రాహ్మణుల, బౌద్ధుల పవిత్ర గ్రంథములు లెస్సగా నెఱింగినవాడు, ఈయనదగ్గరనే 'హూయను త్సాంగు' పైలము 'ఈయాంగ్ పైలము'ను నేర్చుకొనియుండెను. ఈరెండవగ్రంథమును మన యాత్రికుడు, చైనియ భాషలోని కనువదించి యుండెను.[175] వయసువిషయ మెంత వరకు సత్యమో చెప్పజాలము.

'దేవబోధిసత్వ'కాక, 'బుద్ధోపలిత' యను మరియొక శిష్యుడు 'నాగార్జునుని'కి గలడని, 'ఐటల్' పండితుడు వ్రాసెను. 'జయప్రభ' అను మరియొక శిష్యునిపేరు కూడ శాసనములలో లభించుచున్నది.

'నాగార్జునుడు' మరణించిన తర్వాత, శిష్యులు చాలమంది కొండపైననే యుండి, ఆయనకు ఖ్యాతి తెచ్చియుండిరి. గురు

[175] Thomas Watters – On Yuan Chwang's travels in India Vol I – P. 287.

శిష్య పరంపరగా నీసంఘారామము క్రీ. శ. 5వ శతాబ్దమువరకు వర్ధిల్లి, తర్వాత క్షీణించినట్లు తెలిసికొనవచ్చును.

### 3. నాగార్జునుని అంత్యకాలము

నాగార్జునయతి 60 ఏండ్లు జీవించెనని, 29 ఏండ్లు 'విజయ పురి' ప్రక్కనున్న 'శ్రీపర్వతము' పైన నివసించెనని వెనుకనే వ్రాసియుంటిమి. 'నాగార్జునుని' మరణము వేరు వేరు విధముల జరిగినట్లు ప్రమాణములు తెల్పుచున్నవి. 'హూనుత్సాంగు' మొట్టమొదట నాగార్జునుని గూర్చి ఉల్లేఖించి యుండెను. శాతవాహన రాజకుమారుని కోర్కెపై, దర్భపుల్లతో యతి కంఠము కోసికొని, రాకుమారునిముందు పడవైచెనని ఈ విధముగా మృతికల్గెనని ఆయన వ్రాతవలన దెలిసికొనవచ్చును.

ఎడ్కిన్సు వ్రాతలనుబట్టి ఒకానొక దినమున నాకస్మికముగా సమాధ్యవస్థను బొందెనని 'ధర్మ' యను మాటలు మాత్రము వినబడెనని, యతి ఏహూవములను గాంచలేదని, దినమంత బయటకు రాలేదని, శిష్యులం తలుపును బ్రద్దలుచేసి చూడగా నాయన సమాధ్యవస్థను జెందియుండెనని, అతని ప్రాణము పోయెనని, దేశములో నన్ని రాజ్యములలో నాయన కాలయ ములు నిర్మించిరని, ఆయనను 'బుద్ధదేవుడుగా' గౌరవించిరని తెలియుచున్నది. దక్షిణహిందూస్థానమునకు ఉత్తరమునకున్న 'కోసల'లో బహుకాలము శ్రమచేసి కష్టించి తర్వాత చని పోయెనని యొకప్రమాణము తెల్పుచున్నది. చనిపోవునపు డాయన పశ్చిమ ముఖముగా సుఖావతి స్వర్గమునకేగెనని, యొకప్రమాణము తెల్పుచున్నది. జీవితకాలమంత యోగనిష్ఠ

చేసినవాడగుటచేత అంత్యకాలములో సమాధ్యవస్థను బొంది మరణించి యుండవచ్చునని ఊహ కల్గుచున్నది.

## 4. పరిశిష్టము

నాగార్జున బోధిసత్వుని జననకాలాదుల నిట్లు నిర్ణయింపవచ్చును. యతి మొత్తము 60 సంవత్సరములు జీవించెను.

క్రీ.శ. 134 విదర్భనగరము (Modern Nagapur)లో జననము.

క్రీ.శ. 140- ఏడవయేట మారకము తప్పుట- విద్యాభ్యాసము ఆరంభము

క్రీ.శ. 141- 154 వేదశాస్త్రాదులు చదువుట-అంతఃపురములో వ్యభిచారము చేయబోవ ముగ్గురు మిత్రులతో పట్టుబడుట - మిత్రులకు మరణశిక్ష - బౌద్ధధర్మదీక్ష గైకొనుటకు నాగార్జునుని ప్రమాణము - కపిమల యొద్ద దీక్ష గైకొనుట.

క్రీ.శ. 154-165 దేశసంచారము - హిమాలయముల కేగుట - త్రిపిటకశిక్షణ-ఎల్లిజండాతో ఏడేండ్లు తిరుగుట-రాజును, పదివేలమంది బ్రాహ్మణులను బౌద్ధభిక్షువులచేయుట- శ్రీ పర్వతముపై సంఘారామనిర్మాణము-లంక కేగుట-ప్రజ్ఞాపరిమితసూత్రముల, అస్థికలపెట్టె తెచ్చుట.

క్రీ.శ. -165 -194 శ్రీ పర్వతముపైన సంఘారామములో ఉండుట, అమరావతిబయట ప్రాకారముకట్టించుట-గ్రంథరచన మున్నగుపనులు.

క్రీ.శ. 194 -గదిలో సమాధ్యవస్థను బొంది నిర్వాణము చెందుట-రాజకూడ మరణించుట.

# BIBLIOGRAPHY


James Legge-Travels of Pahiyan

T. Watters - On Yuan Chwang's travels, (2 Vol)

Samuel Beal -Life of Hiuen Tsiang. (Hwiu Li)

J. Takakusu - Arecord of the Buddhist religion as Practised in India and the Malaya Archipelago.

Dr. E. Sachua - Alberuni's India

Cambridge History of India. Vol. I.

V. A. Smth - Early History of India- Oxford History of India.

Weber - The History of Indian literature.

A. A. Macdonall - A History of Sanskrit literature. India's past.

M. Winternitz -A history of Indian literature (2 Vol.)

R. C. Dutt - Ancient India.

K. R. Subrahmanian - Buddhist remains in Andhra History.

Cunningham - Ancient Geography of India.

Phanindranath Bose - Indian teachers of Buddhist Universities.

Indian Antiquary Volumes — Vol. X, XV, and XVI.

Pargiter - Dynasties of the Kali age.

G. Mackenzie - Kristna District Manual.

K. Gopalachary - Andhra History.

South Indian inscriptions Vol. IV, V and VI.
Colonel Mackenzie – Local records. 62 Vol.
Eliot inscriptions – 2 Vol.
Kondaveeti Danda Kavile. Telugu
R. G. Bhandarkar–A Peep into early History of India.
Geiger – Mahavamsa.
Kathasaritsagara.
Burgess – Buddhist Stupas of Amaravati and Jaggayyapeta.
Giles – History of Chinese literature.
Kern – Manual of Indian Buddhism.
Nanjio – Catalogue of Chinese Tripitaka.
Stein – Rajatharangini,
S. Beal– Abestract of four lectures on Buddhist literature in China. – Buddhist records of the western world–Buddhism in China.
Sir Charles Eliot – Hinduism and Buddhism, 3 Vol.
W. Y. Evans Wentz–Tibetan Yoga and secret doctrines.
Henry Alabaster – The wheel of the law.
B. Bhattacharya – An introduction to Buddhist esoterism.
Sir Charles Bell– The Religion of Tibet.
W. Stephens – Legends of Indian Buddhism.
H. H. Coates – Honen-The Buddhist saint.
A. Coomaraswamy– Buddha and the Gospel of Buddhism.

J. Gerson – Teeth relic of Ceylon.
W. H. Dawson – Buddha and Buddhism.
Har Dayal – Bodhisatva doctrine.
E. J. Eitel –A hand book of Chinese Buddhism
Nagarjuna-Kacchaputa tantra– Kanaka Manjari– Suhrullekha.
Aiyaswamy Sastri N–Bhava Sankranti Sastra.
V. Bhattacharya – Mahayana Vimsaka.
Nagasena – Milindapanha.
B. L. Suzuki – Mahayana Buddhism,
P. Lakshmi Narsu – What is Buddhism.
K. R. Reichelt – Truth and tradition and Chinese Buddhism.
Rev. Joseph Edkins – Chinese Buddhism.
G. K. Narayana – Literary History of Sanskrit Buddhism.
D. T. Suzuki – Studies in the Lankavathara Sutra.
Th. Stcherbatsky – Buddhist logic.
L. A. Waddell – The Buddhism of Tibet.
T. Richard – The new testament of higher Buddhism.
Arthur Lloyd – The creed of Half Japan.
B. L. Suzuki – Koya San.
A. B. Keith– Buddhist Philosophy in India and Ceylon.
Raichoudari H – Political History of Ancient India.

Bhupendranatha Dutta - Mystic tales of Lama Tharanatha.

Cowell and Thomas- Bana's Harsha Charitra.

Ch. Veerabhadrarao-Andhra history I. Telugu

K. V. Lakshmanarao-Hindu Mahayuga. Telugu

Jaya Chandra Vidyalankar-Ithihasa Pravesa 2. Bharatha Desake Amararathna.

Sankalia-The University of Nalanda.

Taranatha-History of Buddhism in India.

C. S. Sreenivasachari - A History of India part 1.

MAGAZINES.

Bharathi. (Telugu)

Andhrasanchikalu. (Telugu)

Modern reviews. (English)

Dharmaduta. (Hindi)

Etc.

# ప్రాచీన భారతీయ గ్రంథాలయచరిత్రపై అభిప్రాయములు.

## (A History of Ancient Indian Libraries)

### I

"This book is purely of historical interest. The author has taken immense pains to glean grains of information scattered in numerous Indological sources and to assemble them together within the covers of a book thus enabling us to have a clear conspectus of libraries in India in the past. It richly deserves a welcome on its merits. It would have been better if the book had been provided with chapter headings and running titles at the top of its pages."

"GRANTHIKA"
(Hindu - 24-11-46).

### II

The book is the result of the author's careful researches into the history of books in ancient India. Writing in India was of a comparatively later growth than Vedic civilisation The Vedic Aryans preserved their learning by memorising and not by committing to writing. The earliest known script seems to be Brahmi which had a semitic origin. Instances of its use could be traced to 700 B. C. This script was later replaced by Sanskrit and Pali. Indeed, it was the Buddhists who popularised writing in India and their inscriptions bear witness to that fact. The ancient universities of Takshasila. Nalanda and Kashmir had big libraries containing thousands of volumes of books. All these details are discussed by the author in the light of a number of reference books on early history of India. The title, however, appears not to be very appropriate for the matter dealt with in the book. History of books in ancient India would have been a better title than Grandhalayacharitra which means history of libraries,

(M.S.N.)
(Indian Express-Monday - 24-3-47).

## III

అర్యా,

మీరు అభిమానించి పంపిన "గ్రంథాలయ చరిత్ర" అందినది. చదివి మీ విమర్శనాపరిశోధక విధానానికి సంత సించాను. ఆంధ్రావనికి మిక్కిలిగా వుపకరించే పరిశోధనలు మీరు మాపత్రికాముఖంగా వెలువరించవచ్చును.

ఆంధ్రజ్యోతి సంపాదకుఁడు
శ్రీచక్రపాణిగారు.
(14-8-46 వ తేదీన నాకువ్రాసినలేఖ.)

## IV

"ఈ రచయిత తెలుగుపత్రికాపాఠకులకు పరిచయులు. పది పదిహేనేళ్ళనుండి చారిత్రక పరిశోధనలో అపారంగా పరి శోధన చేస్తూ అపూర్వమైన విషయాలను ఆంధ్రుల కెరుక పరచిన ఆచార్యుడు. పురాతన భావాల, సాంప్రదాయాల, ఇతిహాసాలలోని నగ్నసత్యాన్ని బయటపెట్టిన పండితుఁడు.

ప్రాచీనభారతీయ గ్రంథాలయచరిత్ర అందఁరూ తప్పక చదువవలసిన గ్రంథం. భారతీయ లిపి పుట్టుకనుండి, అచ్చు ఆరంభము, ముద్రణాలయములు, గ్రంథాలయాల స్థాపన, నాటి క్రమవికాసమువరకూ, అనేక అపూర్వవిషయాలను, ముద్రితాముద్రిత గ్రంథాలనుండి సేకరించి, చక్కని విమర్శనా దృష్టితో పరిశీలిస్తూ సారస్వత సత్యాన్వేషణచేసి, సత్యనిరూ పణ చేసాడు రచయిత ఈగ్రంథంలో.

ఇతిహాస పరిశోధనలో వీరి కృషి ఇంకా అనేకమార్గాల పయనించిన దని తెలిసికోడానికి ఆనందపడుతున్నాము. ఇల్లాటి పరిశోధకుణ్ణి ఆదరించి, పోషించడం తెలుగువారి విధ్యుక్త ధర్మం. ఆయనకు ఇతోధికంగా గౌరవించడం, ఆయన వ్రాతల ముద్రణకు తోడ్పడడమేకాకుండా, ఆయన కృషి సాగించుకోడానికి, ఇంగ్లండులోవలె మనప్రభుత్వంకూడా స్కాలర్‌షిప్పు నివ్వడంకూడా అవసరం. ఈయాన ఆశయాలన్నీ అప్పుడే ఫలించ గలవు. ఆఫలితాన్ని ఆంధ్రులు పొందగలరు."

(ముంజోల 22-9-46)

V

"ఎందరో ప్రఖ్యాత పరిశోధకుల గ్రంథాలను అధ్యయనంచేసి చాలశ్రమతో వ్రాసిన గ్రంథం. గ్రంథకర్త చాల వరకు తన అభిప్రాయాలను వివిధ పరిశోధకుల గ్రంథాల నుండి ఉదహరించి చెప్పారు. గ్రంథకర్త అభిప్రాయాలతో ఏకీభవింపనివారుకూడా, వారి కృషిని అభినందించక తప్పదు.

భారతదేశంలో లిపి పుట్టినప్పటినుంచి అచ్చుగ్రంథాలు వచ్చేవరకూ జరిగినపరిణామాన్ని సులభంగా అర్థమయేటట్లు గ్రంథకర్త చెప్పారు. నేటిపెట్టుబడిదారీ సమాజంలో కొందరు విజ్ఞానవ్యాప్తిని అరికడుతున్నట్లే, ఆపాతరోజుల్లోకూడచాదస్తం వల్లా, స్వార్థదృష్టివల్లా కొందరు విజ్ఞానవ్యాప్తిని అరికట్టడమూ, బౌద్ధమతాల అభ్యుదయకరమైన పాత్ర, వివిధదశలలో భారతీయ విజ్ఞానమూ కళలూ ఎలాఅభివృద్ధి అయాయో, ఇందులో

చాలా చక్కగా చూపబడ్డాయి. ఈగ్రంథంలో ప్రజావిజ్ఞానాన్ని కోరుతున్న యీకాలానికి, అంతర్గతమైన సందేశంవుంది."

(ప్రజాశక్తి 8-9-46

VI

ఆలిండియా రేడియో మదరాసు కేంద్రమునుండి ఈపుస్తకమును గూర్చి చెప్పుచు ఉత్తమోత్తమ గ్రంథమని దీనిని కొనియాడిరి. (7-11-1947)

## ఆంధ్రదేశగ్రామచరిత్రపై అభిప్రాయములు.

## (A History of Andhra Villages)

I

This book is a thesis on historical research and deals with the fortunes of a village, Modukuru in Guntur District. Though special attention is paid to the history of the village, it is only a part of the history of a small province called Kondavidu comprising parts of the Guntur, Kistna and West Godavari Districts. The book should arouse interest in historical research; and local history well may nourish local patriotism.

Indian Express 26-1-47.

II

లక్ష్మీనారాయణ చిన్నవిషయాన్ని చెప్పేటప్పుడుకూడా విపరీత పరిశోధనా విజ్ఞానాన్ని వెలిబుచ్చుతాడు. మోదుకూరు తెనాలి తాలూకాలో ఒక చిన్న గ్రామం. ఆ గ్రామచరిత్ర ఈ పుస్తకం. పాదుషాలనుండి, బ్రిటిషు ఆక్రమణాంతంవరకూ మధ్యజరిగిన అశేషచరిత్రాంశాలెన్నిటినో రచయిత పాఠకులకు పరిచయంచేసాడు ఈచిన్ని పొత్తంలో. అకే గ్రంథకర్త రచనలోని నిరుపమానశక్తి, ప్రత్యేకతా.

ములుకోల 8-1-1947

## III

ముఖ్యముగా ఈ పుస్తకము చరిత్ర పరిశోధకులకు, చాలా ఉపయోగకరమైనది. క్రీ. పూ. దాదాపు 1000 సంవత్సరాల నాటి హిందూదేశచరిత్ర సహితము సహేతుకముగా తెలుసుకొనవచ్చును. విశేషించి ఆంధ్రదేశము నందలి గ్రామపుట్టుకను మాత్రమేగాక అప్పటి ప్రజల ఆచార వ్యవహారములు, స్థితిగతులు అన్నియు విశదీకరించ బడినవి. కనుక చదువరులు, విద్యార్థులు, విమర్శకులు, చరిత్ర యందు ప్రవేశములేని వారు అయినను ఉత్సాహము తోడనే పుస్తకము చదివి ముగింతురు, ఆంధ్రులకు వాడుకలో ఉన్న, ఆరువేల నియోగులు, ప్రథమ శాఖవారు, మిరియాలవారు మొదలైన ఇంటిపేర్లు, శాఖలు ఏలాగు పుట్టినవో, గ్రామములు వాటిపేర్ల కారణము, స్థల మహాత్మ్యములు కూడ వర్ణించి వ్రాయబడినవి కనుక సనాతనులకు సహితము పుస్తకము చదువుటకు ఆసక్తి కలుగును.

విద్యాభ్యాసము పూర్తిచేసి పరిశోధనలు చేయువారికి, విద్యాభ్యాసము చేయుచున్నవారికి, కాలహరణమునకు చదువు గృహిణులకు పురాణాది గ్రంథములనేగాని చదువ కూడదనే ఛాందసులకు సహితమీ పుస్తకమున రక్తి, ఆశ కలిగించు మహోత్కృష్టమైన ఎన్నో విషయములు ఉన్నవి.

ఆంధ్ర మహిళ- 1947 మార్చి.

## IV

నవోదయ సంపాదకులైన శ్రీనీలంరాజు వెంకటశేషయ్య గారు 'చరిత్ర చినుకులు' అనే శీర్షిక క్రింద, ఈగ్రంథములోని, గుంటూరు పుట్టుపూర్వోత్తరాలు, అక్కన్న మాదన్నల హత్య, కొండవీటి రాజుల పురిటిపన్ను అను విషయములను తేది 9-2-47 నవోదయ పత్రికలో ప్రచురించుకొనినారు.

## V

ఆలిండియా రేడియో మదరాసు కేంద్రమునుండి ఈగ్రంథమును గూర్చి చెప్పుచు, విశేషముగా ప్రశంసించిరి, (9-8-1947)

## భారతవిదుషీరత్నములు — మొదటిభాగముపై అభిప్రాయములు.

1. "దీనిలో గార్గి, మైత్రేయి, లోపాముద్ర మొదలుగాగల పంచదశ భారత నారీమణుల జీవితములు కలవు. ఇది బాలికా పాఠశాలలయందు పఠనీయగ్రంథముగ నుండుటకుతగియున్నది.

—కృష్ణా పత్రిక 11-3-1933

2. "భారతదేశపు సుప్రసిద్ధ విదుషీమణుల కథలు పదునైదు ఇందు కూర్చబడినవి.........ఈకథలను చదివినవారికి స్త్రీవిద్య క్రొత్తగ నేర్పడినది గాదనియు, ఆదికాలమునసే గలదనియు, తెలియ గలదు. శైలి సులభము.........అఖిలాంధ్ర సమాదరణము సమితికి ఉత్తేజము గల్గింపగలదు.

—భారతి, శ్రీముఖ–చైత్రము

3. "............15 గురు చరిత్రలు క్రౌను పైజు 64 పుటలలో క్లుప్తముగ నిమిడించి వ్రాయబడినవి. సకలాజనంబున కవశ్యకరణీయంబు. పెక్కు గ్రంథములను జదివి సూక్ష్మముగ వ్రాయబడినది. ఇది మొదటి భాగము. త్వరలో రెండవ భాగమునుగూడ ప్రకటించి గ్రంథకర్తగారు నారీలోకంబు నజ్ఞాననిద్రనుండి మేల్కొల్పవలెనని కోరుచున్నాము.

గృహలక్ష్మి-1933 ఏప్రెలు

4. భారతవిదుషీరత్నములు. మొదటి రెండుభాగములు.
"సరళమైన భాషలో రచించబడిన ఈ భారత విదుషీమణుల జీవితచరిత్రలు బాలికాపాఠశాలలలో పాఠ్యగ్రంథాలుగా చక్కగా ఉపకరించగలవు.

ఆంధ్రప్రభ, 24-12-1944.

# గ్రంథకర్తగారి రచనలు

| | | |
|---|---|---|
| 1 | భారత విదుషీరత్నములు మొదటిభాగము | 0-6-0 |
| 2 | డిటో రెండవభాగము | 0-6-0 |
| 3 | ప్రాచీన భారతీయ గ్రంథాలయ చరిత్ర | 2-8-0 |
| 4 | ఆంధ్రదేశ గ్రామచరిత్ర | 0-8-0 |
| 5 | నాగార్జున చరిత్ర | 2-0-0 |
| 6 | ప్రాచీనయోగులు | (త్వరలో రానున్నది) |
| 7 | English Education – A rejoinder to Gandhiji. (in English) | 0-4-0 |
| 8 | British rule in India (Do) | (shortly coming) |

ప్రాప్తిస్థానము:

౧ కొడాలి లక్ష్మీనారాయణ, మోపఱ్ఱు (తెనాలి తాలూకా – గుంటూరుజిల్లా)

౨ జాకోబిన్ పబ్లిషర్సు- మారీసుపేట-తెనాలి